





# విజ్ఞానము

## ఆధునిక,భౌతిక,జీవ,గృహ,వృక్ష

# ఓషధీ భూజములు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 99999990125881

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
| --- | --- | --- | --- |
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
| --- | --- | --- | --- | --- | --- | --- |

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- | --- |

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
| --- | --- | --- | --- | --- | --- | --- | --- | --- |

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శము - ప్రజలు

# ఓషధీ భూజములు

మూలం :

డా॥ ఎస్. కె. జైన్

అనువాదం :

కె. వి. రాఘవరావు



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

న్యూ ఢిల్లీ

# తొలిపలుకు

'భారతదేశము - ప్రజలు' అను నీ శీర్షిక పుష్పగుచ్ఛమునందు యీ పుస్తకము జాతీయ పుస్తకనిధి వారు సమకూర్చిన మరొక పుష్పము.

కీర్తిశేషులైన శ్రీ పండిత జవహర్‌లాల్ నెహ్రూగారితో చేసిన సంప్రదింపుల ఫలితముగా నీ శీర్షిక యుదయించినది. మొదట నేను వారిముందీ యభిప్రాయము సూచించగనే వారు హృదయపూర్వకముగా దీని నంగీకరించుటయే గాక నిది ఆకర్షణీయముగా నుండుటకును, విస్తృతముగా నుండుటకును ఎన్నో సలహాల నిచ్చిరి. ఈ శీర్షిక వలన భారతదేశమును వివిధ విషయములలో చిత్రించు విజ్ఞానము గల పుస్తక భాండాగారము చిరస్థాయిగా నుండగలదని, జాతీయ విజ్ఞాన బోధన కిది యత్యంత యుపయుక్తమైన యుపకరణము కాగలదని వారూహించియున్నారు.

భూగోళ శాస్త్రము, భూగర్భ శాస్త్రము, వృక్ష శాస్త్రము, జంతు శాస్త్రము, వ్యవసాయ శాస్త్రము, మానవావిర్భ శాస్త్రము, సంస్కృతి, భాష మొదలైన మనదేశపు బహుముఖ విజ్ఞానముల నీ శీర్షిక ప్రబోధించుటకు ప్రయత్నించుచున్నది. దీని యున్నత లక్ష్యము భారతదేశమును గూర్చి వివిధ ముఖములలో విస్తృతముగా వ్రాయబడిన పుస్తక సముదాయమునకు నెలవేర్పరుచుట. ప్రఖ్యాతిగాంచిన రచయితలచే శాస్త్రీయ పద్ధతిలో గ్రంథములు నానా అంశముల మీద వ్రాయించుటలో మేము విస్తారముగా కృషిసల్పి యున్నాము. జన సామాన్య చదువరుల కిది యందుబాటులో నుండునటుల చేయుటకు శ్రమించియున్నాము. వివిధ అంశములనూ గూర్చి ప్రధాన సత్యములు సాధారణ విజ్ఞాన పిపాసుల కందుబాటైన తేలిక భాషలో వ్రాయబడినవి.

ప్రస్తుత మీ పుస్తకములో డా. యస్. కె. జైన్. ఆదర్శక వృక్షశాస్త్రజ్ఞుడు, దేశీయ వృక్ష పర్యవేక్షణ శాఖలో వినియోగ వృక్ష శాస్త్రవేత్త. మన దేశములో లభించు ఓషధీ మూలికలను గూర్చి ఆకర్షణీయముగా వ్రాసిరి. గత పదునైదు సంవత్సరములుగా వీరు వినియోగ వృక్షములను గూర్చి అవిరళ కృషి సల్పియున్నారు. ఆరోగ్యదాయకములైన మూలిక సంపదలో భారతదేశ మొకసముద్రము వంటిది. ప్రాచీన కాలమునుండి ఆయుర్వేద

వైద్యమందుపయోగములో నున్నప్పటికినీ చాల మూలికలను గూర్చి యితర దేశములవారికి తెలియదు. 'సర్పాసిల్' అని వాడుకలోగల 'సర్ప గంధి' యను మూలిక గడించిన ఖ్యాతినిబట్టి మన పూర్వపు ఓషధుల ప్రాతినిధ్యము ప్రపంచ ప్రఖ్యాతి నందుకున్నది. డా. జైన్‌గారు యీ పుస్తకమునందు ప్రధానమైన మొక్కలకు శాస్త్రీయమైన వర్ణనా వివరము లిందు పొందుపరచియున్నారు.

మన దేశములో గల ముఖ్యమైన ఓషధులను గూర్చి తెలుసుకొనుట కీ పుస్తకము సహకరించగలదు.

బి. వి. కేస్కర్

# విషయ సూచిక

# బొమ్మల పట్టిక

## నలుపు తెలుపు

# బొమ్మల పట్టిక



## రంగులవి

# కృతజ్ఞత విజ్ఞప్తి

రంగుల ఫలకములను, ఏకరంగు ఫలకములను గీతమాత్ర బొమ్మలను అందజేసిన యీ క్రిందివారికి రచయిత చాల ఋణపడియున్నాడు.

డా. ఎ. డి. సైని, డైరెక్టర్ బొటానికల్ సర్వే, డిపార్టుమెంటు ఆఫ్ అగ్రికల్చర్, మైసూరు; డిపార్టుమెంటు ఆఫ్ హార్టి కల్చర్, మైసూరు; బోటనీ డిపార్టుమెంటు, ఢిల్లీ యూనివర్సిటీ; డా. హర్‌భజన సింగు; డా. హెచ్. సంతాపు; డా. యమ్. ఎ. రావు; పబ్లికేషన్స్ అండ్ యిన్‌ఫర మేషన్ డైరెక్టరేట్, సి. యస్. ఐ. ఆర్; డా. రోళ్ల యస్. రావు అండ్ డా. టి. యె. రావు.

వారి శాఖలోని బొమ్మల నుపయోగించుకొనుటకు సావకాశమిచ్చినందుకు భారతీయ వృక్ష పర్యవేక్షణ శాఖ డైరెక్టర్, జాయింటు డైరెక్టర్, డిప్యూటీ డైరెక్టరుగార్లకు యీ రచయిత కృతజ్ఞత తెల్పుచున్నాడు.

దీని వ్రాత ప్రతిని చాలవరకు శ్రద్ధగా పరిశీలించిన డా. సంతాపుగారి సహాయమునకు కృతజ్ఞత తెలియజేయుటకు మాటలు చాలుట లేదు.

# ఉపోద్ఘాతము

బహుశా మానవావళి ప్రాదుర్భవించిన నాటినుండియు ఔషధ, శస్త్ర చికిత్సల చరిత్ర మొదలిడి యుండవచ్చును.

కాని చరిత్రకు పూర్వపు రోజులలో ఏ విషయ సంపదనైనను, గ్రంథ స్థము చేయుటకు సౌకర్యములు లేని కారణమున ఆ రోజులలో వైద్యము ఏ విధముగా జరిగియుండెడిదో తెల్పు సామగ్రి లేదు. ఆ రోజులలో మాన వుని రోగబాధల వాటి నివారణ, మత, మాంత్రిక, తాంత్రిక చర్యల మీద ఆధారపడి యుండెడిది. అవి గాక కొన్ని యథోచిత ఔషధ సేవలు కూడ యుండెడివి. ఎప్పుడైన, నవీన మానవుడు ప్రాచీన కాలపు వైద్య ప్రయోగ ములను ఆసక్తితో కొద్దిగా తెలుసుకొన్నను, ఆ విషయములు విశేష ఆకర్ష ణీయములుగా కన్పట్టును.

మొక్కల యొక్క వైద్య వినియోగము బహు ప్రాచీనమైనదని భారతీయ ఋగ్వేదములో కొన్ని మూలికల నుదహరించుట వలన తెలియుచున్నది. ఋగ్వేద సూక్తములలో చెప్పబడిన మొక్కలు సిమల్, పితవాన్, పలాశ్, పిపల అని సిర్ధారణగా తెలియుచున్నది. వీటిని గురించి యందు చూచాయగా మాత్రమే యుదహరించియున్నారు. వివరంగా కావాలంటె ఆయుర్వేదంలో కన్పిస్తాయి. 3500 ఎగాయతు 1800 వరకు ఋగ్వేదకాలము క్రీస్తుకు పూర్వమని యూహించుచున్నాము. ఈ విషయములో వేదముల తదుపరి 1000 సంవత్సరముల వఱకు ఏ అభివృద్ధి లేదు.

అటు తరువాత చరక, సుశృత, చరకసంహిత, సుసృతసంహిత యనునవి రెండు మహా గ్రంథములు మనకు వచ్చినవి. ఇతర దేశము లలో దొఱకు వాటితో సహా 700 మూలికలను గూర్చి సుసృతసంహితలో చెప్పబడియున్నది. కాలప్రవాహములో ఆయుర్వేద వైద్యంలోకి క్రమంగా 1500 మూలికలు చేరినవి.

వందలాది పుటలు గల యెన్నో గ్రంథములు, మూలికలను గూర్చి వివ రించునవి చిన్నవీ, పెద్దవీ మన కందుబాటులో యున్నవి. ఒకే మూలిక గుణములను గూర్చి వివిధ ప్రాంతాలలో వారు వేరు వేరుగా వ్రాశారు. ఈ కారణముగా ప్రాంతీయ భాషలలో అనేక గ్రంథము లుద్భవించినవి.

శ్రద్ధగా కృషి చేసి యీ విషయ సంపదను క్రోడీకరించిన వారు :- యు. సి. దత్తా; జి. వాట్ట్; ఆర్. యస్. చోప్రా (వారి సహాయకులు, శిష్యులు); కె. యమ్. నదకర్ని; కె. ఆర్. కీర్తికర్; బి. డి. బాసు; బి. ముఖర్జీ; చంద్ర రాజ భండారి; కే. బిస్వాస్; కె. పి. త్రివేది; "వెల్త్ ఆఫ్ ఇండియా" (ముడి పదార్థములు) సంపాదకులు మొదలైనవారు.

కొంతమంది రచయితలు, మొక్కలను గుర్తించక, వాటి పూర్తి గుణములు తెలుసుకోకుండగనే అవి మానవునికి, ఆపాదమస్తకమునకు సంభవించు రోగములను నివారణ చేయునని వ్రాసిరి.

అద్భుత శక్తిగల మొక్కలు, గారడీకు సంబంధించిన వాటిని గూర్చి ప్రాచీన గ్రంథములు తెల్పుచున్నవి. వాటి పూర్తి వివరము లెక్కడను కన్పించవు. పూర్తి వివరములు లేకుండా వాటిని గుర్తించుట అసాధ్యము. వాటికి ప్రాంతీయ నామములే వున్న ఆధారము. ఒకే ప్రాంతీయ నామము అనేక మొక్కలకుండుట తరుచు సంభవించుటచేత, వాటి ఆధారమున తప్పుదారి పట్టుట జరగవచ్చును. ఉదాహరణకు పునర్నవ, బ్రాహ్మి, బల, డుడి అను పేర్లు ఒక్కొక్కటి రెండు, మూడు మొక్కలకు వాడుకలో నున్నవి. ప్రాచీన గ్రంథములలోని కొన్ని మొక్కలను సూటిగా గుర్తించుటకు వివరములు సేకరించుటలో ప్రస్తుతము కొంతమంది కృషి చేయుచున్నారు. దీనివలన సందేహ నివృత్తి కాగలదు.

అసంపూర్తిగా రచించిన ప్రాచీన మూలిక గ్రంథములటుంచగా యీ విజ్ఞానము కొంత, దూర ప్రాంతములలో నివసించు ఆటవిక కుటుంబములలో, కాలగతిని ధిక్కరించి, వంశ పరంపరగా వచ్చుచున్నది. ఇది వారి పాటలలోను పద్యాలలోను యిమిడియున్నది. అందుబాటులో గల ఆ పాటలను పుస్తక రూపములోనికి తెచ్చుటకు చాల కృషి జరిగినది. ఈ విజ్ఞానమును, వృక్ష శాస్త్రములో నొక భాగము 'ఎత్నో బోటనీ' గా ప్రత్యేకించి యున్నారు. కొంతకాలం క్రిందట, మధ్య భారత్‌లోని ఆటవికులలో యీ విషయమును గూర్చి పరిశోధనలు ప్రారంభించితిని. ఇంతవఱకు తెలియని మూలిక గుణ విశేషము లనేకములు సేకరించి గ్రంథస్థము చేసితిని. కొన్ని మొక్కల విశేష గుణములు యీ పుస్తకమందు చేర్చితిని. వాటిని శాస్త్రీయముగా పరిశీలించవలసియున్నది.

మూలికలను, నవీనశాస్త్ర రీత్యా పరిశీలించవలసిన అవసరమున్నది.

వాటి సారంగా తీయబడిన అల్కలాయిడ్స్ గుణములు, శోధించగా మూలికల గుణములకు పూర్తిగా వ్యతిరేకంగా కన్పిస్తున్నాయి. ఒక మూలిక యొక్క గుణములు అది విరివిగా పెరుగు ప్రదేశము మీద, మొక్క యొక్క వయస్సు మీద, పూలు పూచినదా, మొగ్గలతో నున్నదా యను వివరముల మీద ఆధారపడి యుంటుంది. కాండము, ఆకులు, వేళ్లు మొదలైనవాటి నన్నిటిని కలిపి ఔషధములు చేసిన, ఆ సముదాయమునకు కనపడు పూర్తి మంచి గుణము లందొక భాగము పరిశీలించినచో నుండవు. అందువలన పై విషయమును గూర్చి పునరాలోచన చేసినగాని వాటి గుణములు, శక్తి సామర్థ్యములు నిర్ణయింపరాదు.

వైద్యమున కుపయోగపడు మందులు సుమారు 2000 లున్నవి. అందు 200 జంతు శరీరముల నుండి తీసినవి. 300 దాకా ప్రకృతిలో దొరకు లవణములు, వాటి సంయోగ పదార్థముల వలన తయారు కాబడినవి. మిగిలిన 1500 మొక్కలనుండి తయారు చేసినవే. విశాలమైన మన దేశమును, అందుగల వివిధ రకములైన మూలిక సంపద చూచినచో యీ సంఖ్య చాల తక్కువ యనే చెప్పాలి. మన దేశంలో ఉష్ణోగ్రత – 43° C లగాయతు 49° C వఱకు నుండు స్థలములు, 100 లగాయతు 10 వేల మిల్లిమీటర్ల వర్షము కురియు ప్రదేశములు, సముద్ర మట్టము మొదలు 6000 మీటర్ల ఎత్తువఱకు గల ప్రదేశములు నుండుట చేత సుమారు 20 వేల వివిధ రకములైన మొక్కలు పెరుగుచున్నవి.

1500 ల ఓషధులనుండి ఒక వంద మాత్రమే ముఖ్యమైనవి వెతికి తీయుట కష్టమైన పనియైనది. ఇండియా, ఇంగ్లాండు, యునైటెడ్ స్టేట్సు మొదలైన దేశ పరిశోధనాలయములలో పరీక్షింపబడి, వాటి ఔషధశక్తి నిశ్చయింపబడ్డ ఔషధులే యిందు పేర్కొన బడినవి. ఇండియాలో పెరుగు నవి యితర దేశములనుండి తెచ్చి యిచ్చట పరిపాటిగా పెరుగుచున్న మొక్కలను గూర్చియే వ్రాయబడినది.

బాగా వ్యాప్తిలో నున్న వాణిజ్య నామము ఒకటిగాని, తత్సమములు రెండుగాని పేర్లు ప్రతి ప్రకరణమునకు ముందు వ్రాయబడినవి. ఈ ప్రకరణములు, వృక్ష శాస్త్రీయ నామములు, అక్షర క్రమమున సమ కూర్చ బడ్డవి. నవీనముగా వాడుకలోనికి వచ్చిన శాస్త్రీయ నామములు వ్రాస్తూ, కొన్ని చోట్ల పాత పేర్లు గూడ చేర్చితిమి.

కుటుంబము పేరు తర్వాత భారతీయ నామము లివ్వబడినవి. వాటిలో ముందు హిందీ నామము, తరువాత అక్షర క్రమంగా యితర భాషలలోని పేర్లు, యింగ్లీషు పేర్లు, భారతీయ పేర్ల తరువాత వ్రాయబడినవి.

వర్తక నామమునకు, శాస్త్రీయ నామమునకు ఉత్పత్త్యర్థం సూచింపబడినది.

చదువరుల దృష్టికి మొక్క స్వరూప స్వభావములు తట్టుటకై కొద్దిపాటి వివరములు వర్ణింపబడినవి. శాస్త్రీయమైన మాటలు తప్పని సరియైతేనే ఉపయోగించుచు మొక్కల సముదాయ గుణములను దృష్టిలో పెట్టుకొని "తంతి" వ్రాయు భాషలో యీ వర్ణనలు వ్రాయబడినవి.

మొక్కలు దొరకు చోట్లు వివరించుటలో నిశ్చితమైన ప్రచురణలు, సేకరించిన మొక్కలు, సంప్రదించి వ్రాయడమైనది.

బ్రిటిష్ ఫార్మసిటికల్ కోడెక్సుగాని, యునైటెడ్ స్టేట్సు డిస్పెన్సేటరీ గాని పరిశీలించి, జంతువులమీద మనుష్యులమీద పరీక్షింపబడి, నిశ్చయింపబడిన గుణములనే మూలికలకు వ్రాయబడినవి. నమ్మదగిన ప్రచురణముల లోనివి గూడ సేకరింపబడినవి. గత ముప్పది సంవత్సరముల నుండియు వీటిపైన వెలువడిన ప్రచురణలు చూచుటకు రచయిత ప్రయత్నించారు. ఆ కృషి ఫలితంగా కొద్ది మూలికలకు మాత్రమే వైద్య పరిశీలన, పరీక్షలు జరిగినవని తెలిసినది. మనము మూలికలనుండి పూర్తి లాభమును పొందవలయునన్నచో మూలికా పరిశోధనలు బహుళములుగా జరుపవలసి యున్నది.

ఇతర ఉపయోగముల క్రింద, కర్ర వినియోగము, ఆహారము, యితర ఉపయోగములు యీ మూలికలకు చేర్చబడినవి.

ప్రధానమైన మూలికను గూర్చియే గాక దానికి సన్నిహితమైన వాటి వినియోగములు గూడ పేర్కొనబడినవి.

పది సంవత్సరముల క్రితం కేంద్ర ప్రభుత్వమువారు చేసిన అంచనాల ప్రకారం ఇండియా ప్రతిసాలునా కావలసిన మందులను యిందు తెలుపడమైనది.

గమనార్హమైన విషయమేమనగా చదువరులకు ముఖ్యమైన మూలికలను పరిచయముచేయుటయే తప్ప రోగములకు మందులు నిర్ణయించుట ఈ పుస్తకము ఉద్దేశము కాదు. ఔషధములు ఒకే మూలికనుండి గాక అనేక

మూలికలనుండి తీయబడి, నిర్ణీత నిష్పత్తిలో కలుపబడి, తగు మోతాదులలో నివ్వబడుటలోనే విశేషమున్నది. చదువరులు యీ పుస్తకమే ఆధారముగా, మూలికలను, వాటి ఔషధములను తమకు తామే యుపయోగించరని ఆశించుచున్నాను. పరిస్థితులను గమనించి మందులను నిర్ణయించుట ఆ విషయంలో ఉత్తీర్ణులయిన వారి పని.

నవీనముగా కనుగొనబడిన క్రొత్త మందులు ప్రాముఖ్యములోనికి రాగానే ప్రాచీన మూలికా ఔషధముల యందు విశ్వాసము సన్నగిలిపోయి, ప్రజాదరణ తగ్గుచున్నది. కాని ప్రాచీన మూలికా ఔషధముల ప్రాశస్త్య మును గూర్చి శ్లాఘింపవలసినది చాలగాయున్నది. అట్టి విపులీకరణమునకీ పుస్తకము చాలదు. మన దేశంలో నూటికి 80 వంతులు మూల మూల లందున్న చిన్న గ్రామములలోని ప్రజలు రోజువారీ ఆదాయం 80 లగాయతు 90 పైసల వఱకు మాత్రమే గల ఈ ప్రజానీకము, ఖరీదైన కొత్తరకం మందులు వాడలేరనే విషయంలో సందేహం లేదు.

# 1. కుప్పామని

**ACALYPHA INDICA L.** - ఇండియన్ ఎకలీఫా

**కుటుంబము :** ఇఫోర్బియేసి

**భారతీయ పేర్లు :** హిందీ - ఖోకలి, కుప్పి
బెంగాలీ - ముక్తఝురీ, ముక్తబార్సి
గుజరాతీ - వాంచికాంటో
మళయాళం - కుప్పామని
మరాఠీ - ఖోఖాలి
ఒరియా - ఇంద్రమారిస్స
సంస్కృతం - హరిత్త మంజరి
తెలుగు - మూరొ్కండ

'ఎకలీఫా' అను శాస్త్రీయ నామమే వర్తకనామముగా వాడుకలో నున్నది.

## వర్ణన

30 అంగుళముల యెత్తువరకు పెరిగెడి వార్షిక మూలిక. 3–8 సెంటి మీటర్లు పొడుగు, మూడు నరములతో అరకు చుక్క ఆకారము గల ఆకులు. ఆకు అంచుకు పళ్లుండును. ఆకుల కంటె వాటి వృంతములు పొడుగు. ఆకు కోణములందు పుష్పవిన్యాసములు స్పైకుగా నుండును. విన్యాసమునకు మొదట ఆడపువ్వులు, చివర బహు చిన్నవిగా మొగ పువ్వులు యుండును. ఆడ పువ్వులకు త్రిభుజాకారము గల పుచ్ఛములు క్రిందయుండును. రోమసహితములైన చిన్న కాయలు పుచ్ఛముల చాటున యుండును.

## విస్తరణ

చదునైన ప్రదేశములలో హిందూదేశమంతట కన్పించును. తోటలలోను,




భారతీయ ఎకలీఫా *(Acalypha indica)*

పొలములలోను కలుపుమొక్కగా పెరుగుచుండును. బంజరు భూములలోను, బాటల కిరుప్రక్కలా తరుచు కనిపించుచుండును.

## ఔషధ గుణములు

పూతమీద యున్న మొక్కను సమూలముగా తీసి యెండబెట్టి పొడుము చేసినచో నదియే ఔషధము. దీని గుణములు 'యిపికాక్' (Ipecac) ను పోలియున్నవి. బ్రోంకైటిస్, అస్థ్మ (ఉబ్బసము), న్యుమోనియా అను దగ్గులకునూ ర్హుమేటిజమ్ అను నొప్పులకును పనిచేయును. దీని వేళ్ళు, ఆకులు విరోచనకారిగా పనికివచ్చును. ఆకుల రసం త్రాగినచో డోకులు కలుగజేయును. పచ్చి ఆకులు కురుపులు, కత్తి గాయముల మీద వేసి కట్టినచో బాధలు శమించును.

## 2. వసనాభి

ACONITUM species - ఎకోనైట్

కుటుంబము : రేనన్కు లేసి.

భారతీయ పేర్లు :

*Aconitum chasmanthum* Stapf : కాశ్మీరీ – బాన్‌బాల్‌నాగ్

*A. deinorrhizum* Holmes ex Stapf : కాశ్మీరీ – దుధియాబిష్, సఫేద్ బిష్ ;

*A. heterophyllum.* Wall : కాశ్మీరీ : ఆటిస్, అటివిష్.

శాస్త్రీయ నామము వర్తకంలో వాడుకగా నున్నది ఎకోనైట్ – నాభి.

ఔషధము దుంప నుండి తీయవచ్చును. వ్రేళ్లలా కన్పించినను యీ దుంప కాండము యొక్క వికార రూపమే. ఇందులో విషపదార్థము లుండుటచేత వైద్యములోనిది బాగా వెల్లడియైన ఔషధము. బ్రిటిష్

ఫార్మకోపియా వారు ఎకోనైటమ్ నపెల్లస్ నుండి తీయబడిన ఔషధ ముగా గుర్తించి యున్నారు. భారత దేశములో నిది లేకున్నను, దీనితో సమ మైనవి కలవు.

*A. heterophyllum* (అటిస్) 2000-4000 మీటర్ల ఎత్తున పశ్చి మోత్తర హిమాలయ పర్వతముల మీద యిది దొఱకును. దీనిలోని ఔషధము యితర వికారములను పుట్టించదు. జ్వరములకు, జ్వరం తరు వాత వచ్చు నీరసములకు, నీళ విరోచనములకు, రక్త విరోచనములకు యిది యుపయోగించును. ఇటీవల జ్వరముల నివారణం కంటే బలవర్ధన కరమైన దీన్ని గ్రహించిరి.

*A. chasmanthum (Banbalnag)* బాన్‌బల్‌నాగ్ అనునది అటిస్ దొఱకు నేలలలోనే యుండును. దీనిలోని ఎకోనైటు *A. napellus* ఎకో నైటమ్ నపల్లస్ లోని దానికి సమానమైనది. పాశ్చాత్య ఎకోనైటుకు బాన్ బల్‌నాగ్‌లో నున్నది పది రెట్లుగా యున్నను, దానికంటె ఔషధశక్తి తక్కువగా గలిగియున్నది.

*A. deinorrhizum* (ఎ. డినోర్హైజమ్,) యితర సన్నిహితములైన మొక్కలు అరుదుగా మాత్రమే యుపయోగపడునవి.

'భారతీయ ఎకొనైట్' అని వర్తక వ్యాపారములో వాడుకగా నున్నది మూడు మొక్కలలో నుంచి తీయబడిన మిశ్రమము.

ఎకొనైట్సులో నుండు అల్కలాయిడ్స్ విషములగుట వలన వాటిని జాగ్రత్తగా, చిన్న చిన్న మోతాదులలో వాడవలసియున్నది. లేనిచో నవి ప్రమాదకరములైన దుర్గుణములు పుట్టించును. అందువలన దీనిని ముఖ్యముగా నరముల బలహీనతకు, పై పట్టుల కుపయోగించుచున్నారు.

## 3. వస

ACORUS CALAMUS L. - కెలామస్ *(Sweet-Flag)*

**కుటుంబము :** ఏరేసి.

**భారతీయ పేర్లు :**

| | |
|---|---|
| హిందీ | – బాక్, ఘోడాబాక్, సఫేద్ బాక్ |
| అస్సామీ | – తెమిప్రు |
| బెంగాలీ | – బాక్ |
| గుజరాతీ | – గాంధిలోవాజ్ |
| కన్నడ | – బాజిగిడ |
| మళయాళం | – వాషెంపి |
| మరాఠీ | – వేఖండ |
| సంస్కృతము | – భూతనాశిని |
| తమిళము | – వాసంబు |

మూలికకున్న శాస్త్రీయ నామమే వర్తక నామముగా వాడుకలో నున్నది.

### వర్ణన

ఇది యొక సుకుమారమైన మొక్క. దీని కాండపు దుంపలు శాఖోప శాఖలుగా భూమిలో ప్రాకును. పువ్వుల కొమ్మలు ఆకులలాంటి దొప్పల రక్షణలో నుండును. 5 లగాయతు 10 సెంటీమీటర్ల పొడుగు వఱకు పెరుగు రూళ్లకర్రలాంటి పువ్వుల కాండమున కతుక్కొని లేత ఆకుపచ్చ రంగులో చిన్న, చిన్న పువ్వులుండును. ఈ పుష్ప విన్యాసమును స్పేడిక్సు అందురు. పండ్లు పసుపు రంగు గలవి.

### విస్తరణ

ప్రధానముగా బురద నేలలలో పెరుగుచు, భారత దేశమంతటను 2000 మీటర్ల ఎత్తువఱకు వ్యాప్తిజెందియున్నది. తూర్పు, ఉత్తర హిమాలయ ములలో విరివిగా దొరకును.

## ఔషధము దాని గుణములు

ఎండించిన దుంపలే కెలామస్ ఔషధముగా వాడుదురు. ఇందు త్వరగా ఆవిరియై పోవు నూని యుండుటచేత కడుపుబ్బరమును తగ్గించి ఆకలి పుట్టించును. కడుపుబ్బరపు నొప్పులకిది యింటి మందుగా వాడుదురు. ఉబ్బసము, బ్రోంకైటిస్ మొదలైన వ్యాధులలో కళ్ళని నోటిద్వారా అవలకు నెట్టివేయుట కిందున్న నూని బాగా పనిచేయును. టెనిన్స్ అను పదార్థములుండుట వలన నీళ్ల విరోచనములకు, రక్తవిరోచనములకు కూడ పనిచేయును. ఎక్కువ మోతాదులు వాడిన డోకులు పుట్టును.

ఆకులు, దుంపలు కూడ పానీయములకు రుచి కలుగజేయును. సువాసన ద్రవ్యములు చేయవచ్చును. కీటకములను సంహరించుటకై దీనినుండి మందులు తయారుచేయవచ్చును. దీని వ్రేళ్ళనుండి తయారు చేసిన పొడుము, ప్రేగులలోని పురుగులను హరించును.

దుంపల నుండి తీసిన నూని నరములకుత్తేజమిచ్చును. సారా వలన తీసిన దీని నూని, నిద్దర పట్టించుటకును, పోటు, మంట మొదలైన బాధలు శమింపజేయుట కుపయోగపడును. ఈ కారణముగానే ఉన్మాదముల నివారణకు గూడ పనిచేయుచున్నది.

ఇటీవల బేక్టీరియములను సూక్ష్మ జీవులను సంహరించుటలో ఇది శక్తివంతమైనదని ప్రయోగముల వలన కనుగొనియున్నారు.

## 4. అడ్డసరము

ADHATODA VASICA Nees - వసాక

కుటుంబము : ఎకేంతేసి.

| భారతీయ పేర్లు : | హిందీ | - అడుస, బాన్స, వాసికా |
|---|---|---|
| | అస్సామీ | - బహక, హెరుప్పత, టీషై |
| | బెంగాలీ | - వసాక |
| | గుజరాతీ | - అల్డుసో, అర్డుసి |
| | కన్నడ | - అడుసోజి |
| | మళయాళం | - అటలోటకం |
| | మరాఠీ | - అడుల్సా |
| | సంస్కృతం | - వసాకా |
| | తమిళం | - అదడోరై, అరతోరై |
| | ఢిల్లీ | - పియా-బాన్సా |

వర్తకంలో అసాక అను పేరు శాస్త్రీయ నామము, సంస్కృతపు పేరు మీద ఆధారపడియున్నవి.

### వర్ణన

చిక్కగా కొమ్మలతో నిండి నిరంతరము పచ్చగా నుండెడి ఎత్తైన పొదగా పెరుగును. దీని ఆకులు బల్లెపు ఆకారములో పెద్దవిగా యుండును. పూల కొమ్మలు పొట్టిగా నుండి పువ్వులతో చిక్కగా నుండును. వీటిని స్పైక్సందురు. వాటి వృంతములు ఆకుల కంటె పొట్టివి. ఆకుల వంటి పుచ్ఛములు స్పైక్సునందుండును. వీటికి నరములు స్ఫుటముగా కన్పించు చుండును. ఆకర్షణ పత్రములు ఊదారంగు మచ్చలు గల్గియుండును. కాయలలో నాల్గు గింజలుండును. ఎండవలన పగిలిపోవు. ఇవి కాని యీ కాయలు నీరు పీల్చుకొనుట వలన పగులుచుండును.




వసారి (*Adhatoda vasica*)

## విస్తరణ

పల్లెలలోను, పట్టణాలలోను, దొడ్లలో పెరుగును. కొండల క్రింద చదునైన ప్రదేశములలో భారతదేశ మంతటా పెరుగును.

## ఔషధము దాని గుణములు

వసాక మందు దీని పచ్చి లేక ఎండు ఆకులలో నున్నది. వసిశిన్ అను ఆల్కలాయిడ్, ఒకవిధమైన నూని దీని ఆకులలో నున్నవి. శ్లేష్మమును కళ్లి ద్వారా యివతలకు నెట్టి వేయుటకు యీ మందుపయోగపడును. ఆకుల రసం గాని, కషాయము గాని, యుపయోగించవచ్చును. చిక్కగా నున్న శ్లేష్మమును పలుచ నగునట్లు చేయుటచేత, నోటి ద్వారా కళ్లిగా యీవలకు పడును. అందువలన బ్రోంకైటిస్ దగ్గువలన బాధపడు రోగి, శాంతిని పొందగల్గును. ఈ క్రియ బ్రోంఖియల్ గ్లాండ్సును చురుకుచేయుట చేత కల్గుచున్నది. మోతాదులు ఎక్కువైనచో డోకులు, ఉద్రిక్తత పుట్టించును. ఇటీవల పరిశోధనల ద్వారా వసాక ప్రయోజనములు నిజమని స్థిరపడినది.

## ఇతర ఉపయోగములు

దీని ఆకులు పచ్చి యెరువుగా నుపయోగపడును. వాటినుండి పసుపు రంగు తీయుదురు. ఆల్కలాయిడ్స్నన్న కారణంగా పండ్లను దీని యాకులతో చుట్టును కప్పిన అవి చెడిపోకుండా యుండును. వాసన గిట్టక పశువులు యీ ఆకులను తినవు. భూమిని బాగుచేయు కార్యక్రమములలో నీ మొక్కలుపయోగపడును.

# 5. మారేడు

AEGLE MARMELOS (L.) Correa - బేల్

కుటుంబము : రూటేసి

భారతీయ పేర్లు : హిందీ – బేల్
అస్సామీ – బెల్
బెంగాలీ – బెల్
గుజరాతీ – బిలి
కన్నడ – బిల్‌పత్రి
మళయాళం – విల్వము
మరాఠీ – బెల్
తమిళం – విల్వము
సంస్కృతం – బిల్వ, శ్రీఫలం

బాగా వాడుకలో నున్న భారతీయ నామమే వర్తక నామమైనది.

## వర్ణన

ఇది మధ్య రకంగా పెరుగు వృక్షము. ఆకు కోణంలో బలమైన ముళ్లుండును. సంయుక్త పత్రములకు 3 లగాయతు 5 వరకు చిరియాకు లుండును. ఆకుపచ్చ, తెలుపు కలసిన రంగులో సువాసన గల పుష్పము లుండును. రెండున్నర సెంటీమీటర్ల వ్యాసము గల పువ్వులు చిన్న గుత్తు లలో నుండును. పళ్లు 8 – 20 సెంటీమీటర్ల వ్యాసము గలవి, గుండ్రముగా గాని కొద్దిగా కోలగా గాని యుండును. మొదట ఆకుపచ్చగా నుండి తరువాత బూడిద రంగుగా మారును. సువాసన గలిగి, తియ్యని, హరాయణి రంగు గల గుంజు, గట్టిగా నుండు పెంకు లోపల యుండును.

## విస్తరణ

ఈ వృక్షము చదును భూములలో భారతదేశ మంతటా యుండును. దీనిని పాతి పెంచటం కూడా జరుగుతూ వుంటుంది.

## ఔషధము దాని గుణములు

బెల్ (లేక బిలే ఫ్రుక్టస్) అను ఔషధము దాని కాయ, లేక పండులోని గుంజు.

ఇందులో నుండు గుంజు, పెక్టిన్ అను పదార్థము చాల విలువైనవి. దీర్ఘవ్యాధిగా పరిణమించిన నీళ్ల, రక్త విరోచనముల మీద బాగా పని చేయును. విరోచనములు, మలబద్ధము, ఒకటి తర్వాత మరొకటి బాధిస్తూ యున్న రోగులకిది ముఖ్యముగా పనిచేయును. సూక్ష్మజీవుల కారణంగా వచ్చిన రక్తవిరోచనములు కట్టిన తర్వాత రోగుల ప్రేగులను బాగుచేయుటకు, తియ్యని షర్బత్‌లలో నిది కలిపి త్రాగినచో బాగా పనిచేయును. అపక్వ ఫలములలోని గుంజు తినినచో ఆకలి పుట్టించుటే గాక జీర్ణశక్తిని అభివృద్ధి చేయును. ఆకు, పండ్లు, వేళ్లలోను, సూక్ష్మజీవులను హరించే శక్తి యున్నట్లు యీ మధ్య జరిపిన పరీక్షల వలన నిర్ణయమైనది.

(బస్తరు జిల్లాలోని ఆటవికులు దీని వ్రేళ్లు, బెరడు తీసి కషాయం తయారుచేసి జ్వరములు తగ్గుటకు త్రాగుదురు.)

## ఇతర వినియోగములు

ప్రొడ్యూసర్ గేస్ కర్మాగారములకు బొగ్గు తయారుచేయుటకు దీని కర్రల నుపయోగింతురు. పండ్లలోని గుంజు కాగితములు మొదలైనవి అంటించుకొనుటకు జిగురుగా నుపయోగపడును. అంతేగాక దీనిని వార్నిష్‌లలోను, సిమెంటు మిశ్రమములలోను కలుపుదురు. కాయల మీది బెరడునుండి పసుపు రంగు తీయుదురు.

## 6. దుంపరాష్ట్రం

### గ్రేటర్ గలంగల్ (*Java Galangal, Galanga major*)

**ALPINIA GALANGA** Willd

**కుటుంబము :** జింజిబరేసి

**భారతీయ పేర్లు :** హిందీ – కులింజన్, సుగంధబంచ్
బెంగాలీ – కులింజన్
కన్నడం – దుంపరాస్మి
మరాఠీ – కోష్టకులింజన్
సంస్కృతం – కులాంజన్
తమిళం – పెరారత్తై

గలంగల్ అను శాస్త్రీయ నామమే వర్తకనామము. దీని సన్నిహితమైన మొక్కను చిన్న గలంగల్ అనీ దీనిని పెద్ద గలంగల్ అని వాడుక చేయుదురు.

### వర్ణన

రెండు మీటర్ల ఎత్తువరకు పెరుగు సున్నితమైన మొక్క. ఆకులు కొద్ది వెడల్పు గల్గి పొడవుగా నుండును. పైన ఆకుపచ్చగా నుండి, క్రింది భాగములో తెల్లగా నుండును. మధ్య నరము స్ఫుటముగానుంది అంచులు తెల్లగా నుండును. చిక్కని గుత్తులలో 3 సెంటీమీటర్ల పొడవుగల పువ్వులు ఆకుపచ్చ తెలుపు కలిసిన రంగులో నుండును. ఆకర్షణపత్ర సమితి పై కప్పున తెల్లగా యుండును. దానిమీద యెర్రని చార కూడ యుండును. పండ్లు ఎరుపు పసుపు కలసిన రంగులో చిన్నవిగా నుండును. క్రిందనుండు దుంపలు సువాసన గలవి.

### విస్తరణ

ఇది సహజముగా తూర్పు హిమాలయములలోను, పశ్చిమ కనుమలలోను పెరుగును. అనేకచోట్ల సాగుకూడ చేయుదురు.

## ఔషధము దాని గుణములు

పెద్ద గలంగల్ దీని యెండించిన దుంప.

రుమాటిసమ్ అనగా కీళ్ల నొప్పులకు, దగ్గువలన వచ్చు ఆయాసములకు, చంటిపిల్లల గోరింత దగ్గులకు నీ ఔషధము పనిచేయును. కడుపు నొప్పులకు, బలము నిచ్చుటకు, నోటి దుర్వాసనలు శమింపజేయుటకు, క్రిమి సంహారమునకు గూడ నుపయోగపడును. అల్లమువలెనే సువాసనతో గూడిన ఘాటు పదార్థము.

## సన్నిహిత మొక్కలు

*A. Officinarum* (చిన్న గలంగల్). ఇది గూడ ప్రాముఖ్యమైనదే. చైనా దేశంలో సహజంగా పెరుగును. అచ్చటి దుంపలు ఘాటైన వాసన, రుచి కలవి. భారత దేశమునకు ప్రతిసాలునా యీ దుంపలు 8 క్వింటాల్స్ అవసరమగుచున్నవి. ఈ మొక్కలు, మన దేశంలో సాగు చేయవచ్చును. తూర్పు ప్రదేశములు దీని కనుకూలమైనవి.

## 7. పాల

**ALSTONIA SCHOLARLS (L.) R. Br. - ఛాటిమ్ (*Dita - bark*)**

**కుటుంబము :** ఎపోసైనేసి.

**భారతీయ పేర్లు :**

| | |
|---|---|
| హిందీ | – ఛాటిన్ |
| అస్సామీ | – ఛైఛెన్ |
| బెంగాలీ | – ఛాటిమ్ |
| కన్నడ | – మద్దాలి |
| మళయాళం | – పాల |
| మరాఠీ | – సాట్‌విన్, షైటాన్ |
| ఒరియా | – ఛాటియానా |
| సంస్కృతం | – సప్తపర్ణ |
| తమిళం | – పాలై |

**ఆంగ్లనామము :** దెయ్యపు చెట్టు.

వర్తక నామము భారతీయ నామమే. సంస్కృతం పేరు ఒక వృత్తములో ఏడు ఆకులున్నట్లు సూచించుచున్నది.

### వర్ణన

సుమారు 25 మీటర్ల ఎత్తు వరకు పెరిగెడి నిత్యము పచ్చగా యుండెడి పెద్ద చెట్టు. గిల్లితే చేదుగా యుండే పాలు స్రవించును. బెరడు నల్లని బాహ్యపరంగులో గరుకు గోతులు, ఎత్తు పల్లములు గల్గి యుండును. అనేక కొమ్మ లొకచోటనుండి బయలుదేరును. చెట్టు మొదట కణుపులు గానుండి, బలమైన ప్రాపులు గల్గియుండును. 10 లగాయతు 20 సెంటీమీటర్ల పొడుగైన అకులు 4 – 7 వరకు కలసి గుంపులు, గుంపులుగా నుండును. అవి చర్మము వలె జిగిగానుండును. ఒత్తైన చిన్న పుష్పాల గుత్తులు తెలుపు హరిత వర్ణము మధ్య రకమున గన్పించును. 30 లగాయతు 60 సెంటీ మీటర్ల పొడుగు వరకుగల సన్నని కాయల జంటలు గుంపులు, గుంపులుగా వ్రేలాడును.




ఛాతిమ్ *(Alstonia scholaris)*

## విస్తరణ

ఈ చెట్టు తేమ నేలలలో దేశవ్యాప్తముగా పెరుగును.

## ఔషధము దాని గుణములు

ఘాటిమ్ మందు ఎండించిన చెట్టు బెరడు. దీర్ఘ రోగములుగా నున్న నీళ్ల విరోచనములు, రక్త విరోచనముల మీద నిది బాగా పనిచేయును.

చమటలు, నీరసములు లేకుండా చేస్తూ, యితర మందులవలె గాక, క్రమంగా మలేరియా జ్వరమును తగ్గించును. ఇది చర్మ వ్యాధులమీద గూడ పనిచేయును.

కీళ్ల కండరములను బిగబట్టి యీ ఔషధము రక్తపు పోటును శమింప జేయును. కొన్ని ప్రయోగముల వలన క్రిమి సంహారశక్తి దీనికి లేదని నిర్ణయించిరి.

## ఇతర వినియోగములు

నాసి రకం నాముగ్రి చేయుటకు దీని కర్ర యుపయోగపడును. అంతే గాక, సరకులకు రవాణా పెట్టెలు, తేయాకు రవాణా పెట్టెలు, పెన్సిళ్లు, అగ్గిపుల్లలు తయారుచేయుటకు పనికివచ్చును. ప్రాచీన కాలంలో ఈ కర్ర నుండి వ్రాసుకునే పలకలు తయారుచేసెడివారు. ఇవి బడి పిల్లల కుపయోగపడెడివి. ఈ కారణంగా దీని ప్రత్యేక నామము స్కాలేరిస్ అని పెట్టియున్నారు.

# 8. నేలవేము

ANDROGRAPHIS PANICULATA Nees. - కాలమేఘు *(Andrographis)*

కుటుంబము : ఎకేంతేసి

| భారతీయ పేర్లు: | హిందీ | – కిరయాత్, కులుఫ్‌నాత్ |
|---|---|---|
| | బెంగాలీ | – ఆయి, కాలమేఘు |
| | గుజరాతీ | – లైలున్, కరియాటు |
| | కన్నడ | – నెలబేవు. |
| | మరాఠీ | – ఒలికిర్యాటా |
| | మళయాళం | – నేలవేప్పు |
| | సంస్కృతం | – కిరాత |
| | తమిళం | – నేలవేము |
| | (మధ్యప్రదేశము | – చిరెట్టా) |

బెంగాలీ పేరునే వర్తకంలో కాలమేఘు అని వాడుచున్నారు. శాస్త్రంలో ఎండ్రోగ్రాఫిస్.

## వర్ణన

ఒక సంవత్సరం మాత్రం జీవించే సున్నితమైన మొక్క. కొమ్మలు నాలుగు పలకలుగా నుండును. ఆకులు బల్లెం ఆకారంలో నుండును. పువ్వులు చిన్నవి. అరుదుగా గుత్తులుండును. గులాబీ రంగులో పువ్వులు ఒక సెంటీమీటర్ పొడుగుగా నుండును. కాయ పగిలి విత్తనములను వెద జల్లును. ఈ క్రియ ముఖ్యముగా కాయలు తడిసినప్పుడు జరుగును. కాయ పొడవు 1. 5—2 సెంటీమిటర్లు.

## విస్తరణ

చదునైన ప్రదేశములలో భారతదేశ మంతటను వ్యాప్తిలో నున్నది.

## ఔషధము దాని గుణములు

ప్రేళ్లు మినహా మొక్క అంతా కాలమేఘు ఔషధమే.

ఇది చేదుగా నుండు బలవర్ధని. జ్వరములు, లోక్రిములు రక్త విరోచనములు, నీరసము, అపానవాయు వృద్ధి మొదలైన వాటిని శమింపజేయును. చంటిపిల్లలకు వచ్చు కాలేయ వ్యాధులకు, అజీర్తి రోగములకు బాగా పని చేయునని తెలియుచున్నది.

బెంగాల్‌లో పరిపాటిగా యిండ్లలో 'అల్తై' అనే మందు దీని ఆకుల నుండి తీసి చంటిపిల్లల కడుపు నొప్పులకు, ఉబ్బరములకు వాడుదురు.

ఇది పాముకాటుకు నివారణ కుపయోగపడునని నమ్ముదురు. కాని అది యథార్థము కాదని ఋజువైనది. టైఫాయిడ్ (సన్నిపాత జ్వరము) జ్వరమునకు, క్రిమివ్యాధులకు పనిచేయునని ప్రయోగముల వలన యీ మధ్య తెలియవచ్చినది. (బస్తర్ జిల్లాలోని ఆటవికులు దీనిని ముద్దగా నూరి ఆవనూనితో కలిపి దురదలకు తత్సంబంధమైన పొక్కులకు వాడుదురు.)

## 9. గుంట గంజేర

**ARISTOLOCHIA INDICA L.** - ఇండియన్ బర్త్ వర్ట్ (*Aristolochia*)

**కుటుంబము :** అరిష్టలోఖియేసి

| **భారతీయ పేర్లు :** | | |
|---|---|---|
| | హిందీ | - ఈసర్ మూల్, ఈశ్వరీ |
| | బెంగాలీ | - ఇసుర్ముల్ |
| | గుజరాతీ | - ఆరుక్కముల్ |
| | మరాఠీ | - సపాసన్ |
| | సంస్కృతం | - ఈశ్వరిముల్ |
| | తమిళం | - ఉతమునిలాయి |
| | తెలుగు | - గాడిదగడప |

ఆంగ్లం, శాస్త్రీయ నామములే వర్తక సరళిలో వ్యాప్తిలోనికి వచ్చినవి.

### వర్ణన

ఇది యొక ప్రాకుడు పొద. కాండము క్రింది భాగమున కఠినము గాను, పై భాగమున సుకుమారంగా మెత్తగా యుండును. ప్రధానవేరు మూలము గట్టిగా యుండును. ఆకుల స్వరూప పరిమాణము కొద్దిగా మార్పులు కల్గియుండును. కొన్ని సన్నముగా పొడుగ్గా యుండును. మరి కొన్ని మొదట సన్నముగా ప్రారంభించి పోను, పోను విస్తరించును. ఆకు కోణములలో చిన్న చిన్న గుత్తులుగా పువ్వులు బయలుదేరి ఆకుపచ్చ తెలుపు కలిసిన రంగులలో యుండును. బాకా మాదిరిగా యుండి ఊదా రంగులో నుండును. సుమారు 5 సెంటీమీటర్ల పొడవు గల్గిన కాయలు క్రింది నుండి పైకి బ్రద్దలయి, విడిపోయి, ఆరు వాల్వులు (కవాటములుగా) విడును.

### విస్తరణ

చదునైన భూములలోను, కొండల క్రింది భాగమున భారతదేశ మంతటను పెరుగును. తరుచుగా దక్షిణ భాగములోను, తూర్పు భాగము నందును గన్పించును.



**Plate 1**
కెలామస్
(*Acorus calamus*)
(10 వ పుట చూడుడు)



**Plate 2**
బెల్లడోనా
(*Atropa belladonna*)
(28 వ పుట చూడుడు)



**Plate 3**
తేస్సియా
(*Cassia angustifolia*)
సునాముఖీ చెట్టు
(45 వ పుట చూడుడు)



**Plate 4**
కోల్చికమ్
(*Colchicum luteum*)
(56 వ పుట చూడుడు)



**Plate 5 – ఐపికాక్** *(Cephaelis ipecacuanha)* (49వ పుట చూడుడు)



Plate 6 — ఫతూర (*Datura innoxia*) (61 వ పుట చూడుడు)

Plate 7 — కార్డమమ్ (*Elettaria cardamomum*) (64 వ పుట చూడుడు)

## ఔషధము దాని గుణములు

ఎండించిన కాడలు, వేళ్లు, పొడిచేసినచో నీ 'అరిష్టలోఖియా' ఔషధ మగును. చిన్న, చిన్న మోతాదులలోనే యీ మందు పయోగపడును. చిన్న మోతాదులలో నిది జీర్ణశక్తిని వృద్ధిచేసి, ఆడవాళ్ల ఋతు ధర్మమును, సక్రమ స్థితిలోనికి దెచ్చును. ఇది బలవర్ధకము. పెద్ద మోతాదులలో నిది ఆహార నాళికలో సంక్షోభము కల్గించి, మూత్రకృచ్ఛ్రములం దాందోళన పుట్టించి, డోకులు విపరీతంగా కల్గించి, తలదిమ్ము, వికారములను యుత్పత్తి జేయును. అంతేగాక గర్భ స్రావము, యితర బాధలు గూడ సంభవింప జేయును.

సరియగు మోతాదులలో జ్వరములు కుదుర్చును. రక్తపు పోటును తగ్గించును. ఉత్తేజము నొసంగును

## సన్నిహితపు మూలికలు

అరిష్టలోఖియా బ్రాక్టియోలేటా (Aristolochia bracteolata Lamk) (గుజరాతీ, హిందీలు – కిరామర్ ; సంస్కృతం – ధూమ్రపత్ర ; కన్నడం – కలగుర్కి ; తమిళం – గారియోరి – గుర్వా – అర్కా అను మూలిక.) నల్ల రేవడి నేలలందు హిందూదేశ మంతటను పెఱుగుచున్నది. దీని మందు దుర్వాసనగల పుండ్లకు, క్రిములను చంపుటకు నుపయోగపడును.

# 10. మాచిపత్రి

ARTEMISIA MARITIMA L. - వర్మిసీడ్

కుటుంబము : కంపోజిటే

భారతీయ పేర్లు : హిందీ - కిర్మని అజ్వైన్, కిర్మల చుహారి అజ్‌మడ్

కాశ్మీరీ - మురిన్

మరాఠీ - కిర్మని జీవా

పంజాబీ - ఫిత్తార్

సంస్కృతం - గదాధర

దీనికి నామాంతరము 'సెంటోనైనా'. ఈ పేరు మూలికలోగల ఔషధ పదార్థమును సూచించును.

## వర్ణన

వత్తుగా కొమ్మలు వేసి లావుగా పెరిగి రెండు లగాయతు 5, 6 సంవత్సరముల వరకు పెరిగెడి చెట్టు. ఒక మీటర్ ఎత్తువఱకు పెరుగును. ఆకుల నుండి సువాసన వచ్చును. 2 లగాయతు 5 సెంటీమీటర్ల వరకు నుండు తెల్లతెల్లని ఆకులు సన్నని చీలికలు గల్గియుండును. పైభాగపు పత్రములు చీలికలు లేక సన్నముగా నుండును. తలవిన్యాసములు, పొట్టి కాడలనుండి వచ్చును.

## విస్తరణ

ఉత్తర హిందూ స్థానములో కాశ్మీర్ లగాయతు కుమోన్ వరకు 2000-3000 మీటర్ల ఎత్తున కొండలలో పెరుగును.

## ఔషధము దాని గుణములు

ఎండించిన లేత ఆకులు, పువ్వుల మొగ్గలు మందుగా పనిచేయును.

శీతకాలం సమాప్తిలో గాని, వేసవి ప్రారంభములో గాని యీ మందు తయారు చేయవలయును. అప్పటికి పువ్వులు బాగా వికసించక మొగ్గ దశలోనే యుండును.

పూమొగ్గలున్న దశలోనే యుండుగల సెంటోనిన్ మందు ఎక్కువగా యుండి, పువ్వులు విడుచుట కారంభించగానే తగ్గిపోవుట కారంభించును. దీని ముఖ్యోపయోగము కడుపులోని పురుగులను (దారపు పురుగులు, గుండ్రని పురుగులు) బైటికి నెట్టివేయుటలో నున్నది. ఈ పురుగులు పెద్ద ప్రేగులలోనికి నెట్టబడును. అప్పటి నుండి విరోచన కారియైన మందుల ద్వారా బయటకు పోవునట్లు చేయబడును. జ్వరములకు, శరీరమునకు నీరు పట్టునపుడు యీ మందు బాగుచేయును. ఉత్తేజమును గూడ కలిగించగలదు.

## ఇతర సన్నిహితములైన మొక్కలు

ఆర్టిమీసియా జీనస్ యొక్క యితర జాతి (స్పెషీస్) ఎన్నో వైద్యమునకు పనికివచ్చును. ఆర్టిమీసియా నీలగిరికా (బెంగాలీ, హిందీలు-నాగ్‌దోనా; సంస్కృతం - నాగదమ్ని) కొంత ప్రదేశములలో దొఱకును. ఇది పురుగుల మీద, ఉబ్బసం మీద పనిచేయును. కాశ్మీర్‌లో దొరికేది *A. absinthium* (ఆర్టిమీసియా ఎబ్సింథియమ్) దీనివలన అజీర్ణి తగ్గుటే గాక, బలము చేకూరును.

సెంటోనిన్ మందునిచ్చు ఆర్టిమీసియా జాతిని హిందూ దేశంలో సాగు చేసి పెంచవలసిన అవసరమును పదే, పదే సూచించడమైనది. మనకు ప్రతిసాలునా 1000 క్వింటాల్సు మందు కావలసియున్నది.

ఆర్టిమీసియా స్పెషీసు కాశ్మీరులో, లోపల హిమాలయ పంక్తులలో పెంచవచ్చును. అంతేగాక, పంజాబ్, హిమాచల ప్రదేశ్, ఉత్తర్ ప్రదేశం లోను 2000 లగాయతు 3000 మీటర్ల ఎత్తువరకు పెంచవచ్చును.

# 11. బెల్లడోనా

**Atropa acuminata** Royle ex Lindley.

**కుటుంబము :** సొలనేసి

**భారతీయ పేర్లు :** హిందీ – అంగూర్‌శాఫా, సాగంగూర్
కాశ్మీరీ – సాగంగూర్

మరొక మొక్క ఎట్రోపా బెల్లడోనా అనుదాని నుండి వర్తక నామము వచ్చినది. ఈ మొక్క యూరోప్ దేశములలో సామాన్యంగా పెరుగును. హిందూ దేశంలో సాగు చేయుట వలన పెరుగుచున్నది.

## వర్ణన

తరుచుగా కొమ్మలతోనిండ 90 సెంటీమీటర్ల ఎత్తువరకు పెరిగెడు చెట్టు. 7 – 15 సెంటిమీటర్ల పొడవున ఆకులు, ఎరుపు, ఆకుపచ్చ కలిసిన రంగులో నుండును. మొదట, చివర సన్నముగా నుండి మధ్యన వెడల్పుగా నుండును. పసుపురంగు దళులు గల, గంట ఆకారపు పువ్వులు, ఒకటిగాని, రెండు గాని ఆకు కోణములలో మొలచును. పండ్లు, గుండ్రముగా నల్లగా సుమారు $1\frac{1}{2}$ సెంటీమీటర్ల వ్యాసము గలవి.

## విస్తరణ

2000 – 3500 మీటర్ల ఎత్తుగల కొండలమీద కాశ్మీర్‌నందు విరివిగా దొరకును. చాల ప్రదేశములలో దీనిని సాగు చేయుచున్నారు.

## ఔషధము దాని గుణములు

మొక్క పూలు పూచిన తరుణంలో దీని ఆకులు, కాడలు, వేళ్లు గూడ ఎండించి పొడుము చేసినచో నది ఔషధముగా పనిచేయును.

చమటలను, లాలాజలము, జీర్ణద్రవము అధికముగా ద్రవించుట తగ్గించును. తరంగములుగా వచ్చు ప్రేగులలోని నొప్పిని శమింపజేయును.

ఉబ్బసం, గోరింతవగ్గుల మీద గూడ పనిచేయును. పైన చెప్పిన వాటికి ఆకులు, కాడలు, ఎండించిన పొడు మువయోగించును.

వ్రేళ్లను ఎండించిన చూర్ణము, పైన చెప్పినవాటి నన్నిటినీ కుదర్చ గలదు. కాని వ్రేళ్లల్లో కొన్ని విషపు పదార్థము లున్నవని నమ్ముటవలన దానిని, కీళ్ల వాతపు నొప్పులకు, నరముల పట్టులకు, వాపులకు పైన పట్టు వేయుట కుపయోగించుచున్నారు.

## ఇతర సన్నిహిత మూలికలు

ముఖ్యమైన మరొక మొక్క ఎట్రోపా బెల్లడోనా. (Deadly Night Shade) యూరపు దేశములలో నిది ముఖ్యంగా పెరుగును. మనదేశంలో కొండలమీద సాగు చేయుచున్నారు. దీని వ్రేళ్లమందును (బెల్లడోనా రేడిక్సు అనియును, ఆకులను బెల్లడోనా ఫోలియమ్ అనియు వర్తక వ్యాపారము లందు వాడుక చేయుదురు.) ముఖ్యముగా బలవర్ధకము, నొప్పులను శమింపజేసి నిద్ర పట్టించును. తెరలు, తెరలుగా వచ్చెడి బాధలను తగ్గించును. బాధ వివరములను బట్టి మోతాదులు తేడాగా యుండును.

కంటి పాపలను విస్తరింపజేయు గుణము దీనికున్నది. దీనినుండి తీయబడిన ఎట్రోపైన్, కంటి మందుగాను, కంటిలో వేయు బిందువులకు, కంటి పరీక్షలలోను, యితర వైద్యములకును వాడుదురు. కొన్ని విష ప్రయోగముల కిది విరుగుడుగా వర్తించును.

బెల్లడోనా ఆకులు 25 క్వింటాలున్ను, వ్రేళ్లు 100 క్వింటాలున్ను ప్రతిసాలునా హిందూదేశమున కవసరమగుచున్నవి.

# 12. వేప

AZADIRACHTA INDICA A. JUSS. - నీమ్ *(Margosa tree)*

కుటుంబము : మీలియేసి.

భారతీయ పేర్లు : హిందీ - నిమ్
బెంగాలీ - నిమ్
గుజరాతీ - లింబ్రో
కన్నడం - బేవు
మళయాళం - వేప
మరాఠీ - నింబ, లింబ
ఓరియా - నిమ్
సంస్కృతం - నింబ.
తమిళం - వేప

భారత దేశంలో వ్యాప్తిగానున్న పేరే వర్తకంలో గూడా పరిపాటిగా నున్నది.

## వర్ణన

భారత దేశంలో సుపరిచితమైన చెట్టు నీమ్. పొడుగు పాటి సంయుక్త పత్రములు గలది. చివరి యాకులు మామూలు పత్రములవలె నుండును. తెల్లని పూల గుత్తులు ఆకు కోణములలో పుట్టును. కాయలలో ఒక గింజ యుండును.

## విస్తరణ

ముఖ్యంగా దక్షిణ దేశంలో వ్యాప్తి చెందినది. రోడ్లకిరువైపులా, దొడ్ల లోను దేశమంతటా పెంచుదురు.



వేప (*Azadirachta indica*)

## ఔషధము దానిగుణములు

ఎండిన చెట్టు మొదలు బెరడు, ఆకులు, వేళ్లు గూడ మందులకు వాడ వచ్చును. చేదుగానున్న బలవర్ధనకరము. విరోచనమును గట్టి పరచును. మలేరియావలె కొన్ని రోజులు ఆగి తిరిగి వచ్చు జ్వరములను నిర్మూలించును. చర్మవ్యాధులకు పనిచేయును.

ఆకులు నూరి, కురుపులకు, పొడలు మొదలైన చర్మవ్యాధులకు పైన పట్టు వేయుదురు. ఆకుల కషాయము లోపలికి పుచ్చుకున్నచో క్రిములను హరించును.

దీని క్రిమి సంహార కత్వం, చర్మవ్యాధి నివారణ శక్తి పరీక్షల వలన ఋజువైనది.

## ఇతర వినియోగములు

వేప కఱ్ఱ యిండ్లకు దూలములకు, తలుపు చెక్కలకు ద్వార బంధములు, కిటికీలకు నుపయోగింతురు. వేప నూని, తెలక పిండి, వేప జిగురు గూడ వివిధ రోగముల కుపయోగపడును.

# 13. సాంబ్రాని ఆకులు

**BACOPA MONNIERI** (L) - Pennell syn. *Herpestis monniera* **(L)** H. B. K., - బ్రాహ్మి *(Bacopa)*

*Monniera cuneifolia* Mich.

**కుటుంబం :** స్క్రోఫ్యులేరియేసి

| భారతీయ పేర్లు : | | |
|---|---|---|
| | హిందీ | - బ్రాహ్మి, సఫేద్ చమనీ |
| | గుజరాతీ | - జాల్ బ్రాహ్మి, జాల్ నెవ్రి |
| | మళయాళం | - బార్నా, నిర్బ్రహ్మి |
| | మరాఠీ | - ఘోల |
| | సంస్కృతం | - సౌమ్యలత |
| | తమిళం | - సాంబ్రాని ఎలయ్ |
| | ఆంగ్లనామము | - తైమి, ఆకుల గ్రేటియోల |

వర్తకంలో బ్రాహ్మి, బెకోపా అను పేర్లు హిందూ, శాస్త్రీయ నామముల వలన పరిపాటియైనవి.

## వర్ణన

నీళ్లు ప్రవహించు చోట్ల యిది ఒత్తుగా పెరుగును. దళసరిగా చిన్న చిన్న ఆకులుండును. కాండపు కణుపులనుండి గూడ వ్రేళ్ళు మొలచును. పొట్టి వృంతములతో పువ్వులు ఆకు కోణములందు మొలచును. రక్షక పత్రము లైదింటిలోను ఒకటి చాల పెద్దది. ఆకర్షణ పత్రములు లేత నీలం రంగున నుండును. వీటి వ్యాసమొక సెంటీమీటర్ యుండును.

## విస్తరణ

ఈ మూలిక తడి నేలలందు మనదేశమందంతటను మొలచును. సాగు చేసిన భూముల ప్రక్కను, నీటి బోదుల కిరువైపులా నూతుల చుట్టు యున్న బురదనేల లందును, యిది తరుచుగా కన్పించును.

## ఔషధము దాని గుణములు

మొక్క సమూలముగా మందునకు పనిచేయును. దీని విలువ నరముల దౌర్బల్యమును పోగొట్టు మందుగా నుపయోగపడుటలో యున్నది. ఉద్రేకంతో వచ్చెడి మూర్ఛలకు గూడ పనిచేయును. ఉన్మాదములకు, మలమూత్రములు జారీ చేయించుటకు పనిచేయును. పిల్లలకు వచ్చెడి బ్రోంకైటిస్ దగ్గుకు, దీని ఆకుల రసం ఇస్తారు. ఇది పుట్టించు డోకులు విరోచనముల వలన రోగం శాంతించును. ఆకుల రసంలో పెట్రోల్ కలిపి, పైన పూసినచో కీళ్ల వాతములు హరించును.

చంటి పిల్లల దగ్గులకు యీ మొక్కలను ఉడికించి చాతీ మీద పట్టు వేసినచో తగ్గును. ఈ మూలిక సేవించినచో రక్తమును పరిశుద్ధము చేయును.

దీనినుండి సారాయిద్వారా తీసిన మందు యుద్దీపనకరమని జంతువుల మీద పరీక్షించి స్థిరపరచారు. బ్రాహ్మీన్ అనే ఆల్కలాయిడ్ యీ మొక్కలో నున్నది. ఈ వస్తువు హృదయమునకు బలము చేకూర్చి, ఆ సంబంధమైన రోగములను కుదుర్చును.

# 14. ఇండియన్ బార్ బెర్రీ

**BERBERIS ARISTATA DC.** - *(Berberis)*

కుటుంబము : బెర్బెరిడేసి

భారతీయ పేర్లు : హిందీ — రసౌత్, దారుహల్ది, కింగోడా, కిల్మోరా

| | |
|---|---|
| బెంగాలీ | - దారుహల్ది |
| కాశ్మీరీ | - రాన్‌వాట్ |
| మళయాళం | - మారమంజల్ |
| మరాఠీ | - దారుహల్దీ |
| పంజాబీ | - కాష్మల్ |
| సంస్కృతం | - దారుహరిద్రా |
| తమిళం | - మారామంజల్ |

## వర్ణన

పెద్ద ముళ్లపొద. కర్ర పసుపు రంగుతో నుండును. కొమ్మలు తెలుపు, బూడిద రంగులో నుండును. ఆకులు, గుంపులుగా కానీ ఒకటిగాని, శాఖలు పొందిన ముళ్ల మొదట యుండును. ఆకులు బిగిగా యుండును. నరములు బహు సన్ననివి. పొట్టి గుత్తులలో పసుపు రంగు పువ్వులు. కాయ కోలగా నీలం బూడిద రంగులో యుండి విత్తనములు కొద్దిగా కల్గియుండును.

## విస్తరణ

హిమవత్పర్వతము లందును, నీలగిరి కొండలలోను 2000 లగాయతు 3000 మీటర్ల ఎత్తులో విరివిగా దొరకును.

## ఔషధము దాని గుణములు

బెర్బెరిన్ మందు ఎండు వ్రేళ్లనుండి తయారగును. సన్నిహిత మూలికలు *B. asiatica* Roxb. and *B. lycium* Royle. దీనిలో ముఖ్య




ఇండియన్ బార్‌బెర్రీ *(Berberis aristata)*




ఇండియన్ బార్‌బెర్రీ (*Berberis lycium*)

పదార్థము బెర్బిరిన్ అను ఆల్కలాయిడ్. వేళ్ళబెరడు, వేళ్ళు, క్రింద కొమ్మలు నీళ్లల్లో వుడికించి, గట్టిపడువఱకు కషాయము కాయవలయును. దానిని రసాట్ అందురు. ఇది నీటిలో కరిగిపోవును.

ఆఫ్తెల్మియా అను కంటి జబ్బుకు, రసాటును, పటిక, వెన్నలతోగాని నల్లమందు కలిపిన నిమ్మరసంలో గాని కలిపి కంటి రెప్పలకు పూసినచో తగ్గును. రేగిన పుండ్లు మాన్పుటలో శక్తి గలదని పరీక్షల ద్వారా తెలిసినది. ఇంజక్షన్ల ద్వారా పుండ్ల అంచుదగ్గరనుండి లోపలికి యీ మందు ఇస్తారు.

రసాట్ వలన జ్వరములు తగ్గును. ఇది బలవర్ధనము, విరేచనకారి. కుందేళ్ళమీద ప్రయోగములు జరిపి, రసాట్ వలన జీర్ణకోశ వ్యాధులు, కలరా, నీళ్ల విరోచనములు తగ్గునని స్థిరపరిచియున్నారు.

కొంతకాలమిది చలి జ్వరమునకు గూడ వాడి ప్రయోజనము లేదను అభిప్రాయమునకు వచ్చిరి. కాని ఆ జ్వరములు ముందుగా గుర్తించుట కుపయోగకారి యగును.

గుండెను నీరస పెట్టి దీని దుర్గుణమును ప్రయోగముల ద్వారా విశదపరచియున్నారు. క్షయవ్యాధి నివారిణిగా కూడా పరిగణించ వచ్చునని తలచుచున్నారు.

### ఇతర వినియోగములు

చర్మమును శుద్ధిచేసి, దానికి వేయు పసుపు రంగును బెర్బిరిన్ ఎరిస్టేటా కొమ్మలనుండి, వేళ్ళనుండి తీయుదురు.

## 15. అటికి మామిడి

BOERHAAVIA DIFFUSA L. - పునర్నవ

కుటుంబము : నిక్టేజినేసి

| భారతీయ పేర్లు : | హిందీ | - పునర్నవ, శాంతి, విష్ట్రప శాంటు, సుర్వారి |
|---|---|---|
| | బెంగాలీ | - పునర్నబ |
| | గుజరాతీ | - మోటో సాటోడో, నాహన్నవాసిరొ |
| | మరాఠీ | - తాంబాడీ వాసు |
| | సంస్కృతం | - రక్తకండ, పునర్నవ |
| | తమిళం | - ముక్కారట్టై |
| | తెలుగు | - అటికి |
| | (మధ్య ప్రదేశం | - పాథార్ చట్టై, ఖోంరియా) |

ఆంగ్ల నామము : హార్స్ పర్సలేన్, హాగ్ వీడ్.

వర్తక నామము సంస్కృతంలో పేరు. ప్రాచీన హిందూ నామము "స్రోతఘ్న" - అనగా నీరు పట్టుటను నివారణ చేయునది.

### వర్ణన

శాఖోప శాఖలుగా నేలమీద ప్రాకుచు, అచ్చటచ్చట కాడలు పైకి లేచును. కణుపుల వద్ద ఆకుల జంట యుండును. అందొకటి పెద్దది, రెండవది చిన్నది. ఆకు మొదట హృదయాకారముగా నుండును. పై భాగమున హరితముగా నుండి క్రింద భాగమున ఆకు తెల్లగా యుండును. పొడుగాటి కాడల చివర ఎర్ర గులాబీ రంగు గల చిన్న చిన్న పూగుత్తులు కానవచ్చును. కాయలకు 5 పల్లములు, మెరకలు యుండును. ప్రసవించు ప్రదేశములుండును.

### విస్తరణ

భారతదేశ మంతటా దొరకును.

## ఔషధము దాని గుణములు

వ్రేళ్లు, ఆకులు, విత్తనాలు, మొత్తం మీద మొక్క అంతటిలోను ఔషధ మున్నది.

ఇందులోని మందు 'పునర్నవైన్' అను ఆల్కలాయిడ్. ముఖ్యముగా నిది మూత్రము జారీ చేయును. ఈ క్రియ ఉబ్బు ఖాయలా రోగుల కత్యంత యుపయోగము. అంతేగాక కామెర్లకు, పచ్చ సెగ రోగులకు నుపయుక్తముగా నుండును. విరోచనకారి. తగు మోతాదులలో ఉబ్బసము నకు వాడవచ్చును. మోతాదు ఎక్కువయినచో డోకులు పుట్టును. జంతువుల మీద పరీక్షించి, మూత్రము జారీచేసే గుణం స్థిరపరచినారు.

# 16. మోదుగ

బ్యూటియా - *(Palas, The Flame of the Forest)*

BUTEA MONOSPERMA (Lamk.) Tanb. syn. *B. frondosa* Koen ex Roxb.

కుటుంబము : పెపిలియోనేసి

| భారతీయ పేర్లు :- | | |
|---|---|---|
| | హిందీ | - పలాశ, టేశు, డేసూ |
| | బెంగాలీ | - పలాశ |
| | గుజరాతీ | - ఖాక్రో |
| | సంస్కృతం | - పలాష |
| | తమిళం | - పలాశు |
| | తెలుగు | - పలాశము |
| | ఉర్దూ | - పలాష్‌పాప్రా |
| | (అజ్మీర్ | - మెర్‌వారా-చౌరా) |

శాస్త్రీయ నామమే వర్తకంలో వాడుక చేయుదురు. పలాశ, అరణ్య జ్యోతి అను పేర్లు భారతీయ అంగ నామములు.



Plate I—ఎకోనైట్ (*Aconitum heterophyllum*) (9 వ పుట చూడుడు)



**Plate II**—సింటెల్లా (*Centella Asiatica*) (46 వ పుట చూడుడు)



**Plate III**—సెంట్రాతిరమ్ *(Centratherum anthelminticum)*

(48 వ పుట చూడుడు)



**Plate IV**—ధతూరా (*Datura metel*) (61 వ పుట చూడుడు)

## వర్ణన

భారత దేశంలో అందరికి పరిచయమైన చెట్టు పలాశ. బాగా ఎరుపైన, పూగుత్తు లనేకము లొకచోట గుంపులుగా నుండుటచేత అరణ్యజ్యోతి యని సార్థక నామమైనది. మధ్యరకం యెత్తుగల చెట్టు. మూడేసి చిరియాకులు గల సంయుక్త పత్రములుండును. చిరియాకుల మీద గౌర వర్ణముగల పట్టు వంటి నూగుండును. వాటి క్రింద భాగమున స్ఫుటమైన నరములు కన్పించును. శీతా కాలంలో ఆకులను రాల్చును. నారింజ పండు రంగులో చిన్న, చిన్న గుత్తులు ఒత్తుగా వర్ణహీనమైన కొమ్మల నావరించి యుండి, చెట్టు కొమ్మలకి రంగు పూత పెట్టినట్లు కనిపించును. ఒక గింజతో పల చగా కాయలుండును. ఈ స్థితినే మోనోస్పెర్మా యను మాట స్ఫురింప జేయును.

## విస్తరణ

ముఖ్యముగా పశ్చిమ, మధ్య భారతదేశం అంతటా పలచగాను, ఆకు రాల్చు అరణ్యములలో నుండును. కొండల క్రిందనున్న చిట్టడవులందును, చదునైన ప్రదేశములందును తరుచుగా కన్పట్టును.

## ఔషధము దాని గుణములు

'బెంగాల్ కినో' లేక 'బ్యూటియా గమ్' అని వాడుకలోనున్న చెట్టు నుండి వచ్చు యెర్రని జిగురు, దీని విత్తనములు మందులుగా పనిచేయును.

జిగురులో 'టేనిన్సు' అను పదార్థము లుండుటవలన నీళ్ల విరేచనములు కట్టించును. విత్తనముల చూర్ణము, ప్రేగులలోని పురుగులను సంహరించును. పలుచని బద్దిలాంటి పురుగులను, గుండ్రని పురుగులను హరించుటకు గూడ వాడవచ్చును. ఈ రెండవరకం పురుగులను పూర్తిగా హరింప గలదని యిటీవల ప్రయోగముల వలన స్థిరపడినది. బ్యూటియా విత్తులు, సేంటోనైనాకు సమమైన మందుగా వర్తించుచున్నవి. వీటిని నిమ్మకాయ రసంలో నూరి పట్టువేసినచో 'చాకలి కురుపులు' నివారించును. తామర అను చర్మవ్యాధికి వాడవచ్చును. వ్రేళ్లమీది బెరడు కషాయం వల్ల రక్తపు పోటు నివారించును.

### ఇతర వినియోగములు

లక్క పురుగులకు యీ చెట్టు ఆటపట్టుగా నున్నది. పూలనుండి పసుపు రంగు తీయుదురు. నీటిలో నానిననూ దీని కఱ్ఱ చెడదు. అందువలన నూతుల క్రిందిభాగములలో అంచులు కట్టుటకును, నీరు నిల్వజేయు తొట్టెల కును దీని నుపయోగింతురు. చిన్న కట్టడములలో వాసములు, దూలములు గాను వంటచెఱకుగాను వినియోగింతురు. దీని ఆకులనుండి విస్తళ్లు కుట్టు దురు, పశువులు మేయును.

### సన్నిహిత మొక్కలు

బ్యూటియా సుపెర్బా Roxb. (హిందీ - పలాశలత) ఇది బలమైన ప్రాకుడు తీగ. భారతదేశ మంతటా వ్యాప్తిలోనున్నది. దీని యాకుల రసం వలన పిల్లలకు వచ్చేటి ఉడుకు పొక్కులు మానును.

## 17. రేల

CASSIA FISTULA L. - కేస్సియా *(Indian Laburnum)*

కుటుంబము : సీసల్పినియేసి

| భారతీయ పేర్లు : | హిందీ | - అమల్టాస్, కిల్వారీ, కిరాల, సినార్ |
|---|---|---|
| | అస్సాము | - సోనేరు |
| | బెంగాలీ | - సోనాలి, బాందార్లఠి |
| | గుజరాతీ | - గార్మాల |
| | కన్నడ | - కక్కె |
| | మళయాళం | - క్రిటా మలమ్ |
| | మరాఠీ | - బాహావ, జంబా |
| | సంస్కృతం | - సువర్ణక |
| | తమిళం | - కొన్నై, అలాస్ |

శాస్త్రనామము వర్తకనామము. దీని కాయలు గొట్టెల కాపరి బూరాలా యుండును గనుక 'ఫిస్ట్యులా' అను పేరు వచ్చినది.

## వర్ణన

సంయుక్త పత్రములు గల మధ్యరకం చెట్టు. చిరియాకులు నలుపు డవులు గల ఆకుపచ్చ రంగులో నుండును. చిక్కని పసుపు రంగు గల పూలతో కాడలు పొడవైనవి వ్రేలాడుచుండును. నల్లటి రూళ్ల కఱ్ఱలలాంటి 50 – 60 సెంటీమీటర్ల పొడవు గల కాయలుండును. దీని పూలగుత్తులు, కాయలు, పొడవుగా నాకర్షణీయముగా నుండుట వలన అడవులలో దూరం నుండియే గుర్తించవచ్చును. వేసవి అనగా మార్చి లగాయతు మే వఱకు ఆకులను రాల్చి యీ చెట్టు పూల గుత్తులతో నిండియుండును.

## విస్తరణ

1500 మీటర్ల ఎత్తు వరకు భారతదేశ మంతటా నిది కన్పించును. తేమ నేలలు గల నిత్యము పచ్చగా యుండెడి అరణ్యములలో తరుచుగా కానవచ్చును. అందమునకై దీనిని రోడ్ల కిరువైపులను, విలాస వనముల లోను వేసి పెంచుదురు.

## ఔషధము దాని గుణములు

చెట్టు భాగములన్నియు మందుకు పనికివచ్చునను అభిప్రాయమున్నను, దీని కాయలే ముఖ్యమైన వని భారతీయ ఫార్మసిటికల్ కోడెక్సునందున్నది. 'కేసియాఫిస్చులా' అనెడి కాయలలోని గుజ్జు (రేలగుజ్జు) ప్రఖ్యాతమైన విరోచనకారి. ఎక్కువ మోతాదులలో విరోచనములు జాడించికొట్టును. తల తిరుగుట, కడుపు బిగబట్టుట కలిగించును. దీనిని "సెన్నా" సునా ముఖి ఆకుతో కలిపి వాడుదురు.

## ఇతర వినియోగములు

చెట్టు బెరడు 'సుమారి' అను దానియందు (టేనిన్సు) ద్రావకము పుష్కలముగా నున్నవి. కఱ్ఱ గట్టిగాను జిగిగాను యుండును. ఇంటి దూలములు, స్తంభములు మొదలైన వాటికి, వంతెన నిర్మాణమునకు వ్యవసాయపు పనిముట్లు చేయుటకు నుపయోగపడును.




కేస్సియా (*Cassia fistula*)

## సన్నిహిత వృక్షములు

కేసియా అంగుష్టి ఫోలియా వాహల్ *(Indian Senna, Tinnevelly Senna)* హిందీ - సనై, సంస్కృతం - భూపద్మ, మళయాళం - నిలవక) ఒక పొదగా అరేబియా, సోమాలీ లేండు లందు పెరుగును. దక్షిణ భారత దేశంలో నిది సాగుచేసి పెంచుచురు. దీని ఆకులు, కాయలు, విరోచన కారులుగా నుపయోగపడును. దీర్ఘంగా యుండు మలబద్ధమున కిది మంచి పనిచేయును. చంటి పిల్లల తల్లులీమందు సేవించినచో వారిచ్చు పాలద్వారా పిల్లలకు విరోచనములగును.

కేసియా యితర స్పెషీస్ (సన్నిహితులు) అరుదుగా మందున కుపయోగపడును.

## 18. బొక్కుడు

సింటెల్లా *(Indian Pennywort)*

CENTELLA ASIATICA *(L)* Urban syn. *Hydrocotyle asiatica* L.

**కుటుంబము :** అంబెల్లిఫెరె

**భారతీయ పేర్లు :** హిందీ – బ్రహ్మి, బహ్మ మాండూకి, బుఘ బ్రహ్మణి

| | |
|---|---|
| బెంగాలీ | – థాంఖూరియా |
| గుజరాతీ | – బార్మి |
| కన్నడ | – వొండెలాగ |
| మరాఠీ | – బ్రాంహ్మి. |
| పంజాబీ | – బ్రాంహ్మిబుటి |
| సంస్కృతం | – మండూకపర్ని |
| తమిళం | – వొల్లారియిలేయి |
| తెలుగు | – సరై తంగూడు ఆకులు సరస్వతీ యాకు |
| నాగాహిల్సు, అస్సాము | – ఆఘున్య |
| సిల్ చార్ | – టూనిమంకోని |
| సిక్కిమ్ | – గ్రోడ్టాపి |

కప్ప చేతిగోళ్ల ఆకారమును స్ఫురింపజేయు ఆకుల వలన దీనికి సంస్కృతంలో మండూకపర్ని అను నామము వచ్చినది.

### వర్ణన

కణుపుల నుండి వ్రేళ్లు దింపుచు, నఖముఖములా నేలమీద ప్రాకెడు మూలిక. 2 – 4 సెంటీమీటర్ల వ్యాసము గల, మూత్ర కృచ్ఛ ఆకారము గల్గిన ఆకులతో నుండును. ఆకుల అంచు పళ్లతో (అనగా గొగ్గు, గొగ్గులుగా) నుండును. 3 లగాయతు 6 వరకు గల గుత్తులలో ఎఱ్ఱని

చిన్న పువ్వులుండును. బార్లీ గింజల వంటి కాయలకు 7 - 9 వరకు గొప్పులు పల్లములు యుండును.

## విస్తరణ

భారతదేశ మంతటా నీరు ప్రవహించు కాల్వలు, బోదులు మొదలైన వాటి కిరువైపుల తడి నేలలందు విరివిగా వృద్ధిజెందును. చెరువుల అంచులందును, నీరు పెట్టిన పొలములలోనుగూడ నిది మొలచును.

## ఔషధము దాని గుణములు

పచ్చివి, ఎండువి కొమ్మలు ఆకులు మందుగా పనిచేయును. వ్రేళ్లు గింజలు గూడ వైద్యమున కుపయోగింతురు. కుష్టు రోగనివారణకు దీని యాకుల కషాయమును రోగుల కిత్తురు.

'ఎషియాటు కోసైడ్' అను పదార్థమీ మొక్క యందున్నది. దీనివలన కుష్టురోగము కుదురును. జంతువుల మీద వాడి పరీక్షించగా నిది, చర్మము, తల వెంట్రుకలు, గోళ్లు త్వరితముగా పెరుగుటకు దోహదము చేయునని తెలియవచ్చినది.

అంతేగాక కొన్ని రకములైన క్షయ వ్యాధులకు, బుద్ధిమాంద్యమును పోగొట్టి, చురుకైన మేధాశక్తి కల్గించుటకును నిది వాడుదురు.

# 19. అడవి జీలకర్ర

CENTRATHERUM ANTHELMINTICUM (Willd) Kuntze

syn. *Vernonia anthelmintica* Willd. - సెంట్రాథిరమ్ *(Somraj)*

కుటుంబము : కంపోజిటే

| భారతీయ పేర్లు : | | |
|---|---|---|
| | హిందీ | - సోమరాజి, బంజీరా |
| | బెంగాలీ | - సోమరాజ్ |
| | గుజరాతీ | - కలిజిరి |
| | కన్నడ | - కాడుజిరాజి |
| | మళయాళం | - కట్టుజిరాకమ్ |
| | మరాఠీ | - కాలెన్జిరి |
| | పంజాబీ | - సోమరాజ్ |
| | సంస్కృతం | - సోమరాజి |
| | తమిళం | - కట్టుశీరగం |
| | ఉర్దూ | - జాంగ్లిజిరి |

(ఘర్‌వాల్ - కాలాజిరా)

వర్తకంలో సెంట్రాథిరమ్ సోమరాజ్ అను పేర్లు, శాస్త్ర, సంస్కృత నామముల మీద నాధారపడినవి. ప్రేగులలోని పురుగులను సంహరించును గనుక యాంథెల్మింటికమ్ అను పేరు సార్థకముగా నుంచిరి.

## వర్ణన

నిలువున పొదగుగా పెరిగెడి మొక్క. ఆకులకు, కొమ్మలకు సన్నని రోమములుండును. ఆకులు 6-10 సెంటీమీటర్ల పొడవు. వృంతము వైపు, కొనవైపు సన్నగిల్లి, అంచునందు పళ్లుండును. పూతలలు 1.5-2.5 సెంటీమీటర్ల వ్యాసము గలవి. అవి చిన్న గుత్తులుగా నుండును. పూతలలందు 30-40 మెఱుపు చాయగల చిన్ని పువ్వులుండును. కాయలు పది గొప్పులతో గుండ్రడంగా రోమములతో నిండి 4.5 లగాయతు 6 మిల్లిమీటర్ల

పొదవు గల్గియుండును. పిలకవంటి రోమముల గుత్తులు యెత్తుని ఎకిన్సుకు పైభాగమున నుండును.

### విస్తరణ

1500 మీటర్ల ఎత్తువఱకు భారతదేశ మంతటా ముఖ్యముగా బంజరు భూములలోను, పల్లెలందును కనపడును.

### ఔషధము - దాని గుణములు

తాజాగాతయారైన విత్తులు ఎండినవి మందుకు పనిచేయును.

శాస్త్రీయ నామ ప్రకారం ప్రేగులలోని క్రిములను సంహరించును. దారంలాంటి పురుగుల కిది ముఖ్యముగా వాడుదురు.

ప్రాచీన గ్రంథములలో దీనికి చెప్పిన గుణములు, ఉద్దీపనకారిత్వము, కురుపుల వలని వాపుల కుపయోగపడు శక్తి, మూత్రం జారీచేసే గుణము యథార్థములు గావని ప్రయోగ పరీక్షల వలన తెలిసినది. వైద్యశాలలందు ప్రయోగముల ద్వారా దారపు పురుగులను హరించునని స్థిరపడినది.

## 20. ఇపికాక్

CEPHEALIS IPECACUANHA (Brot.) A. Rich. - *(Ipecacuanha)*

**కుటుంబము :** రుబియేసి

### వర్ణన

చిన్న పొద. సన్నని వ్రేళ్లు నలువైపులా ప్రాకును. ముదురు దుంపలకు ఉంగరముల వంటి గీతలు సర్వత్రా యుండును. కణుపులవద్ద ఎదురు బదురుగా రెండు ఆకులుండును. ఆకుకొన సన్నగిలి యుండును. అంచు సరాసరిగా యుండును. పువ్వులు చిన్న గుత్తులలో తెల్లవిగా నుండును.

## వి రణ

ఇది అమెరికా ఖండములో బ్రెజిల్ దేశమందుండెడి మొక్క. దక్షిణ భారతదేశములోను, అస్సాము, బెంగాల్ పరగణాలలో సాగుచేసి పెంచు చున్నారు.

## ఔషధము దాని గుణములు

దీని దుంపలు ఇపికాక్ మందగును. ఆకలి లేకపోవుట, ఎమీబాయను సూక్ష్మజీవులవలన వచ్చెడి రక్త విరోచనములకు నుపయోగపడును. దగ్గులలో శ్లేష్మము కళ్లిద్వారా యీవలకు వచ్చుటకు దీనిని వాడుదురు. చెమటను పట్టించును.

మనదేశమునకు ఏటా కావలసిన 700 క్వింటాల్సుతో పోలిస్తే దీని యుత్పత్తి చాల తక్కువగా యున్నది. దీని సాగు అభివృద్ధి చేయవలసినదని సిఫారసు చేయబడినది. ఒరిస్సాలో కొన్ని భాగములు, బెంగాల్, అస్సాములలో దీని సాగుకు వీలుగా నున్నది.

# 21. క్వైను

CINCHONA species - సిన్‌ఖోనా

కుటుంబము : రూబియేసి

భారతీయ పేర్లు : మామూలు పేరు కునైన్. ఇది క్వినైన్ మీద ఆధారపడినది. దీనిలోని ముఖ్యమైన మందు సింఖోనా చెట్టు బెరడులో నున్నది.

శాస్త్రీయ నామమునుండి వర్తకనామము సిన్‌ఖోనా యనునది వచ్చినది. మనదేశంలో సామాన్యంగా పెరిగెడి చెట్టుకాదు. అనేక (స్పెషీసు) జాతి యిక్కడ సాగుచేసి పెంచుచున్నారు. అందులో నాలుగు ముఖ్యమైనవి.

అవి ఏవనగా :

1. సిన్‌ఖోనా కేలిసయా (*Cinchona calisaya* Wedd. వర్తకంలో కేలిసయా బార్క్, పెరువియన్ బార్క్)

దీనిని నీలగిరి యందును, సిక్కిమ్‌లోను సాగు చేయుచున్నారు.

2. సి. లెడ్జిరియానా మోయిన్స్ (వర్తక నామము లెడ్జర్ బార్క్.) దీనినే మన దేశంలో బెంగాల్, అస్సాము, దక్షిణ హిందూ దేశంలోను సామాన్యంగా సాగు చేయుచున్నారు.

3. సి. అఫిసినాలిస్ L. (వర్తకంలో: క్రౌన్ బార్క్, లోక్సాబార్క్) దీనిని నీలగిరిలో సాగు చేయుచున్నారు.

4. సి. సక్సిరుబ్రా. Pav. ex Klotzsch (వర్తకంలో: రెడ్‌బార్క్) దీనిని సాత్పూరా కొండలలోను, సిక్కిమ్, దక్షిణ భారత ప్రాంతములలో సాగు చేయుచున్నారు.

మన దేశంలో పెంచబడు సిన్‌ఖోనా స్పీషీస్, పెద్ద, మధ్య రకం చెట్లు. సి. లెడ్జిరియానా ప్రాకుడు పొదలాంటి చెట్టు.

## ఔషధము దాని గుణములు

చెట్టు ఎండు బెరడు నుండి సిన్‌ఖోనా మందు తయారగును. సింఖోనాలో చాలా మంచి వస్తువులున్నవి. వాటిలో క్వైనైన్ ముఖ్యమైనది. మలేరియా జ్వరమునకు యిది పేరొందిన ఔషధము. తగు మోతాదులలో నిది వాడినచో జ్వరము తగ్గుటయే గాక తిరిగి రాకుండా చేయును. ఇది బేక్టీరియములను సూక్ష్మజీవులను హరించుటచేత న్యుమోనియా యను ఊపిరి తిత్తుల రోగమునకు, ఎమీబిక్ డిసెంట్రి అనగా సూక్ష్మక్రిముల వలన వచ్చు రక్త విరోచనములకు, కంటి బాధలకు గూడ వాడవచ్చును.

కీళ్ల వాతములకు దీనినుండి తయారుచేయబడిన మందులు పై పట్టులకు పనికివచ్చును. గొంతులోని రోగములకు పుక్కిలించుట కుపయోగించును.

హెచ్చు మోతాదులలో క్వైనైన్ వలన, తాత్కాలికమే గాక చిరస్థాయిగా నుండు చెముడు, గ్రుడ్డి, బుద్ధిమాంద్యము, వికారము కలుగును.

గుండె జబ్బు వున్న రోగులకు, గర్భిణీ స్త్రీలకు క్వైనైన్ నుండి తయారు కాబడిన మందులు వాడరు.

### ఇతర వినియోగములు

సింఖోనా బెరడు నుండి గాని, క్వినైను నుండి గాని తయారైన మందులు క్రిమి సంహారులుగా, ఈకలమీద, బొచ్చుమీద, దానితో తయారయిన గుడ్డలమీద చల్లుదురు. చిమ్మట పురుగుల్ని దూరంగా వుంచేందుకు చల్ల బడు మందు. వెంట్రుకలు చెడకుండా యీ మందు వలన తయారైన ద్రవములు కాపాడును.

సింఖోనా బెరడు చర్మమును శుద్ధిచేయు వస్తువుగా పనిచేయును.

## 22. దాసిన చెక్క

CINNAMOMUM ZEYLANICUM Blume - సినమోన్

కుటుంబము : లారేసి

భారతీయ పేర్లు : హిందీ - దాల్చిని
బెంగాలీ - దాల్చిని
గుజరాతీ - దాల్చిని
కన్నడ - లవంగపట్టి
మరాఠీ - దాల్చిని
ఒరియా - దాల్చిని
పంజాబీ - దాల్చిని
సంస్కృతం - దారుశిల
తమిళం - కన్నలవంగపట్టి

లంకలో నిది విరివిగా పెరిగెడి చెట్టు. శాస్త్రంలోని జిలానికమ్ అను పేరు అచ్చటినుండి వచ్చినదే.

### వర్ణన

నిత్యము పచ్చగా నుండెడి చెట్టు. 6 – 8 మీటర్ల వఱకు పెఱుగును. సంవత్సరంలో ఎప్పుడు చూచినా ఆకులుండును.

ఆకులు పెద్దవి, దళసరివి. అరకుచుక్క ఆకారం, కొన సూదిగా నుండును. ప్రకాశమానమైన ఆకుపచ్చరంగు పైన, లేతరంగు క్రింద. 3 గాని 5 గాని పెద్ద నరములుండును. ఇవి ఆకు మొదట బయలుదేరి కొన వరకు గాని, మధ్యవరకు గాని సాగును. చిన్న చిన్న పువ్వులు పెద్ద గుత్తులలో రోమసహితంగా యుండును. కాయ పొడవుగా గాని, మొదలు లావు, చివరకు సన్నగిలుట గాని, యున్న ఆకారము గలది. 1.5 లగాయతు 2 సెంటీమీటర్ల వరకు పొడవుండును. నలుపు ఊదారంగు గలవి. కాయలో ఒకే గింజ యుండును.

## విస్తరణ

సామాన్యంగా ఎత్తైన కొండలమీద 1500 మీటర్ల ఎత్తుగల కొండలలో గూడ పెరుగును. కొన్నిచోట్ల 200 మీటర్ల ఎత్తుకు తక్కువగల ప్రదేశములలో గూడ పెఱుగును. మన దేశంలో కొన్ని ప్రదేశములందు మటుకు సాగు చేయుదురు.

## ఔషధము దాని గుణములు

చెట్టు కొమ్మలు నరికి, వాటిమీద బెరడు తీయుదురు. దాని నెండ బెట్టినచో నది 'సినమోన్' మందుగా వినియోగపడును.

ఈ మందు నీళ్ల విరోచనములకు, వికారమునకు డోకులకు నుపయోగ పడును. ఆహార పదార్థములలో పరిమళ మిచ్చుటకు వాడుదురు. ముఖ్య ముగా సాంబారులో వేసినచో రుచిగా నుండును.

బెరడునుండి తీయబడిన తైలము బెరడు కంటె నుపయుక్తమైనది. ఇది విరోచనకారిగాను, జఠరదౌర్బల్యము, కడుపుబ్బరము తగ్గించును. అంతేగాక కడుపులోని సూక్ష్మక్రిములను, బూజులును హరించును.

## ఇతర వినియోగములు

ఆకులనుండి తీసిన నూని మిఠాయిలలో పరిమళము, రుచి యిచ్చుట కును, సబ్బుల సువాసనకు నుపయోగపడును. కీళ్ళవాతపు నొప్పులకు పై పూత కుపయోగించును.




సినమోన్ (*Cinnamomum zeylanicum*)

మనకు ప్రతి సాలునా 40,000 క్వింటాల్సు దాసినచెక్క కావలసి యున్నది. దక్షిణ హిందూ దేశంలోను, బెంగాల్, అస్సాము, అండమాను దీవులలోను యీ చెట్టును సాగుచేయుట కనుకూలముగా నున్నది.

## సన్నిహిత మొక్కలు

సినమోమమ్‌కు ఉపయోగమయిన స్పెషీసు చాల యున్నవి. *C. camphora* (L) Sieb. సినమోమమ్ కేంఫోరా (కర్పూరపు చెట్టు) (Camphor tree, *Kapur*) నీలగిరి పర్వతముల మీద సాగు చేయుదురు. ఉత్తర హిందూ దేశంలో వృక్ష శాస్త్రీయ తోటలలో పెంచుదురు. దీని ఆకులు, కర్రలలోనుండి కర్పూరమును వంటకము ద్వారా తీయుదురు. కండరములు నలిగి బాధపెట్టునప్పుడు, వాపులకు, కీళ్ళవాతపు నొప్పులకు కర్పూరముపైన పట్టువేసినచో, బాధలు శమించును. కొన్ని రకముల నీళ్ళ విరోచనములకు, బలహీనపు నాడిని చురుకు చేయుటకు దీనిని లోపల కిత్తురు.

కర్పూరము యింకా ఎన్నో విధములుగా నుపయోగపడును. 5000 క్వింటాల్సుకు పైగా దీనిని మనము సాలీనా దిగుమతి చేసుకొనుచున్నాము. (కర్పూరమును ఒక రకం తులసిమొక్క వలన గూడ తయారు చేయుచున్నారు) *C tamala* Nees & Eberm. (హిందీ-తేజ్‌పట్, సంస్కృతం-తమలపత్ర - తమిళం - తాలిష్‌పత్రి.) లేక హిందూకేస్సియా అనునది. మధ్య, అవల హిమాలయములలో దొరకును. అరుదుగా అస్సాము, బెంగాలు పరగణాలలో గూడ లభ్యమగును. దీని ఆకులు సువాసనకు వాడుదురు. విరోచనకారి. కడుపు నొప్పులకు, నీళ్ళ విరోచనములకు వాడుదురు.

## 23. సువర్ణ గడ్డ

COLCHICUM LUTEUM Baker. - కోల్చికమ్

కుటుంబము : లిలియేసి

| భారతీయ పేర్లు : | హిందీ | - హిరణ్యతూత్ |
|---|---|---|
| | కాశ్మీరీ | - ఇర్కిమ్, మూన్డు |
| | పంజాబీ | - సురంజమ్ - కర్వీ |
| | సంస్కృతం | - హిరణ్యతుత్ |

శాస్త్ర నామమే వర్తక నామముగా యున్నది. దీని విత్తనములు, దుంప వర్తకములో కోల్చికమ్ విత్తనం, కోల్చికమ్ దుంప యని వాడబడుచున్నవి.

### వర్ణన

ఒక సంవత్సరం జీవించు మొక్క. ఒక వైపు చదునుగాను, రెండవ వైపు గుండ్రముగాను, ఎర్ర రంగులో నుండు దుంప. ఆకులు మొదట సన్నముగా నుండి పోను పోను చివర వెడల్పుగా నుండును. కాయలు కాచే వరకు ఆకుల పరిమాణము పెరుగుచుండును. బాగా పెరిగిన ఆకు 15-30 సెంటీమీటర్ల పొడవు, 8-15 సెంటీమీటర్ల వెడల్పు యుండును. పసుపు వర్ణము గల పువ్వులు 2.5-4 సెంటీమీటర్ల వ్యాసము గలిగి 7-10 సెంటీ మీటర్ల పొడవున నుండును. ముక్కులు వెనక్కు తిరిగిన కాయలు 2.5-4 సెంటీమీర్ల పొడవుండును.

### విస్తరణ

వాయువ్య దిశగా నున్న హిమాలయములలో 700 - 2800 మీటర్ల ఎత్తు వరకు, అరణ్యముల అంచుల యందును, విశాలమైన పచ్చిక భూముల లోను పెరుగును.

## ఔషధము దాని గుణములు

పూత పూయుటకు పూర్వము త్రవ్వి తీసిన దుంప, ముదరగా తీసి యెండించిన విత్తనములు మందులుగా పనిచేయును. దుంపలలో 'కోల్చి సైన్' అను పదార్థమున్నది. దీనిని గౌటురోగంలో (అనగా మోకాళ్లు వాచుట) నొప్పులకు, వాపులకు నుపయోగింతురు. చిన్న మోతాదులలో చాలకాలం వాడుటవలన యీ మందు 100 కి 60 మంది రోగుల బాధల నివారణ చేసినట్లు వైద్యపరీక్షల వలన తేలినది. ఈ మందు లోపల ప్రేగు లలో నుద్రేకము కలుగజేయుట చేత 'బెల్లడోనా' తో గాని 'హయోసయా మస్' తో గాని కలిపి వాడవలసియున్నది.

విత్తనముల పై పొరలోగూడ 'కోల్చిసిన్' పదార్థమున్నది. దుంప వేటికి వాడుదురో, విత్తనములు గూడ వాటికి వాడవచ్చును.

పుట్టకురుపు వ్యాధి (కాన్సరు) కిది రోగుల కిచ్చినచో, వ్యాధిగ్రస్తమైన కండరముల వృద్ధిని నిరోధించి, 'ఎక్సురే' కిరణముల వైద్యమునకు వాటిని పదునుజేయును. దీనిమీద యింకను ప్రయోగములు సాగుచునే యున్నవి. అందువలన పూర్తిగా యీ మందును పుట్టకురుపు వ్యాధికి వినియోగపరచుట లేదు.

ప్రతి సాలునా మనకు 25 క్వింటాల్సు కోల్చికమ్ కావలసియుండునని అంచనా వేసియున్నారు. హిమాలయములలో 1500 – 3000 మీటర్ల ఎత్తున దీనిని సాగుచేసి పెంచవచ్చును.

## ఇతర వినియోగములు

మొక్కలమీద పరిశోధనలలో బలమైన కొత్త మొక్క లుత్పత్తిజేయుటకు కోల్చిసైన్ నుపయోగపడును. ఇది న్యూక్లియస్‌లోని క్రోమోజోమ్సును హెచ్చించును.

## 24. మాను పసుపు

COSCINIUM FENESTRATUM Coebr. - కోస్సినియమ్

**కుటుంబము :** మెనిస్పెర్మేసి.

**భారతీయ పేర్లు :** హిందీ - ఝూరిహాల్డి
బెంగాలీ - హాల్డిగాఛ్
కన్నడ - మరమంజలి
మరాఠీ - వనివెల్
సంస్కృతం - దారుహరిద్ర
తమిళం - మరమంజలి

### వర్ణన

ఒక బలమైన ప్రాకెడి బాద. బెరడు పసుపు రంగు. ప్రథమంలో ఒత్తుగా రోమములుండును. ఆకులు, సాఫుగా నిగ నిగలాడుతూ చర్మము వలె నుండును. వాటి క్రింది వైపు రోమములుండును. గుండ్రని ఆకార ముతో చివర కొనదేరియుండును. ముఖ్యమైన నరములు 5–7 వుండును. పువ్వులు చిన్న తల గుత్తులవలె యుండును.

### విస్తరణ

ముఖ్యముగా పశ్చిమ కనుమలలో దక్షిణ భారతదేశంలో పెరుగును.

### ఔషధము దాని గుణములు

ఎండిన కొమ్మలలో బెర్బిరిన్ అనెడి మందుండును. ఈ మందు వలన, జ్వరములు, నీరసము, శుష్కించుట, కొన్ని రకముల అజీర్తులు మానును. క్రిమిసంహారి అను భావముతో పుండ్లకు పైన పట్టువేయుదురు. వ్రేళ్లు సూక్ష్మ జీవులను హరించునని తెలుపబడినది.

### ఇతర వినియోగములు

కొమ్మల నుండి పసుపు రంగు తీయబడును. మామూలు పసుపుతో కలిపి గాని, విడిగా గాని దీనిని వినియోగింతురు.

## 25. సింబో పోగన్

CYMBOPOGON species.

కుటుంబము : గ్రామినే

సింబో పోగన్ స్పీషీసు మన దేశంలో విరివిగా పెరుగుచున్నవి. కొన్ని సాగు చేయబడుచున్నవి. కొన్నిటిలో వైద్యయుపయోగము గుర్తించ బడినప్పటికిని ప్రాముఖ్యములోనికిని వచ్చినదొకటియులేదు.

సింబో పోగన్ జాతికి చెందిన మొక్కలు పరిమళము గలిగి పొడవుగా పెరుగును. వాటినుండి తీయబడిన తైలము పరిమళ ద్రవ్యముగా వాడుక చెందుచున్నది.

ఇందులో ప్రాముఖ్యము చెందినవి, వైద్యమునకు వినియోగించునవి, యీ క్రింది విధముగా నున్నది.

*Cymbopogon citratus* (DC.) Stapf (నిమ్మగడ్డి) మన దేశంలో చాల చోట్ల పెరుగును. దీనినుండి నిమ్మనూని (West Indian Lemon-grass oil) ని తీయుదురు. దీని ఆకుల కషాయమును 'టీ' కి బదులుగా తీసుకొందురు.

*C. flexuosus* (Nees ex Steud) Watson, సింబో పోగన్ ఫ్లెక్సుజీసస్, దక్షిణ భారత దేశంలోనూ, ఉత్తర ప్రదేశము, సిక్కిములలోను దొరకును. ఇది నిమ్మనూని నిచ్చును. ఈ నూనిలో విటమిన్ ఎ. యున్నది. కేరళ దేశమందు దీనిని పెంచుదురు. పరిమళమైన నూని.

*C. martinii* (Roxb.) సింబో పోగన్ మార్టినై. Watson (హిందీ-రోష రోహిషా, మిర్చియా గంధ, గాంధీ వెల్.) అనునది ఎడారి భూములందును వర్షపాతము తక్కువగల ప్రదేశములలో దొరకును. దీనినుండి తీయబడు రోషా అనెడి తైలం లంబెగో అను వాతపు నొప్పులకు, బట్టతలకు, చర్మ

వ్యాధుల మీద పనిచేయును. కడుపుబ్బరమునకు లోనికి తీసుకొనవచ్చును. దోమలను దగ్గరకు రాకుండా చేయుటకిది పూసుకొనవచ్చును. *C. nardus* (L) సింబోపోగన్ నార్డస్, రెండెల్, మనదేశమంతటా ముఖ్యంగా దక్షిణమున పెరుగును. సిట్రోనెల్లా తైలము దీనినుండి తీయుదురు. ఈ తైలము రోషా తైలమువలె ఈగలను దోమలను అవలకు తరిమివేయును. సాలీనా మనకు 200 క్వింటాల్సు సిట్రోనెల్లా తైలము కావలసియున్నది.

## 26. ఉమ్మెత్త

DATURA STRAMONIUM L. - ధతూరా *(Stramonium)*

కుటుంబము : సొలనేసి

భారతీయ పేర్లు : హిందీ - ధతూరా
బెంగాలీ - సాదా ధతూరా
గుజరాతీ - ధోలో ధతూరో
మళయాళం - ఉమ్మెత్తై
పంజాబి - ఛటూరా
సంస్కృతం - ధటూరా
తమిళం - ఉమ్మెత్తై
తెలుగు - దత్తూరము

ధటూరా, స్ట్రమోనియమ్ అను వర్తకం పేర్లు శాస్త్రీయములే. మన ప్రాచీన గ్రంథములలో శివునికి ప్రీతికరమైనదని "శివశేఖర" అను పేరున్నది.

### వర్ణన

ఒక మీటరు ఎత్తు వరకు గుబురుగా పెరిగెడి మొక్క. ఆకులు పెద్దవి. మొదట వెడల్పు, చివర సన్నము. అంచున పళ్లుండును. పువ్వులు పెద్దవి, తెలవి. యెండుకాయ కోడిగ్రుడ్డు ఆకారములో నుండి నాలుగు పక్షములుగా పగులును. పైన ముళ్లుండును.

## విస్తరణ

మధ్య, దక్షిణ భారతదేశంలోను, హిమాలయములందు 2500 మీటర్ల ఎత్తున ఇది దొరకును.

## ఔషధము దాని గుణములు

ఎండిన ఆకులు, పూచిగుళ్లు, విత్తనములు మందునకు పనికివచ్చును. ఇందులోని ముఖ్య పదార్థము "హయోసయామిన్" అందువలన నిది "హయోసయామిన్" బెల్లడోనాల వలె పనిచేయును. ఉబ్బసం, బ్రాంకైటిస్ మొదలైన దగ్గులలో, తెమడ, శ్లేష్మములను తగ్గించును. దగ్గు యొక్క ఉద్రిక్తతను తగ్గించును. మత్తు మగత కలుగజేసి బాధను మరపించును. ఎండించిన ఆకుల పొడుముతో చుట్టలు చుట్టి పొగ పీల్చినయడల ఉబ్బసం దగ్గు గల రోగులకు ప్రశాంతి లభించును.

## సన్నిహిత మొక్కలు

దీనికి సన్నిహితమైన మొక్కలు గూడ మందులకు వాడవచ్చును. *D. metel* L. (కల ధతూరా) మనదేశ మంతటా బంజరుగా వదలిన భూములలో పెరుగును. తెలుపు, పసుపు రంగులలోను కొన్ని ఊదారంగు లోను పువ్వులుండును. కాయలకు, చిన్న రోమముల వంటి ముళ్లుండును. సాగు చేసిన మొక్కలలో దొంతర పువ్వులుండును.

పురిటిలో ఆడవాళ్లకు రొమ్ములలో పాలవృద్ధి యెక్కువ అయినప్పుడు అవి వాచును. దీని ఆకులు పైన పట్టు వేసినచో అట్టి వాపులు, బాధలు శమించును. విత్తనములు, ఆకులు సమాన గుణములు గలవి.

*D. innoxia* Mill. డటూరా యినోక్సియా అనునది యితర దేశముల నుండి తేబడి యిచ్చట కలుపు మొక్కవలె పెరుగుచున్నది. డటూరా మెటల్‌లోవలె ఆకర్షణ పత్రములు 5 కోణములు గాక, దీనివి పది కోణములు కలిగియుండును. కాయలకు మృదువైన ముళ్లు, గోధుమరంగు గల విత్తనములు కలవు. స్ట్రమోనియమ్ గుణములు గలది. దీని సాగువల నభివృద్ధి చేయవలసినదిగా సలహా నీయబడినది. ఇది సాలీనా 40 క్వింటాల్సు మనకవసరమగుచున్నది.

# 27. నువ్వు పుష్పి

DIGITALIS PURPUREA L. - డిజిటేలిస్ *(Foxglove)*

కుటుంబము : స్క్రాఫ్యులేరియాసి

భారతీయ పేర్లు : హిందీ - బాల్‌పుష్పి

శాస్త్రంలో పేరు వర్తకంలో పరిపాటైనది. దీని పువ్వులు నువ్వు పువ్వులను బోలియుండును గనుక హిందీలో దీనికి తిలపుష్పి అను పేరు వచ్చినది.

## వర్ణన

1.2 మీటర్ల ఎత్తున రెండు మూడు సంవత్సరములు పెరిగెడి మొక్క. క్రింద ఆకులు పెద్దవి, పొడవైన వృంతములు గలవి. అరకు చుక్క ఆకారములో 15-30 సెంటీమీటర్ల వరకు యుండును. పైకి పోను పోను ఆకులు సన్నగిలటమే గాక తొడిగిన వృంతము పొట్టివైపోయి కొననున్న వాటికి పూర్తిగా లోపించును. 5-8 సెంటీమీటర్ల పొడవు గల పువ్వులు, తెల్లగా గాని ఊదారంగులో గాని యుండును. 30 – 60 వరకు పొడవైన గుత్తులలో ఒకే వైపుకు వాలి, సన్నని చీలికలు గల పువ్వులుండును. కాయ కోలగా యుండును.

## విస్తరణ

ఈ మొక్క మన దేశమునకు జెందినది కాకపోయినను ఉత్తర హిందూస్థానంలోను, కాశ్మీరులోను, డార్జిలింగ్, నీలగిరి కొండలలోను సాగు చేయుదురు. ప్రస్తుతం యీ సాగులను మానివేశారు. సాగులలో నుండి బయటపడి కొన్ని ప్రదేశములలో సహజంగా పెరుగుట జరుగుచున్నది.

## ఔషధము దాని గుణములు

ఎండించిన ఆకులు మందునకుపయోగపడును. కోసిన వెంటనే 60° C ఉష్ణోగ్రతలో వడిలించవలసి యున్నది.

దీని ముఖ్య వినియోగము హృద్రోగముల నివారణ. అన్ని కండరము లను ఉత్తేజపరచును. రక్తం పుష్కలంగా యుండుట చేత వచ్చెడి హృదయ దౌర్బల్యముల కన్నిటికి దీనిని వాడవచ్చును.

నాళములలోనికి రక్తమును ధాటిగా ప్రవహింపజేయుటే గాక గుండెకు బలము చేకూర్చును. రక్త ప్రసారము సరిగా లేక నీరు పట్టుట కారంభించి నపుడు, యీ ఔషధము, హృదయమును బాగుచేసి, ఆ రక్తమును సరియైన మార్గములో నది ప్రవహింపజేయును.

మూత్ర కృచ్ఛమునకు రక్తము ప్రసరించునట్లు చేసి, తద్వారా మూత్రము జారీగా వెళ్లునట్లు చేయగలదు. అంతేగాక మూత్ర కృచ్ఛముల లోని యాటంకములను తొలగించి సరిచేయును.

కాలిన పుండ్లకు, కౌకు దెబ్బలకు పైన పట్టించు నూనెలు తయారు చేయుటకు వినియోగపడును. దామాషాని దీనివలన కొన్ని దుర్గుణములు తలనొప్పి, దిమ్మ మొదలైనవి కలుగవచ్చును. అనుషంగికముతై వచ్చెడి దురుణముల యెడల జాగ్రత్త పడవలసివుంటుంది.

## ఇతర సన్నిహిత మొక్కలు

ఈ జీనస్సుకు చెందిన మరొక స్పెషీస్ డిజిటాలిస్ లెనేటా *(Woolly Foxglove)* బయలు ప్రదేశములలో దొరుకుటే గాక కాశ్మీరునందు సాగు చేయబడుచున్నది. పాలమీగడ రంగులో చిన్న పువ్వులు రోమములతో నిండియుండును. డి. పర్ప్యూరియా వలె దుర్గుణములు పుట్టించక, యీ ఓషధి దానికంటె చురుకుగాను, బలవత్తరముగాను పనిచేయును.

సాలీనా మనకు 30 క్వింటాల్సు ఈ ఓషధి అవసరమగుచున్నది.

## 28. ఏలక్కాయ

ELETTARIA CARDAMOMUM (L) Maton. - కార్డామమ్

కుటుంబము : జింజిబరేసి

భారతీయ పేర్లు : హిందీ - ఛోటీ ఎలాయిచీ
బెంగాలీ - ఏలాయిచీ
మళయాళం - ఏలమ్
మరాఠీ - వెల్‌డోడి
సంస్కృతం - ఏల, ఉపకుంచిక
తమిళం - ఏలకి, ఏలమ్

### వర్ణన

నిలువుగా అనేక దళసరి కొమ్మలు దట్టంగా గుబురుగా పైకి పెంచెడి మొక్క. అల్లం మొక్కవలె నుండి దానికంటె పెద్దదిగా 3 మీటర్ల ఎత్తు వరకు పెరుగును. క్రింద దుంపలుండును. 30 లగాయతు 90 సెంటీ మీటర్ల పొడవుగల ఆకులు బద్దెలవలె యుండి అందు మధ్యన ఒక పెద్ద నరము యిరుప్రైపులా సన్నని నరములు కలిగియుండును. పువ్వుల కొమ్మలు నేలమీదనుండి బయలుదేరును. 30 – 90 సెంటీమీటర్ల పొడుగైన కాడలమీద 4 సెంటీమీటర్ల పొడవుగల తెల్లని పువ్వులుండును. అనేక గింజలతో నిండిన మూడు పక్షములు గల కాయలు 1.5 సెంటీమీటర్ల పొడవు గలవి యుండును. గింజలు ముక్కోణము గలవి. నలుపు ధవుళ రంగులో నుండును. మొక్క యొక్క పరిమాణము అది పెరిగెడి ప్రదేశముల మీద ఆధారపడియుండును. వీటిలో అనేక జాతులుగూడ గలవు. వాటన్నిటి లోను కాయలు, గింజలు మాత్రము సమానముగా యుండును.

### విస్తరణ

చల్లని ప్రదేశము లందును, తేమగల నేలలలోను, మైసూరు, కేరళ

కొండ ప్రదేశము లందును, దక్షిణదేశ మంతటా విరివిగా పెరుగును. మన దేశంలో కొన్నిచోట్ల దీనిని సాగుచేయుదురు.

ఔషధము దాని గుణములు

ఎండిన కాయలు మందుగా పనికివచ్చును. అవసరమైనప్పుడు గింజలు ఒలిచి వాడుదురు.

కార్డామమ్‌ను కడుపుబ్బరమునకు, జఠరాగ్నిని పెంచుటకు వాడుదురు. విరోచనములకు వాడే మందులలో రుచికై దీనిని కలుపుదురు. ఏలకులు, లవంగాలు, అల్లం, కెరవే (అజమోదా) అనువాటిని కలిపి పొడుంగొట్టి తినిన యడల అజీర్తికి మంచి పనిచేయును.

ఇతర వినియోగములు

పిండి వంటలలోను, పాయసములలోను, కొన్ని లలోను చాకులెట్లు మొదలైన వాటిలోను దీనిని విరివిగా వాడుదురు.

## 29. అంబటి

EMBELIA TSJERIAM-COTTAM A. DC. - ఎంబెలియా

కుటుంబము : మిర్సినేసి

| | | |
|---|---|---|
| భారతీయ పేర్లు : | హిందీ | - ఛాయబిడంగ్, ఘంగి, గైయా |
| | బెంగాలీ | - ఢాకిర్ఘూంటీ |
| | మరాఠీ | - వైవారుంగ్, అంబటి |
| | ఒరియా | - నునునియా |
| | (సంతాలీ పేరు - భాబ్రి) | |

శాస్త్రీయ నామమే వర్తక నామము.

## వర్ణన

ఒక చిన్న చెట్టుగా గాని, పొదగా గాని ఉండును. లేత కొమ్మలకు గోధుమ రంగు గల నూగుండును. ముదురు కొమ్మలు నిగనిగలాడు తుండును. కొమ్మలకు అంచంచ తెల్లని గ్రంథులుండును. 12 సెంటీ మీటర్లు పొడవైన ఆకులు ఇరువైపులా కొనదేరి యుండును. ఆకుల పైన గ్రంధులుండును. అంచుకు పళ్లు వుండును. కొన్ని ఆకులు ఎరుపు రంగును అడుగు భాగమున కలిగియుండును. నరముల మీద నూగుండును. లేత ఆకుపచ్చ రంగులో చిన్న చిన్న పూగుత్తులు రోమ సహితములై ఆకు కోణములలో నుండును. కాయ గుండ్రమై సూది మొన కలిగి యుండి పండినప్పుడు ఎఱ్ఱబడును.

## విస్తరణ

మన దేశంలో ముఖ్యంగా తూర్పున, దక్షిణమున విరివిగా దొరకును.

## ఔషధము – దాని గుణములు

ఎండించిన కాయలు మందుగా పనిచేయును. దీని ముఖ్యమైన ఉప యోగము బద్దె పురుగులమీద పనిచేసి వాటిని హరించుట. సరియైన మోతాదులలో బద్దె పురుగలను పూర్తిగా హరించగలదు. అటు తరువాత వాటిని విరేచనముల మందు వలన బయటికి నెట్టవచ్చును. ఎంబ్లెయాలోనే కొద్దిపాటి విరేచన కారిత్వమున్నది. ఇటీవల పరిశోధనల వల్ల ఈ మందు కొంకి పురుగులకు, గుండ్రని పురుగులకు పనిచేయదనిన్నీ, బద్దె పురుగులకు మాత్రమే పనిచేయుననీ తెలిసినది. ఇది ఏలుగు పాములను కూడ చంప గలదని తెలియుచున్నది. ఈ మందు బాక్టీరియములను, క్షయవ్యాధి బాక్టీరియములను కూడ సంహరించ గలుగునని తెలియుచున్నది.

## సన్నిహితపు మొక్కలు

ఎంబ్లెయారైబెస్ బర్మ్ఎఫ్ మన దేశమంతటా కనిపించుచున్నది. దీనికి మరో పేరు ఎ. జిరియం కొట్టాం. దీని కాయలు కూడ ఎంబ్లెయాను పేరు గల మందుకు సమాన గుణములు కలిగినవి.

## 30. ఉసిరికాయ

ఎంబ్లికా *(Emblic Myrobalan)*

EMBLICA OFFICINALIS Gaertn syn. *Phyllanthus* ***emblica*** L.

**కుటుంబము :** యూఫోరిబియేసి

| **భారతీయ పేర్లు :** | | |
|---|---|---|
| | హిందీ | – ఆమ్లికా |
| | అస్సామీ | – చుకన్ల అమ్లకి |
| | బెంగాలీ | – అమ్లకి |
| | గుజరాతీ | – అమరాన్ |
| | మళయాళం | – అమలకం |
| | మరాఠీ | – అమల |
| | ఒరియా | – అమోరా |
| | సంస్కృతం | – అమలిక |
| | తమిళం | – నెల్లికాయి |

ఎంబ్లికా యను శాస్త్ర నామమే వర్తకంలో పరిపాటియైనది. దీనిని ఎంబ్లిక్ మైరోబొలాన్ అని గూడ వాడుకచేయుదురు. ప్రఖ్యాతి జెందిన మూడు మైరోబొలానులలో నిది యొకటి.

### వర్ణన

ఆకులు రాల్చే చిన్న రకం చెట్టు 10–13 మిల్లీమీటర్ల పొడవు. 2–3 మి. మీ. వెడల్పు కలిగిన చిన్న చిన్న ఆకులు గల కొమ్మలుండును. చిరు కొమ్మలు కాకి ఈకల వలె పొడుగుగా నుండును. ఆడ మగ పువ్వులు ఒకే చెట్టున ఉత్పత్తి అగును. ఒత్తుగా గుత్తులలో ఆకుల క్రింద లేత ఆకుపచ్చ పువ్వులుండును. మగ పువ్వులు అసంఖ్యాకములుగా చిన్న చిన్న తొడిమలు కలిగియుండును. ఆడ పువ్వులు చిన్నవైననూ తక్కువ సంఖ్యలో నుండును. కాయలు 1.5 నుండి 2.5 సెం. మీ. వ్యాసము కలిగి గుండ్రముగా ఆరు తేలిక చారలతో పుష్కలముగా కండ గలిగి లేత ఆకుపచ్చ

రంగులో గాని పసుపు రంగులో గాని యుండును. గింజలు 6. సాగుచేసిన వాటిలో కాయలు పెద్దవిగా నుండును.

## విస్తరణ

మన దేశంలో అంతటా, భూమధ్యరేఖ కిరువైపుల (ఉష్ణ మండలము లలో) దొరుకును. మధ్య ప్రదేశ్ లో నున్న అడవులలో విరివిగా దొరుకును.

## ఔషధము దాని గుణములు

పచ్చివి గాని, ఎండించినవి గాని కాయలు ఔషధమునకు పనికివచ్చును. మన దేశంలో సామాన్యంగా తయారు చేసే త్రిఫల చూర్ణములో ఇది యొక ఫలము. మిగతవి రెండూ ఏవనగా ఒకటి బాహిర – టర్మినేలియా బెల్లిరికా. రెండవది హర్రా అను టెర్మినేలియా చెబ్యూలా (కరక్కాయ). త్రిఫల చూర్ణము విరేచనకారి గాను, కాలేయము వాచినపుడు, మూల శంఖకు, కడుపు నొప్పులకు, కంటి నొప్పుల కుపయోగపడును.

ఎంబ్లికా కాయలు కాలేయమునకు పుష్టి కలుగచేయును. పచ్చి కాయలు మేహశాంతి స్వల్పంగా విరేచనకారి. పులుపబెట్టిన కాయల సారము అజీర్తు లకు, రక్త హీనతకు, కామెర్లకు, కొన్ని హృద్రోగములకు, రొంపలకు, మూత్రము జారీ చేయుటకు పనిచేయును. ఇందు విటమిను 'C' పుష్కల ముగా నున్నది. అందువలన ఆ విటమిను లోపించు రోగములు స్కర్వే రోగమునకు పనిచేయును.

కొన్ని ప్రయోగముల వలన ప్రయోగశాలలో తయారుచేసిన విటమిను 'C' కంటె ఇందులోని 'C' విటమినే క్షయవ్యాధి రోగులకు మిన్నగా పని చేసినట్లు తెలియుచున్నది. బహుశా ఇంకా కొన్ని మనకు తెలియని పదార్థ ములు ఈ కాయలలో నుండుటయే దీనికి కారణము. ఎండించిన కాయలు నీళ్ళ, జిగిట విరేచనములకు పనిచేయును. ఆయుర్వేద వైద్యములో ఉసిరి కాయ ఊరగాయ కూడ ఔషధముగా నిర్ణయిస్తారు.

పువ్వులు, వేళ్ళు, చెట్టు బెరడు కూడ మందుకు పనిచేయును. విత్తనములు ఉబ్బసము దగ్గునకు జీర్ణకోశ లోపములకు పనిచేయును.

## ఇతర వినియోగములు

కాయలు సిరాలు, రంగులు తయారుచేయుటకును, తల నూనెలలోను ఉపయోగింతురు. కొమ్మల బెరడు, కాయలు చర్మశుద్ధికి రంగులు వేయడానికి పనికి వస్తుంది. చెట్టుయొక్క కర్ర అనేక గృహ కృత్యములలో నుపయోగ పడును. కర్ర నిలువ యుండగలదు కనుక నూతులలో క్రింద చక్రముగా వాడుదురు.

దీని ఆకులు ఏలక్కాయచెట్లకు ఎరువుగా ఉపయోగపడును. చవిటి నేలను బాగుచేయుటకు కూడ ఉపయోగపడును.

# 31. ఖండశాఖి

EPHEDRA GERARDIANA Wallich - ఎఫెడ్రా

కుటుంబము : నీటేసీ

భారతీయ పేర్లు : హిందీ – అస్మానియా, ఫోక్, ఖందా
పంజాబీ – బుచ్ శుర్
(జాన్సర్ – తట్ గాంతా)

శాస్త్రీయ నామమే వర్తక నామము.

## వర్ణన

ఒక మీటరు ఎత్తువరకూ పెరిగే పొద. కొమ్మలు మొదలు బలముగా యుండి, నిస్తారముగా చిరుకొమ్మలు వేయును. ఒకే చోటునుండి నాలుగైదు కొమ్మలు బయలుదేరును.

కొంతవరకూ పెరిగిన తరువాత విస్తరించి పైకి ఎగబ్రాకును. ఆకులు బహు చిన్నవై రెండు పళ్ళుగల దొప్పలుగా నుండును. మగ పువ్వులు స్వల్పముగానుండి అరకు చుక్కాకారముగల కాడలనంటి యుండును.

ఆడ పువ్వులు ఒకటి రెండు మాత్రమే పొట్టి కాడలకు వ్రేలాడి యుండును. దళసరిగా నుండు దొప్పలచే ఆవరింపబడి ఏడు లగాయితు పది మిల్లీమీటర్లు పొడవుగలిగి కోలగా ఎర్రని కాయలు కలిగియుండును.

## విస్తరణ

2000 – 4000 మీటర్ల ఎత్తు వరకూ హిమాలయ పర్వతములలో వేడి ప్రదేశములందు దొరకును. సాగు కూడ చేయుదురు.

## ఔషధము దాని గుణములు

ఎండించిన కొమ్మలు ఔషధముగా పనిచేయును. ఎఫిడ్రిన్ అను పదార్థము ఇందులోనుండి ఉబ్బసము దగ్గునకు, ముఖ్యముగా బ్రోంఖియల్ ఉబ్బసమునకు పనిచేయును. ఈ దగ్గు యొక్క ఉద్రేకమును తగ్గించు టకు నోటి ద్వారా కాని ఇంజెక్షన్ ద్వారా గాని మందును అందజేయుదురు. హృదయమునుత్తేజపరచగల గుణమున్నది. ఊపిరితిత్తుల రోగములు, న్యూమోనియా, డిఫ్తీరియా రోగములందు బలహీనమైన గుండెలకు ఇది బలము నిచ్చి బాగుచేయును.

గడ్డి జ్వరము, కురుపులకు కూడ నుపయోగించును. అవి పైత్యము వలన వచ్చినవైతే బాగుగా పనిచేయును. ఎఫిడ్రిన్ కలిసిన అనేక మందులు ఇప్పుడు వాడుకలోనున్నవి. ముక్కులోనికి చిందింపజేయడానికి, ఉబ్బసపు ఉద్రేకములకు, ముక్కులోని పొర వాచినపుడు ఇది బాగా పనిచేయును. ఈ మందు మూత్రకుచ్ఛముల మీద పనిచేయుటవలన పిల్లలు నిద్రలో మూత్రవిసర్జన చేయుట అనే రోగమును మాన్పును. ఎక్కువ మోతాదు లలో వాడిన ఎఫిడ్రిన్ వికారము, ఆందోళన, చెమటలు, కొన్ని రకము లైన చర్మవ్యాధులు కలుగజేయును.

## సన్నిహితపు మొక్కలు

ఎఫిడ్రామేజర్ అనునది లాహల్‌లో దొరకును. ఎ జిరార్డియానా కంటె ఇందులో అల్కలాయిడ్స్ ఎక్కువగా నుండుటచే దీనిని గూడ ఔషధముగా అంగీకరించుచున్నారు. ఈ మందులను మనము నిత్యం



**Plate 8**
ఎఫెడ్రా
(*Ephedra gerardiana*)
(71 వ పుట చూడుడు)

**Plate 9**—ఎంబెలియా (*Embelia tsjeriam - cottam*)
(66 వ పుట చూడుడు)



**Plate 10**
ఇండియన్ సారసపరిల్లా
(*Hemidesmus indicus*)
(87 వ పుట చూడుడు)

**Plate 11**
గరుడఫల్
(*Hydnocarpus laurifolia*)
(92 వ పుట చూడుడు)



**Plate 12**
లోబిలియా
(*Lobelia nicotianaefolia*)
(104 వ పుట చూడుడు)



**Plate 13**
ఇండియన్ హెన్‌బేన్
(*Hyoscyamus niger*)
(94 వ పుట చూడుడు)



**Plate 14**—మధుక (*Madhuca indica*) అడవులలోనుండి దీని విత్తనములను తెచ్చి ఆదివాసి స్త్రీల వర్తకులకు సంతలలో నమ్ముదురు. (106 వ పుట చూడ

**Plate 15**—కేంఫర్ బాసిల్ (*Ocimum kilimandscharicum*) (116 వ పుట చూడ



పొందవలెనంటే పై చెప్పిన రెండూ గాని లేక చైనా మొక్క ఎ. ఈక్వి జిటినా బంజ్, ఎ. సినికా స్టేఫ్ సాగు చేయవలసియున్నది. సాలీనా మూడు వందల క్వింటాల్స్ ఔషధము మనకవసర మగుచున్నది.

ఉత్తర హిమాలయములలో ఎత్తైన కొండలున్న కాశ్మీరము, పంజాబ్, హిమాచల ప్రదేశ్, ఉత్తర ప్రదేశ్ దీని సాగుకుపయుక్తములు.

## 32. నానబాల

### యూఫోర్బియా

**EUPHORBIA HIRTA L.**

syn. *E. pilulifera* (of Indian floras, not of Linneaus.)

కుటుంబము : యూఫోర్బియేసీ

| భారతీయ పేర్లు : | | |
|---|---|---|
| | హిందీ | – లాల్ దుధీ |
| | బెంగాలీ | – బారకేరు |
| | గుజరాతీ | – దుధిలీ |
| | మళయాళం | – నేలఫలై |
| | మరాఠీ | – మోటీ దుధీ |
| | సంస్కృతం | – నాగార్జునీ, పునిటోలా |
| | తమిళం | – అమమ్పచ్చై అరిపి |

శాస్త్రీయ నామము వర్తక నామము.

### వర్ణన

50 సెం. మీటరు ఎత్తువరకూ పెరిగెడి చిన్న మొక్క. కొమ్మలు గుండ్రముగా నుండి పసుపు రంగుగల నూగుతో నిండియుండును. కొమ్మకు రెండేసి అభిముఖ పత్రాలుండును. ఇవి నలుపు రంగు కలిగిన ఆకుపచ్చలో 4 సెం॥ మీటర్లు పొడుగుండును.




యుఫోర్బియా (*Euphorbia hirta*)

ఆకు అంచు బహు సన్నని పళ్లు కలిగియుండును. పువ్వులు తెల్లవి, చిన్నవి. కాడలతో గుత్తులుగా నుండును. కాయలు 1-2 మి. మీ. వ్యాస ముండును. రోమము లుండును. గింజలు మూడు పలకలుగా యుండి గొప్పలు గొప్పలుగా గోధుమ రంగులో నుండును.

## విస్తరణ

అనేక రకాల నేలలో తేమగా నుండు చోట్ల యందు మన దేశమంతటా వేడి ప్రదేశములలో విస్తారముగా పెరుగుతుంది.

## ఔషధము దాని గుణములు

కాయలు కాచినపుడు తీసిన మొక్క అంతా కూడ ఔషధముగా పని చేయును. శ్వాస క్రియను, హృదయ వేగమును తగ్గించి, ఊపిరి తిత్తులలోని నాళములను బాగుచేయును. పిల్లల ప్రేగులలోని క్రిములను హరించుటే గాక ఉబ్బసమునకు, దగ్గునకు ఉపయోగపడును. బాలింతరాళ్ళలో పాలు తయారుచేయుటకు, ప్రవహించుటకు తోడ్పడును. సెగ రోగము నకు ఇంకా ఇతర మూత్ర కచ్చ రోగములకు గూడ నుపయోగపడును. దీని వ్రేళ్ల వలన వాంతులను నివారించవచ్చును. ఎక్కువ మోతాదులలో తీసుకున్న వికారము కలిగించి వాంతులు కలిగించును. దీనినుండి వచ్చు పాలు నూపుడు కాయలకు వాడుదురు. ప్రయోగముల వలన ఇది బాక్టీరియ ములను, క్షయ వ్యాధి బాక్టీరియములను కూడ హరింపగలదని తెలియు చున్నది.

## ఇతర వినియోగములు

దీని ఆకులు కూరగా వాడుదురు.

## ఇతర సన్నిహితపు మొక్కలు

ఈ జాతికి చెందిన కొన్ని మొక్కలు యూహిర్టాకు గల గుణములు గలవియే.

ఈ జాతినందు కండగల ద~~న్నరి కొమ్మలతో~~ ఒత్తుగాను, ఎత్తుగాను

పెరిగెడి కొన్ని ముళ్ల మొక్కలున్నవి. కొన్నింటిలో కొమ్మలు మూడు గాని నాలుగు గాని కోణములు కలిగి వంకరలు తిరిగి యుండును. వాటి నుండి వచ్చు తెల్లని పాలు విషప్రాయమై జిగురుగా నుండును.

అశ్రద్ధగా ఈ పాలను ఒంటిమీద పడునట్లు చేసినచో చర్మవ్యాధులు తదితర వ్యాధులు పుట్టును. చిన్న చిన్న మోతాదులలో దీనిని విరేచన కారిగా వాడుదురు. కొన్ని సన్నిహితపు మొక్కల రసమును కురుపులమీద పురుగులను హరించుటకు వాడుదురు. చర్మవ్యాధులను, చర్మముమీద మొలచు శృంగములను కూడా బాగుచేయును.

యూ: ఏంటికోరమ్ యల్. (హిందీ – త్రిధరి సెహుండ్, సంస్కృతం-వజ్రకంటక.) దీనికి మూడు – ఐదు కోణములు కలిగిన కొమ్మలుండును. ఇది మన దేశమంతటా ఉష్ణప్రాంతములలో దొరకును. దీని రసము ఉబ్బుకాయిలా వారికిని, నరముల దుర్బలత్వము గలవారికిని వాడ వచ్చును.

యూ. బార్డ్‌ఐహార్టీ: syn యూ. ట్రైగోనా Roxb. (తెలుగు: కత్తిమందు) ఇది ఉష్ణప్రదేశములలో దక్షిణ హిందూదేశములోని కొండలమీద, అండ మాను దీవులలో నుండును. దీని ఆకుల పొడిని సెగ్గడ్డమీద పట్టువేయు దురు.

యూ: నెరిపోలియా యల్ (హిందీ: సెహుండ్, తుహార్; సంస్కృతం–స్నుహి) దీని కొమ్మలకు 5 కోణములుండును. దక్కను పీఠభూమియందు విరివిగా పెరుగును. పంటభూములకు దీనిని కంచెగా ఉండునట్లు పెంచు దురు. దీని రసము చెవిపోటులకు ఉబ్బసమునకు వాడుదురు.

యూ. నెవ్యూలియా. Buch - Ham (హిందీ: కటతుహార్, సంస్కృతం పత్రస్నుహి).

దీనికి గుండ్రని కొమ్మలు ముళ్ళతో నిండియుండును. మన దేశమంతటా బహు వేడి ప్రదేశములలో దొరకును. దీనిని కూడ కంచెగా వాడుదురు. దీని రసము వలన మూత్రము జారీ అగును. బస్తర్ జిల్లాలోని అటవికులు దీని పాలను పశువులకు పుళ్ళమీద వాడుదురు.

యూ. రోయిలినా Boiss (బోయిస్) (పంజాబీ: దండాతోర్) దీనికి 5–7 కోణములు గల కొమ్మలుండును. పశ్చిమ హిమాలయములలో మామూలుగా 1000–1500 మీటర్ల యెత్తున పెరుగును.



యుఫోర్బియా (*Euphorbia antiquorum*)




యుఫోర్బియా (*Euphorbia neriifolia*)

యు. తిరుకళ్ళి యల్. (హిందీ - సెహుండ్, సంస్కృతం - వజ్రద్రుమ) ఇది పొదగానుండి చిన్న చెట్టు వరకు పెరుగును. గుండ్రని కొమ్మలు విస్తారముగా గుండ్రంగా వుండును. దీని కొమ్మలు మిగత చెట్లకంటె సన్నముగా నుండును. ఇది ఆఫ్రికానుండి తేబడి మన దేశంలో కంచెలకు వాడబడుచున్నవి. ఉష్ణప్రదేశములలో బాటల కిరువైపునా పెంచబడు చున్నవి. ముఖ్యముగా దక్షిణ, తూర్పు ప్రదేశములలో దీనిని పెంచుదురు. దీని తెల్లటి పాలను కీళ్ళ వాతపు నొప్పులకు పైన పూయుదురు. పంటి పోటుకు కూడ నుపయోగింతురు. చిన్న మోతాదులలో లోపలికివ్వవచ్చును.

## 33. ఇంగువ

FERULA NARTHEX Boiss - ఆసఫోయిటిడ

కుటుంబము : అంబెల్లిఫెరే

భారతీయ పేర్లు : హిందీ - హింగ్
బెంగాలీ, గుజరాతీ, కన్నడ - హింగ్
కాశ్మీరీ - యాంగ్, సేప్
మళయాళం - పెరుంగాయం
మరాఠీ - హింగ్
ఒరియా - హెంగూ
సంస్కృతం - బాహ్లికా, అగుడగంధా
తమిళం - పెరుంగాయం

వర్తక నామము దీని సన్నిహితపు మొక్క అయిన ఫెర్యులా అసఫోయి టిడా మీద ఆధారపడినది. దీని నుండి అసఫోయిటిడను తీయుదురు.

### వర్ణన

పలు సంవత్సరములు జీవించు పొడుగాటి మొక్క. దీని వ్రేళ్ళు లావుగా

కారట్ దుంపవలె నుండును. ఆకులు రెండు రకములు. క్రిందవి సామాన్య పత్రములు. అరకుచుక్క ఆకారములో 30 – 60 సెం. మీ. పొడవుండును. పైనున్న ఆకులు చిందర వందరగా అనేక విభజనలు కలిగి యుండును. లేత ఆకులకు ఒత్తుగా రోమములుండును. కొనలయందు గుంపులుగా చిన్న పసుపు పచ్చని పువ్వులుండును. కాయ 8 మి. మీ॥ పొడవు. దానిలో సగమునకు పైగా వెడల్పు.

## విస్తరణ

కాశ్మీరము నందు విరివిగా దొరకును.

## ఔషధము - దాని గుణములు

అసఫోయిటిడ అనునది ఒక బంక పదార్థము. జీవించియున్న దుంపలకు గాని వేళ్ళకు గాని చిన్న చిన్న కోతలు పెట్టినచో ఈ పదార్థము జిగురు వలె పైకి చిమ్మును. ఇవి మూర్ఛలకు, అజీర్ణ రోగములకు, ఉబ్బరపు కడుపు నొప్పులకు, కలరాకు, గోరింత దగ్గులకు పనిచేయును. నరములను ఊపిరి తిత్తులను ఉద్రిక్త పరచగలదు. ఊపిరితిత్తులకు వచ్చు న్యుమోనియా, బ్రోంకైటిస్, మొదలైనవి పిల్లలకు వచ్చునపుడు దీనిని వాడవచ్చును. దీనిని పొట్ట మీద పట్టు వేసినచో లోని ప్రేగులను కదల్చి ఉద్రిక్త పరచును. ప్రేగులు ఉబ్బినపుడు దీనిని అసనములో నుంచి లోనికి పంపినచో వాటిని శుద్ధిచేయును.

ప్రయోగముల వలన అసఫోయిటిడ వలన మత్తు కలుగజేయు ననియు, అందువలన హృద్రోగములకు ఉపయోగపడవచ్చు ననియు సూచింపబడు చున్నది.

## ఇతర వినియోగములు

సుగంధ ద్రవ్యముగా వాడుదురు. చాలవరకు కూరలలోను పచ్చళ్ళ లోను, పప్పులలోను ఇది అవసరమైన పదార్థము.

## సన్నిహితపు మొక్కలు

మధ్య ఆసియా ప్రదేశములలో ఈ జాతికి చెందిన అనేక మొక్కలు

దొరకును. ఫెర్యులా ఫోయిటిడారిగెల్, ఫె. అసఫోయిటిడ అను రెండు మొక్కలు, ఫెర్యులా నార్తెక్స్ అను మొక్క వలెనే యింగువ ఉత్పత్తి కుపయోగపడును. ప్రతి సాలీన మనకు ఆరువేల క్వింటాల్స్ అసఫోయిటిడ మందులకైతే నేమి, ఇతర వినియోగముల కేమి కావలసియున్నదని అంచనా చేయబడెను. అందువలన హిమాలయములలో ఇది సాగుచేయుట అవసరము.

## 34. వసంతహరిత

GAULTHERIA FRAGRANTISSIMA Wallich - వింటర్ గ్రీన్

కుటుంబము : ఎరికేసే

భారతీయ నామములు : హిందీ - గంధపురా కాపెల్
సంస్కృతం - హిమంత హరిత
అస్సామీ - జిర్హా

వింటర్ గ్రీన్ అను నూనె దీనినుండి వచ్చుటచే ఆ పేరు వర్తకములో వ్యాప్తమైనది.

### వర్ణన

మూడు మీటర్ల యెత్తు వరకూ పెరుగు నిత్యమూ పచ్చగా నుండెడి పొద. కొమ్మలు విరివిగా విస్తరించును. బెరడు పారాణి రంగులో నుండును. ఆకులు 13 సెం. మీ. పొడవై వెడల్పుగా చర్మమువలె నుండును. అక్కడక్కడ గ్రంథులు గలవు. ఆకు అంచున పళ్ళుండును. లేత ఆకు పచ్చలో చిన్న పూలు పొట్టి గుత్తులలో ఆకు గ్రీవముందుండును. కాయ గుండ్రముగా నుండి నీలి రంగు రక్షక పత్రముల చేత ఆవరింపబడును.

### విస్తరణ

1500 – 2500 మీటర్ల యెత్తున తూర్పు, ఉత్తర, దక్షిణ ప్రదేశముల యందు గల కొండ ప్రదేశములలో విరివిగా మొలచును.

## ఔషధము - దాని గుణములు

వింటర్ గ్రీన్ నూనె పచ్చి మొక్కలనుండి తీయబడును. అనేక రకములైన కీళ్ళ వాతముల కిది ఉపయోగపడును. నొప్పి ఉన్నచోట పైన పట్టు వేయుదురు. ఇది ఒకటియేగాక ఇతర నూనెలతో కలసి వేయుట గాని గుడ్డలు, దూది, వగైరాలు ఇందులో తడిపి పట్టు వేయుట గాని ఉపయోగకరము. అలాగు వేసినచో రేగులు నొప్పి పెట్టుట మొదలగు దుర్గుణములు రావు. ఇది కొంకి పురుగులను హరించును. ఉత్తేజము నిచ్చుటేగాక విరేచనకారిగా పనిచేయును.

ప్రయోగములలో చుంచులకు దీనిని యిచ్చినపుడు వాటిలో పుట్టకురుపు వ్యాధి (కాన్సరు) పెరుగుట కొంత కాలం వాయిదా పడింది. ఇది చాల విచిత్ర మైనది. ఈ ఔషధము వలన జంతువులలో వచ్చు కణుతులు, పెరుగుదల మానుటయే గాక అవి తగ్గినవి.

## ఇతర వినియోగములు

ఈ నూనె రుచులు కలిగించుటకు, పానీయములలోను, నిమ్మ రసముల లోను, పండ్లు తోము బంకలలోను కలుపవచ్చును. ఈగలు దోమలు చేరకుండ నూనెలు తయారు చేయుటలో దీన్ని కలిపిన అవి యేవియు దగ్గరకు రావు. కొండ తావులలో ఇది అందానికి పెంపబడే మొక్క.

# 35. నీలకాంతం

GENTIANA KURROO Royle – ఇండియన్ జెన్షియన్

కుటుంబము : జెన్షియనేసే

భారతీయ పేర్లు : హిందీ – కమల్‌ఫల్, నిల్‌కాంత్, కుట్కి
బెంగాలీ – కారు, కుట్కి
గుజరాతీ – పాఖాన్‌బెడ్
కాశ్మీరీ – నీలకాంతి
(జాన్‌సార్ – కారు)

నిజమైన జన్షియన్‌కు భారతదేశము సమమైన మాటను వర్తక నామము తెలుపుచున్నది.

## వర్ణన

చాల కాలము జీవించే వంగిన కొమ్మలు కలిగిన చిన్న మొక్క. 10–35 సెం. మీ. ఎత్తు పెరుగును. తల్లివేరు దుంపగా యుండును. క్రింద ఆకులు 7–13 సెం. మీ. పొడవుండును. అవి గుంపులుగా యుండును. పైనున్న ఆకులు 2.5 సెం.మీ. పొడుగై, సన్నముగా నుండును. నీలిరంగు గల పువ్వులకు తెల్లని మచ్చలుండును. 2.5 సెం. మీ. వ్యాసము, 4–5 సెం. మీ. పొడవుండును. అవి ఒకటిగా గాని 2–4 కలిన చిన్న గుత్తులుగా గాని యుండును.

కాయ 2 సెం. మీ. పొడవు. 1500 – 3500 మీ. ఎత్తున కాశ్మీరులో గల పశ్చిమోత్తర హిమాలయముల యందు దొరకును. వాటి పక్క కొండలలో కూడ కలదు.

## ఔషధము దాని గుణములు

ఎండించిన దుంపలు ఔషధమగును. జెన్షియన్ మందు ఆకలి పుట్టించుటకు, జీర్ణరసములను స్రవింపజేయుటకు నుపయోగపడును. ఉదర

వ్యాధులకు సంబంధించిన అనేక మందుల లోను, పుష్టికరమైన మందుల లోను దీని పాలు ఉండును. దీనికి చక్కని రుచి, పరిమళము గలవు. ఎక్కువ మోతాదులలో తీసుకున్న విరేచనకారిగా పనిచేయును.

సన్నిహితపు మొక్కలు

జెన్షియానా లూటియా : (పసుపు జెన్షియన్)

ఇది ఇతర దేశములలో నుండు మొక్క. దీని వ్రేళ్ళు మందులోకి పనికివచ్చును గనుక ఎక్కువగా మనకు దిగుమతి అగుచున్నది. పశ్చిమోత్తర హిమాలయములలో మూడు వేల మీటర్ల యెత్తున వాతావరణము దీని సాగుకు సరియైనదని సూచింపబడినది. ఇంకా ఒకటి రెండు జెన్షియానా జాతులు హిమాలయములలో కలుపు మొక్కలుగా పెరుగుచున్నవి. వాటిని కూడ జెన్షియానా కుర్రు స్థానములలో నుపయోగించవచ్చును. మన దేశములో గల పైక్రోరైజాస్ కుర్రోవా అనునది జెన్షియానా లూటియాకు సమమని తెలియుచున్నది. సాలీనా మనకు ఇది పది క్వింటాల్స్ కావలసియున్నదని మదింపు చేయబడినది.

## 36. యాస్టిమధుకము

GLYCYRRHIZA GLABRA L. - లికొరైస్

కుటుంబము : పాపిలియొనేసి

భారతీయ పేర్లు : హిందీ - ముల్హాఠీ, ములేఠీ
బెంగాలీ - జాస్తి మాధు
కన్నడ - యాస్తి మాధుకమ్
మళయాళం - ఇరాతిమధురమ్
సంస్కృతం - మధుయస్టి
తమిళం - అతిమధురం

వర్తక నామమైన లికొరైస్‌ను భారత లికొరైస్, అనగా యేబ్రస్ ప్రికెటోరియస్ (గురివింద) తో కలుపకూడదు.

## వర్ణన

1.5 మీటర్ల యెత్తు పెరిగెడి పొద. ఆకులు సంయుక్తములు చిరు ఆకులు 4–7 వరకుండును. పువ్వులు లేత ఊదా రంగు గలిగి చిన్నవిగా నుండును. మృదువైన పుష్ప వృంతముల కంటుకొని గ్రీవములలో నుండును. ఈ కాడలు ఆకుల కంటె పొడవుగా నుండును. ముళ్ళ లాంటి రోమములతో నిండిన కాయలు పలుచగా 1–3 సెం. మీ. పొడవుండును. తల్లి వేరు సంస్థలో అనేక మూలము లుండును. శాఖోపశాఖలు కలిగిన అనేక కొమ్మలు వేరు నుండి బయలుదేరును.

## విస్తరణ

కాశ్మీరు నందు ఉత్తర ప్రదేశములలో దొరకును. ప్రస్తుతం కాశ్మీరు, డెహ్రాడూన్, ఢిల్లీలలో సాగు చేయుచున్నారు.

## ఔషధము దాని గుణములు

ఎండించిన వ్రేళ్లు, భూమిలోని కొమ్మలు ఔషధముగా పనికివచ్చును. లికొరిస్ అనునది దగ్గుకు, గొంతు నొప్పికి, బ్రోంకైటిస్ దగ్గుకు, జీర్ణకోశములలోని నొప్పులకు, క్షయవ్యాధికి, మూర్ఛలకు పనిచేయును. పచ్చి వేళ్ళు నమలి, దాని రసము పీల్చిన చాలును - దగ్గు, గొంతు నొప్పులు మాని పోవును.

మూత్రము జారి చేయుట కుపయోగపడును. ఈ గుణమును, దీని క్రిమి సంహారత్వమును, బాక్టీరియములను హరించు శక్తియు పరిశోధనల వలన నిర్ధారణ కాబడినది. దీని తియ్యని రుచియు, నీళ్ళలో కలువని గుణము ఆధారముగా తీసికొని, లికొరిస్‌ను మందు పానీయములు చేయుట కుపయోగించుచున్నారు. అంతేగాక చేదు మందులకు బిళ్ళల పై పూతగా వినియోగపడుచున్నది. ఇది జీర్ణకోశములో గల పుండ్లను మాన్ప గలదు. అంతేగాక డియోడినమ్‌లో పుట్టెడి కురుపులను గూడ శమించును. గాయములకు లికొరిస్ చూర్ణమును వెన్నలో కలిపి, తేనె వేసి పైన పూయుదురు. పచ్చి ఆకులను తలపైన పట్టు వేసినచో తల మీద కురుపుల మచ్చలు శమించును.

## ఇతర వినియోగములు

దీని చూర్ణమును గాని, చిన్న ముక్కగాని తాంబూలములో నుపయోగింతురు. ఇది మనకు నాలుగు వేల క్వింటాల్సు వరకూ సాలీనా కావలసి యున్నది.

కాశ్మీరము, పంజాబు, హిమాచల ప్రదేశ్, ఉత్తర ప్రదేశ్, తమిళ నాడు నందు దీని సాగుకు వీలుగా యుండునని సలహా యివ్వబడినది. దీనిని గురించి చర్చించునపుడు డా. హెచ్. సంతాపు, డైరెక్టర్, బొటానికల్ సర్వే ఆఫ్ ఇండియా (స్పెయిను నందు పుట్టి మన దేశములో స్థిర పడిరి.) గ్లైసిరైజా అనునది స్పెయిను, ఇటలీ దేశములలో వరి భూముల యందు కలుపు మొక్కయని పేర్కొనిరి. అచట చిన్న పిల్లలు మిఠాయి పదారములు కొనుట మాని ఈ మొక్కలను పెకి లాగి వాటి వేళ్ళను నమలి ఆనందింతురు.

# 37. సుగంధి పాల

HEMIDESMUS INDICUS (L.) Schult - ఇండియన్ సర్సపరిల్ల

**కుటుంబము :** పెరిప్లొకేసి

| **భారతీయ పేర్లు :** | | |
|---|---|---|
| | హిందీ | – హిందీ సల్‌సా, అనంతమల్ |
| | బెంగాలీ | – అనంతమల్ |
| | గుజరాతీ | – దురివెల్ |
| | కన్నడ | – సోగ్‌దెబెరింగిడ |
| | మళయాళం | – నన్నారి |
| | మరాఠీ, ఒరియా | – అనంతమల్ |
| | సంస్కృతం | – నాగజిహ్వా |
| | తమిళం | – నన్నారి |
| | తెలుగు | – ముత్తవపులగము, సుగంధిపాల |

(మధ్య ఇండియా : కలిదుధి, ఛోటి దుధి)

స్మైలేక్స్ నుండి తీయబడు అసలు సర్సపరిల్లాకు ఇది సమమైనది. కనుక దీనిని భారతీయ సర్సపరిల్లా అని వాడుక చేయుచున్నారు.

## వర్ణన

అనేక సంవత్సరములు జీవించు తిరుగుడు తీగ. దీని వేరు మొదట గట్టిగా నుండును. కొమ్మలు మృదువై, రోమరహితములు. ఆకులు పరిమాణములోను ఆకారములోను తేడాలు కలిగియుండును. 5–10 సెం.మీ. పొడవు గల్గి 0.5 – 4.0. సెం.మీ. వెడల్పు వరకు ముదురు ఆకుపచ్చ రంగులో ఆకులుండును. తరచుగా తెల్లని గీతలు మధ్యను పొడవుగా యుండును. కొన్నిటికి ఆకు అడుగున రోమములుండును. ఒత్తుగా అమర్చబడిన చిన్న చిన్న పువ్వులు ఆకుపచ్చ రంగులో నుండును. కాయలు 10 – 15 సెం. మీ. పొడవుగా గుండ్రంగాను, ఆకుపచ్చగా నుండి చివరలు సూదిగా తేలి రెండేసి అభిముఖముగా నుండును. గింజలు

చిన్నవి, నల్లనివి. తెల్లని రోమసమితి పైన కలవి. మొక్క అంతటను గిల్లినచో తెల్లని పాలు కారును.

## విస్తరణ

మన దేశంలో అంతటా వ్యాప్తిలో నున్నవి.

## ఔషధము దాని గుణములు

ఈ ఔషధము ఎండించిన వ్రేళ్ళలోనుంచి తీయుదురు. ఇది జ్వరముల కును చర్మ వ్యాధులకును ఆకలి లేమికి, సవాయి, తెల్లబట్టల రోగమునకు, మూత్రకుచ్ఛ్ర రోగముల కుపయోగపడును. మూత్రము జారీచేసే దీని గుణమును ప్రయోగములవల్ల ఋజువుచేశారు. ఎక్కువగా ఈ మందును రక్త పారిశుద్ధ్యమునకు కీళ్ల వాతమునకు వాడుదురు. స్మైలేక్స్ నుండి తీయబడు నిజమైన సార్స్పరిల్లాకు భారతీయ సార్స్పరిల్లా సరిగ్గా సమ మైనదని వైద్యశాలల యందు స్థిరపరుపబడినది.

## ఇతర వినియోగములు

సన్నని ఆకులు గల మొక్క యొక్క ఆకులు నమలినచో అలసట పోయి ఉత్సాహము కలుగజేయును.

## 38. పాలకొడస

**HOLARRHENA ANTIDYSENTERICA** (L.) Wallich - కురుచి

**కుటుంబము** : ఎపోసైనేసి

**భారతీయ పేర్లు** : హిందీ – ఇంద్రజౌ, కోరై, కురిచి
అస్సామీ – డషురి
బెంగాలీ – కురిచి
గుజరాతీ – కుడ
కన్నడ – హాలి
మళయాళం – కొడగపల
మరాఠీ – గాల్, డుథారి, కొడయ
ఒరియా – ఖుర్చి, ఖెర్వా
పంజాబీ – కివార్
సంస్కృతం – కుటజ, కలింగ
తమిళం – ఇంద్రబాన్

ప్రాంతీయ నామమే వర్తకనామ మైనది.

ఏంటి డిసెంటెరికా అను శాస్త్రీయ నామము. జిగట విరేచనములు కుదుర్చునను దాని యుపయోగమును సూచించుచున్నది. 'కుటజ' అను సంస్కృతపు పేరు వలన నిది కొండ శిఖరములమీద పెరుగునని తెలియు చున్నది.

### వర్ణన

10 మీటర్ల ఎత్తువరకు పెరిగెడి పొడవైన పొదగా గాని చిన్న చెట్టుగా గాని రూపొందును. 10 – 30 సెం. మీ. పొడవైన ఆకులు అరకుచుక్క ఆకారముగా నుండి పలుచగా నుండును. తొడిమలు స్ఫుటముగా గోచరించును. వృంతములు చాల పొట్టివి. పరిమళము గల తెల్లని పుష్పములు 1 నుండి 1 సెం. మీ. వ్యాసము గలవి కొనలయందు పెద్ద గుత్తులుగా

నుండును. కాయలు మృదువై గుండ్రముగా 20 - 45 సెం. మీ. పొడవు 6-8 మి. మీ. మందమూ కలిగి తెల్ల మచ్చలతో నల్లగా నుండును. విత్తనములు 1 సెం. మీ. పొడవుతో గోధుమరంగు కలిగిన రోమముల కుచ్చులతో నుండును. ఈ రోమముల పొడవు 2 – $2\frac{1}{2}$ సెం. మీ. మొక్క ఎక్కడ గ్రుచ్చినా తెల్లని పాలు కారును.

## విస్తరణ

1200 మీటర యెత్తున మన దేశమంతటిలోను వ్యాప్తిచెందియున్నది. మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, పరగణాలలో అరణ్యముల అంచుల యందు ఎక్కువగా కన్పించుచున్నది.

## ఔషధము - దాని గుణములు

ఎండించిన బెరడు కురుచియను మందు అగుచున్నది. దీని ముఖ్య వినియోగము క్రిముల వల్ల కలిగిన జిగట విరేచనములను కుదుర్చుట. బెరడు యొక్క కషాయము గాని దానితో ఇతర వస్తువులు కలిపిన మందులను గాని ఉపయోగింతురు. ఈ బెరడు కషాయము బలవర్ధనకరము. ఇతర సుగుణముల నిచ్చునవి. దీనిలో నుండు 'కోనిసైన్' అను అల్కలోయిడు క్షయవ్యాధి బాక్టీరియముల అభివృద్ధిని నిరోధించును. విత్తనములలో కూడ ఈ ఆల్కలాయిడ్ ఉండి జిగట విరేచనముల నరికట్టుచున్నది. కొన్ని ఔషధ గుణములు దీని ఆకులకు కూడ అరోపింపబడుచున్నవి.

## ఇతర వినియోగములు

చవిటి నేలలో మొక్కలను తీసివేయుట కిది ఉపయోగించును. ఖాళీ అయిన అడవి నేలలో యిది ముందుగా పుట్టి పెరుగును. దీని కర్ర వివిధ రకములైన గృహోపకరణముల నిర్మాణములో ఉపయోగపడును. అందు ముఖ్యముగా కాగితములను కోయు చాకులు, బొమ్మలు, చిన్న పెట్టెలు, కలముల దిమ్మలు, దువ్వెనలు, అచ్చుదిమ్మలు, పొగాకు తొట్టెలు, బొమ్మల చుట్టూ చట్రములు మొదలైనవాటి కుపయోగపడును.

## 39. చాల్ మోగ్ర

HYDNOCARPUS KURZII (King) Warb.

**కుటుంబము :** ఫ్లాకౌర్షియేసి

**భారతీయ పేర్లు :** హిందీ – చాల్ మోగ్ర
అస్సామీ – లంటానీ
బెంగాలీ – చాల్ మోగ్ర, డాల్ మెగ్రి
మళయాళం – మరవెట్టి

ప్రాంతీయ నామమే వర్తకములో వాడుకైనది.

### వర్ణన

15 మీటర్ల కంటె పైన యెత్తుగల చెట్టు. మొదలు పొడుగుగా నుండి తలపై నుండు కొమ్మలు క్రిందకు వ్రేలాడుచుండును. 20 సెం. మీ. పొడుగైన ఆకులు చర్మము వలె నుండి చివరకు కొనదేరి యుండును. గ్రీవములందు పసుపు పచ్చని చిన్న పువ్వులు గుత్తులుగా యేర్పడును. కాయ 6–7 సెం.మీ. వ్యాసము కలిగి గుండ్రముగా గోధుమ రంగులో నుండును. విత్తనములు చాల విరివిగా నుండును.

### విస్తరణ

అస్సాము, త్రిపుర పరగణాలలోని నిత్యము పచ్చని అరణ్యములలో నుండును. కొన్ని ప్రదేశములలో పుష్కలముగా పెరుగును.

### ఔషధము దాని గుణములు

దీని విత్తనములనుండి తీయబడిన నూనె ఔషధము. ఈ నూనెను కుష్ఠ రోగుల కుపయోగింతురు. పూర్వం ఈ నూనెను రోగులచేత త్రాగించెడివారు. ప్రస్తుతం ఈ నూనె వలన తయారుచేయబడిన ఔషధములను ఇంజెక్షన్ల ద్వారా రక్తములోనికి పంపుచున్నారు. బెరడులోని టానిన్ పదార్థము జ్వరములను హరించును.

## ఇతర వినియోగములు

హిడ్నో కార్పస్ కుర్జీ అను చెట్టు విత్తనముల తెలగపిండిని ఎరువుగా నుపయోగింతురు. కొన్ని జంతువులు ఈ పండ్లను తింటాయి. వాటి మాంసము ఎవరును తినగూడదు. చేపల్ని గూడ చాల్మోగ్ర కాయల వలన చంపినచో అవి మానవులు తినడానికి పనికిరావు.

## సన్నిహితపు మొక్కలు

హి. లారిఫోలియా. (డెన్స్‌స్) స్లూమర్ ప్రత్యాయపదము.
హి. వైటియానా. బ్లూమ్. (మరాఠీ – కాటు, కవాత్
సంస్కృతం – గరుడఫల్
తమిళం – మరవెట్టి.)

అను మొక్క పశ్చిమ కనుమలలో దొరకును. దీని విత్తనముల నూనె ఔషధముగా పనిచేయును. హి. కురుజీ విత్తుల నూనెవలెనే యిదికూడ పనిచేయును. కుష్ఠు రోగులకు పుండ్లకు ఈ నూనె పూసినచో అవి శమించును. ఈ నూనె కీళ్ళ వాతపు నొప్పులకు కండరపు నొప్పులకు క్షయవ్యాధి పీడితులకు వచ్చు ఊపిరితిత్తుల నొప్పులకు, అన్ని రకములైన వాపులకు పనిచేయును. కొన్ని రకములైన బాక్టీరియములను హరింప గలదని ప్రయోగముల ద్వారా తెలిసినది.

# 40. నీరుగొబ్బి

HYGROPHILA AURICULATA (Schum.) Heine - తల్మఖాన
syn. *H. spinosa* And., *Asteracantha longifolia* Nees

**కుటుంబము :** ఎఖేంతేసి

**భారతీయ పేర్లు :**

| | |
|---|---|
| హిందీ | – తల్మఖాన, కులియకాంత |
| బెంగాలీ | – కులియాఖరా, కలోప్రకట |
| గుజరాతీ | – ఇక్రో |
| కన్నడ | – కోడవంఖి |
| మళయాళం | – వావిల్ చుళ్ళి |
| మరాఠీ | – తాలిమఖాన |
| సంస్కృతం | – కోకిలాక్ష |
| తమిళం | – నిర్ముల్లి |

ప్రాంతీయ నామములే వర్తక నామములుగా పరిగణింపబడుచున్నవి.

## వర్ణన

లావుపాటి 60 - 150 సెం. మీ. ఎత్తు పెరుగు పొద. కొమ్మలు శాఖల నివ్వవు. నాలుగు కోణములు కలిగి నిలువుగా నిలబడియుండును. కణుపుల దగ్గర రోమములు మెండుగా నుండి సర్వత్రా పలుచగా నుండును. ఆకులు కాడచుట్టూ ఉండును. కణుపుకు ఆరేసి ఆకులు ఉండును. ప్రతి ఆకుగ్రీవం లోను పచ్చని పదునైన ముల్లు మొలచును. పువ్వులు 8 ఒక గుంపుగా, నీలి రంగు, ఊదా రంగులో నుండి మూడు సెం. మీ. పొడవుండును. ఆకర్షణ పత్రములు రెండు పెదవులుగా విభజింపబడి యుండును. అందు క్రింద పెదవి వికృతముగా ముడుచుకొని యుండును.

## విస్తరణ

బాటల కిరువైపుల నుండు యెండిన గోతులలోను బురద నేలలోను ఖాళీ ప్రదేశములలో మన దేశ మంతట వ్యాప్తిలో నున్నది.

### ఔషధము దాని గుణములు

ఇది సమూలముగా ఔషధమునకు పనిచేయును. ఉబ్బు కాయిలాకును, కామెర్లకు కీళ్ళ వాతమునకు మూత్రకుచ్ఛ, లైంగికాంగముల రోగములకు పనిచేయును. పిత్తనములును సుఖ రోగములను కుదుర్చును. మూత్రము జారీచేసే గుణము దీనియందు గల చేతన అచేతన పదార్థముల మీద ఆధారపడియున్నదని నమ్ముచున్నారు. పిత్తనములు, వ్రేళ్లు ప్రత్యేకముగా కూడ మూత్రమును జారీ చేయగల గుణమును కలిగినవి. ఆకులు దగ్గులకు స్త్రీల స్రావరోగముల కుపయోగపడును.

## 41. హయోసయామస్

HYOSCYAMUS NIGER L. – భారతీయ హెన్‌బెన్

కుటుంబము : సోలెనెసీ

భారతీయ పేర్లు : హిందీ – ఖరాసానీ అజవాయిన్
బెంగాలీ – ,,
గుజరాతీ – ,,
మరాఠీ – కురసాని ఓవా
సంస్కృతం – పరాసికయ

శాస్త్రీయ నామమే వర్తక నామము.

### వర్ణన

ఒకటి రెండు సంవత్సరములు జీవించు దుర్గంధమును వెదజల్లు పొద. అంతటా ఒత్తుగా గ్రంధులతో కూడిన రోమములుండును. ఒక మీటరు ఎత్తువరకు పెరుగును. క్రింది ఆకులు 15-20 సెం. మీ. పొడవుననుండి అంచులయందు పళ్ళు కలిగియుండును. పైనున్న ఆకులు చిన్నవి. అనేక విభాగములు కలిగినవి. పువ్వులు లేత ఆకుపచ్చ రంగులో ఊదా రంగు

గీతలు గలిగి 2.3 సెం. మీ. వ్యాసములో నుండును. కొమ్మల పంగలలో విడిగా పువ్వులు మొలచును. మరికొన్ని పొడుగాటి కాడలలో చివర్ల యందుత్పత్తియగును. గుండ్రని కాయలు 1.3 సెం.మీ. వ్యాసము గలవి.

## విస్తరణ

1500–3000 మీటర్ల యెత్తున ప్రజలు నివసించు ప్రదేశములలో పశ్చిమ హిమాలయములలో కాశ్మీరు మొదలు గహర్‌వాల్ వరకు దొరకును. దీనిని కాశ్మీరు, పంజాబు, ఉత్తరప్రదేశ్, మహారాష్ట్రము నీలగిరి కొండ లలో మనదేశ మందు సాగు చేయుచున్నారు.

## ఔషధము దాని గుణములు

పూతకొమ్మలు, ఎండించిన ఆకులు ఔషధముగా నుపయోగపడును. బెలడోనా అనుదానితో సమమైన గుణములు దీనికి గలవు. కండరము లుద్రేకించి నొప్పులు పుట్టినపుడు నరముల సంక్షోభములు, హిస్టీరియాలో వలె, కలిగినపుడు, దగ్గులకు పనిచేయును. కంటిపాపలను విస్తరింప జేయును. విత్తనములు నూరి వాపులకు పోటులకు పైన పూసిన శమించును. సాలీనా 40 క్వింటాల్స్ మందు మనకు కావలసియున్నది. ఇది హిమాలయములలో కాశ్మీరు, పంజాబ్, హిమాచలప్రదేశ్, ఉత్తరప్రదేశ్ లలో సాగు చేయబడుచున్నది.

## ఇతర సన్నిహితపు మొక్కలు

హ. మ్యూటికస్‌ను కాశ్మీరులో సాగు చేయుదురు. దీనిలోని ఆల్కలాయిడ్ ఇండియన్ హెన్‌బేన్‌లోని దానికంటె ఎక్కువగా నున్నది. దీనిలోని మత్తు గుణము కూడ మిన్నగా యుండును. మత్తు కలుగ జేయుటకు ఈజిప్షియన్ హెన్‌బేన్‌తో చుట్టలు, సిగరెట్లు కాల్చుదురు. మనకు కావలసిన 40 క్వింటాల్స్ హెన్‌బేన్ పైన చెప్పిన రెండు మొక్కలకు సాగు అభివృద్ధి చేసిన సరిపోగలదు.

## 42. జిరికి

(కాలాదానా)

IPOMOEA NIL (L) Roth syn. *I. hederacea* auct. non Jacq.

**కుటుంబము :** కన్వాల్వులేసి

**భారతీయ పేర్లు :**

| | |
|---|---|
| హిందీ | – కాలాదానా, నిల్ కాల్మి |
| బెంగాలీ, గుజరాతీ | – కాలాదానా |
| గుజరాతీ | – కనకుప్పన్ |
| మరాఠీ | – నీల్ పుష్పి |
| ఒరియా | – కనికోండో |
| సంస్కృతం | – కృష్ణాబీజ |
| తమిళం | – సిరిక్క |
| (నైనితాల్ | – భోరాడ) |

మన దేశపు ప్రాంతీయ నామములే వర్తక నామములు. మొక్క యొక్క నిల్ అను పేరు నీలిరంగు పుష్పముల వలన వచ్చినది.

### వర్ణన

అందందు రోమములు కలిగిన తిరుగుడు మొక్క. ఒక సంవత్సరము పాటు జీవించునది. ఆకులు 5–12 సెం. మీ. వ్యాసము కలిగి అరకు చుక్కాకారము కలవి. ఆకులు మూడు భాగములుగా చివర విభజింప బడును. నీల వర్ణములో గరాటాకృతి గల పువ్వులు 4–5 సెం. మీ. పొడ వుండును. వీటి క్రింది భాగమున నారింజపండు రంగుండును. చిన్న చిన్న గుంపులలో ఇవి పెరుగును. కాయ 8. మి. మీ. వ్యాసము కలిగి గుండ్ర ముగా గాని కోలగా గాని ఉండును. విత్తనములు చిన్నవి, నిగ నిగలాడు చుండును. ఈ పువ్వుల రంగును గూర్చిన విశేషమున్నది. మొక్క నున్నంతసేపు నీలి రంగులో నుండును. కోసిన వెంటనే ఊదా రంగుగా మారును. ఈ కారణంగా చాల పుస్తకములలో ఊదా రంగు పుష్పములని వ్రాసినారు.




కాలాదానా (*Ipomoea nil*)



ఐపోమియా ( *Ipomoea pestigridis*)




స్వాంప్ కేబేజి (*Ipomoea acquatica*)

## విస్తరణ

1800 మీటర్ల ఎత్తువరకూ ఇది మనదేశ మంతటా కలుపుమొక్కగా పెరుగుచున్నది. కొన్ని సమయములలో ఇది సాగు చేయబడుచున్నది.

## ఔషధము దాని గుణములు

ఎండించిన విత్తనములు ఔషధముగా పనిచేయును. కాలాదానా విరేచనముల మందుగా పనిచేయును. ఎక్కువ మోతాదులలో వాడిన ఉద్రేకములను పుటించును.

## ఇతర వినియోగములు

పచ్చికాయలు కూరగా నుపయోగింతురు. తరచుగా దీనిని అందమైన పువ్వుల కొఱకు పెంచుదురు.

## ఇతర సన్నిహితపు మొక్కలు

ఐపోమియా జాతికి చెందిన అనేక స్పీషీసు ఔషధ విలువ కలిగినవి. అందు చాల భాగము విరేచన కారిత్వము కలిగినవి. ఉదాహరణకు ఐ. పెస్ట్రగడిస్ వేళ్ళు. (హిందీ - గైభటి, కాలాదానా, పంచపత్రి, మధ్య ప్రదేశ్ - బాడి పసివి) ఐ. ఎక్వేటికా (స్వేంప్‌కాబేజి, హిందీ - కాల్విషా, పంజాబీ - సోర్ణవిక సాంగ్) యొక్క రసము, ఐ. పెస్ కాప్రి (హిందీ-దోపటిలాట) ఐ. పర్ప్యూరియా (మోర్నింగ్ గ్లోరీ); ఐ. క్వామోక్లిట్ (ఇండియన్ పింక్, హిందీ-కామలత, బెంగాలీ - తోరులత); ఐ. యూనిఫ్లోరా, ఐ. కైరికా, విత్తనములు కూడ విరేచనకారులు. [బస్తర్ ప్రదేశములోని ఆటవికులు ఐ. ఎక్వేటికా పువ్వుల రసమును వాచిన కండ్లకు పోయుదురు.] ఐ. పర్గా యొక్క దుంపవ్రేళ్లు (దీని పేరిప్పుడు యక్సోగోనియంపర్గా) విరేచనకారులు. ఈ మొక్క అమెరికాలో నుండునది. అలంకారమునకు దీనిని తూర్పు, దక్షిణ భారతదేశ ప్రాంతములలో సాగు చేయుచున్నారు. సాలీనా ఆరు క్వింటాల్స్ మాత్రము ఇది మనకవసరమగుచున్నది. మన దేశములో నున్న జాతి మొక్కలు దీనికి సమమైన మొక్కలే.

## 43. గోరింట

LAWSONIA INERMIS L, syn. *L. alba* L - హెన్నా

**కుటుంబము :** లైత్రేసి

**భారతీయ పేర్లు :** హిందీ - మెహంది
బెంగాలీ - మెహంది
గుజరాతీ - మెహంది
కన్నడ - మైలాంచి, గోరంటి
కాశ్మీరు - మోహజ్
మళయాళం - మెలాంచి
మరాఠీ - మెహందీ
ఒరియా - బెంజాటి
పంజాబీ - హినాహ
సంస్కృతం - మేండి, రక్త గర్భ
తమిళం - మారితోండి, ముల్లు గోరింట

హైనా అను అరబ్బు నామము వర్తకములో వాడుక చెందినది.

### వర్ణన

సాధారణమైన యెత్తు వరకు పెరిగే ఒత్తుగా కొమ్మలు వేయు పొద. ఒకప్పుడు చిన్న చెట్టు వరకు పెరుగును. కొమ్మలు నాలుగు కోణములు కలవియై చివరకు సూది మొనలాగు తేలును. ఆకులు అభిముఖముగా రెండు మూడు సెం. మీ. పొడవుండును. తరచుగా ఆకు చివర సూది మొనలా నుండును. కొనల యందు సువాసనతో కూడిన తెల్లని లేక గులాబీ రంగులో పెద్ద పెద్ద పూగుత్తులుండును. కాయ బఠానీ గింజంత గుండ్ర ముగా నుండును. విత్తనములు చాలా యుండును.

### విస్తరణ

ఉష్ణ మండలములలో మన దేశమంతటా మొలచును. సాధారణముగా

దీనిని చేలకు కంచెలగా పెంచుదురు. వర్తకమునకై దీనిని పంజాబ్, గుజరాతు, మధ్య ప్రదేశ్, రాజస్థానములలో సాగు చేయుచున్నారు.

## ఔషధము దాని గుణములు

దీని ఆకులకు ఔషద గుణము లున్నవి. చర్మ వ్యాధులను నిరోధించుటకును, కండరములను బిగ బట్టుటకు నుపయోగపడును. కురుపులకు కాలిన పుండ్లకు చర్మ వ్యాధులకు దీనిని పట్టు వేయుదురు. గొంతు నొప్పులకు దీని కషాయమును పుక్కిలించవచ్చును. ఈ ఆకులను నూరి మన దేశంలో తల నొప్పికి పట్టు వేయుదురు. అరికాళ్ళ మంటలకు కూడ వేయవచ్చును. దీని ఆకులు క్షయవ్యాధి బాక్టీరియములను నిరోధించగలవు. అంతేగాక, సంధి వాత జ్వరమునకు, రక్త నాళములు పగులుట వలన జబ్బులకు ఉపయోగపడును. కాని ఈ విధమైన ఉపయోగముల కిది ఉపయోగించుట లేదు. ఆయుర్వేద, యునేని వైద్యములలో ఈ మొక్కపై బెరడు, విత్తనములు వినియోగించుచున్నట్టు తెలియుచున్నది.

## ఇతర వినియోగములు

హెన్నా ముఖ్య ఉపయోగము అరచేతులకు, గోళ్ళకు, పాదములకు, శిరోజములకు, గడ్డములకు, జంతువుల యొక్క తోకలకు, కాళ్ళకు, అందమైన నారింజపండు రంగును కలుగజేయుట. దీనిలో ఇతర రంగులు కలిపి శిరోజములకు బట్టలకు రంగులు వేయుటకు ఉపయోగించుచున్నారు.

విత్తనముల నూనె పరిమళ ద్రవ్యముగా నుపయోగపడుచున్నది.

# 44. అడవి పొగాకు

లొబిలియా (*Wild Tobacco*)

**LOBELIA NICOTIANAEFOLIA** Heyne. ex Roth

**కుటుంబము :** లొబిలియేసి

**భారతీయ పేర్లు :**

| | |
|---|---|
| హిందీ | - నరసల్ |
| బెంగాలీ | - చాంటామకు |
| గుజరాతీ | - నలి |
| కన్నడ | - కడుహొగే సొప్పిలి |
| మళయాళం | - కట్టుపుకాయిల |
| మరాఠీ | - దేవానల |
| సంస్కృతం | - బిభీషణ, దేవానల |
| తమిళం | - కట్టుపుగయిలై |

జెనిరిక్ పేరు వర్తక నామమైనది. పొగాకు ఆకారమున దీని యాకు బుండుట చేత ప్రత్యేక నామము నికొటైనిఫోలియా అని వాడుకయైనది.

## వర్ణన

లావుపాటి మొదలు గలిగి 3-5 మీటర్ల ఎత్తున పెరిగెడి సుకుమారమైన పొద. కొమ్మల గర్భంలో ఖాళీ యుండును. పై భాగమున అప్పుడప్పుడు శాఖలు వేయును. పై ఆకులు చిన్నవి, క్రింది యాకులు పెద్దవి. 45 సెంటీ మీటర్ల పొడవు గలవి. అంచు సరాసరిగా నుండదు. ప్రధాన తొడిమ తెల్లగా యుండును. కొమ్మల కొనలయందు పెద్ద, తెల్లని పూగుత్తు లుండును. 8 మిల్లిమీటర్ల వ్యాసము గల గుండ్రని కాయలుండును. పసుపు రంగులో గాని గోధుమ రంగులో గాని, అనేక చిన్న గింజలుండును.

## విస్తరణ

దక్కను ద్వీపకల్పమందు, కొండల మీదను, వాటి ననుసరించి యున్న చదునైన భూములందును పెరుగును.

## ఔషధము దాని గుణములు

దీని కొమ్మలు, ఆకులు అక్టోబరు, నవంబరుల మధ్య కోసి, నీడను ఎండించిన చూర్ణము చేసినచో నది మందుగా నుపయోగపడును.

దీని గుణములు పొగాకులో గల 'నికోటిన్' కు సమానమైనవి. ఉబ్బసము, బ్రోంకైటిస్ అను దగ్గుల కుపయోగించును. దీనివలన, చెమటలు, వికారము, డోకులు కలుగజేసి, తద్వారా ప్రశాంతత నిచ్చును. దీనిని బయటకు క్రక్కనిచో ప్రమాదకరమై, స్మృతి లేని పరిస్థితిలోనికి దించుతే గాక, మరణమును గూడ సంభవింపజేయును.

లొబిలైన్ అను ఆల్కాలాయిడ్ శ్వాస క్రియ నుద్రేకింపజేసి మత్తు పదార్థముల వలన నిద్ర పుట్టించు మందుల వలన, విషవాయువుల వలన, ఊపిరి పీల్చుకోలేని దుస్థితిని నివారించును. లొబిలియా నికొటైనిఫోలియా యొక్క కొమ్మలు, ఆకులు, తెల్లని పాలను స్రవింపజేయును. ఈ పాలు చర్మము మీద పడినచో దద్దురులు, బొబ్బలు కలుగజేయును.

ఎండిన మొక్కల సముదాయము దూరమున నున్నను ముక్కు రంధ్రములలో నుద్రేకమునిచ్చి గొంతుకకు, ముక్కునకు హాని కలుగ జేయును. కృషివలు ఇతర మొక్కలను ఏరునపుడు ఈ మొక్కలున్న చోటును విసర్జించుదురు.

## ఇతర సన్నిహితపు మొక్కలు

లొ. ఇన్‌ఫ్లేటా అనునవి అమెరికా దేశములో నున్నను మన దేశమునకు తెచ్చి సాగు చేయవలెనని అనుకొనుచున్నారు. దక్షిణ ద్వీపకల్పము, అస్సాము దీని సాగుకు మెరుగైన ప్రదేశములు. లొబిలైన్ యను ఔషధము, లొబిలియా నుండి తీయబడి మనకు దిగుమతి యగుచున్నది. అయినప్పటికిని మనదేశములో దొరకు ఆ జాతి మొక్కలనుండి తీసిన లొబిలియా ఈ ఔషధము స్థానములో వాడుచున్నాము. మనకు సాలీనా కావలసిన లొబిలియా ఔషధము 50 క్వింటాల్స్.

కొన్ని ముఖ్యమైన లొబిలియా స్పీషీసు కలుపు మొక్కలవలె పెరుగుచున్నను అవి వినియోగము లేనివి.

# 45. ఇప్ప

MADHUCA INDICA Gmel. syn. *Bassia latifolia* Roxb - మధుక

**కుటుంబము :** సపోటేసి

| **భారతీయ పేర్లు :** | | |
|---|---|---|
| | హిందీ | – మహువా |
| | బెంగాలీ | – మహువా |
| | గుజరాతీ | – మహుడో |
| | కన్నడ | – హిప్పి |
| | మళయాళం | – ఇలుపై |
| | మరాఠీ | – మోహువ |
| | ఒరియా | – మోహుక |
| | సంస్కృతం | – మధుక, వనప్రస్త |
| | తమిళం | – ఏలుప్పై |
| | (శాంటల్ | – మాట్ కోమ్) |

సంస్కృతము పేరే వర్తకములో పరిపాటి అయినది. ప్రాచీన గ్రంథముల లోని వనప్రస్త యను పేరు. ఇది వనములలో నుండుట చేత వచ్చినది.

## వర్ణన

ఆకులు రాల్చెడి పెద్ద చెట్టు. దీనికి మొదలు పొట్టి, తల భాగము పెద్దది. ఆకులు 12 – 25 సెం. మీ. పొడవు. దళసరిగా చర్మము వలె నుండి చివరకు కొనదేరి యుండును. తొడిమలు స్ఫుటముగా నుండును. పువ్వులు కండ కలిగి బూడిద రంగులో కొమ్మల చివర గుత్తులుగా నుండును. పువ్వుల కాడలు క్రిందకు వ్రేలాడును. వాటి మీద గోధుమ రంగు నూగుండును. 2.5 – 5. సెం. మీ. పొడవైన కాయలు కండతో ఆకు పచ్చగా నుండును. గోధుమ రంగు గల గింజలు 1 – 4 వరకు 2.5 – 3.5 సెం. మీ. పొడవున నిగ నిగ లాడుచుండును.




మధుక (*Madhuca indica*)

## విస్తరణ

1200 మీ. ఎత్తువరకు మన దేశములో కొండల పైన ఈ చెట్లు పెరుగును. హిమాలయముల క్రింద భాగమున తరచుగా ఇది కానవచ్చును. కొన్ని ప్రదేశములలో ఇది అడవులలో ప్రధానమైన చెట్టు.

## ఔషధము దాని గుణములు

చెట్టు బెరడు, ఆకులు, పువ్వులు, విత్తనాలు మందుగా పనిచేయును. బెరడుయొక్క కషాయము వలన దురదలు శమించును. పంటి చిగుళ్ల నుంచి నెత్తురు కారుట, రేగిన పుళ్లు, కషాయము పూత వలన శమించ గలవు. దీనిని లోపలకు సేవించినచో మధు మేహమునకు పనిచేయును.

ఆకులు విరేచనములను కట్టించును. వీటి మసిచేసిన పొడి వెన్నలో కలిపి పైన పూసినచో కాలిన పుండ్లు, మచ్చలు, బొబ్బలు తగ్గును. దీని పువ్వులు మేహశాంతి నిచ్చి బలము చేకూర్చుటయే గాక దగ్గును బ్రోంకైటిస్‌ను తగ్గించును. పువ్వుల నుండి తీసిన సారాయి బలవర్ధన కరమైనది. బాక్టీరియములను హరించు గుణము పువ్వులకున్నది. గింజలు పాలను తయారుచేయుటే గాక స్రవింపజేయును. గింజలనూనె చర్మ వ్యాధులకును, విరేచనకారిగాను పనిచేయును.

## ఇతర వినియోగములు

మాహువా పువ్వులు పచ్చివి, వండినవి ఆహారంగా తీసుకొంటారు. వాటిని ఎక్కువగా ఉపయోగించినచో దుర్గుణములు పుట్టును. సారాయిని తీయుటకు ఈ పువ్వులను వినియోగింతురు. అంతేగాక వైన్‌గార్ పానీయములు, జామ్స్ మొదలైనవి తయారుచేయుట కుపయోపడును. మాహువా నూనె సబ్బులు చేయుటకును వంటకములకును వినియోగపడును. మాహువ తెలకపిండి పశువుల కాహారముగను, ఎరువుగా నుపయోగించ వచ్చును. ఈ చెట్టు కర్ర వివిధ రకముల పనిముట్ల కుపయోగించును.

## సన్నిహితపు మొక్కలు

దీనికి బహు సన్నిహితమైనది మధుక లాంగిఫోలియ. (బాసియ

లాంగిఫోలియ) ఇది దక్షిణ దేశమందు విరివిగా పెరిగి అచ్చట మధుక ఇండిక అని పిలువబడును. మొక్క యొక్క అన్ని భాగములకు గుణములు సమానముగా నున్నవి. ఈ రెండు మొక్కల ఔషధములు సమముగా నున్నవని భారతీయ ఫార్మకొపీకల్ కోడెక్స్ గుర్తించుచున్నది.

## 46. కుంకుమ

MALLOTUS PHILIPPENSIS Mull-Arg - కామేలా

కుటుంబము : యూఫోర్బియేసి

భారతీయ పేర్లు : హిందీ - కామేలా, సిందూర్, రోహిణి
అస్సామీ - గాంగై
బెంగాలీ - కమల, రైట్
గుజరాతీ - కపిల
కన్నడ - కేసరై, రొనాటి
మళయాళం - కపిల
మరాఠీ - షెంద్రి
ఒరియా - కమలగుండి
సంస్కృతం - సిందురి, కామెల
తమిళం - కోపిలకొడి
బీహార్ - సింగ్‌భుమ్, గసర్ప
తిన్నెవలీ - కాలుపట్టి

మన దేశపు ప్రాంతీయ నామము వర్తకములోనికి వచ్చినది.

### వర్ణన

నిత్యము పచ్చగా నుండెడి మధ్యరకం గాని చెట్టు. కొన్నిచోట్ల ఒత్తుగా కొమ్మలువేసిన చెట్లపొద. లేత కొమ్మలకు ఎర్రని నూగుండును. ఆకుల

వృంతములు పొడుగై ఒక్కొక్కటిగా కొమ్మమీద నుండును. ఆకుల ఆకారము రకరకాలుగా మారును. 7-20 సెం. మీ. పొడవు వుండును. వాటి క్రింది భాగమున ఎఱ్ఱని గ్రంధులుండును. ఈనెలు స్ఫుటముగా నుండును. చిన్న చిన్న ఆడ మగ పువ్వులు వేరు వేరు మొక్కల మీద మొలచును. 5 – 8 సెం. మీ. పొడవైన కాడల కంటె ఆడపువ్వు లుండును. 8 – 15 అంగుళముల పొడవై క్రిందకు వ్రేలాడు కొమ్మలకు పసుపు రంగు గల మగపువ్వు లుండును. 8 – 11 మి. మీ. వ్యాసము కలిగి మూడు పలకలుగా కాయలుండును. వాటిమీద ఎఱ్ఱని గోధుమ రంగు గల పొడు ముండును. సూక్ష్మమైన రోమములు కూడ ఉండును. ఇవి సులభముగా తుడిచివేయ దగినవి.

## విస్తరణ

మకర కర్కటక రేఖల మధ్య హిందూదేశమంతటా, 1500 మీటర్లు ఎత్తుగల దక్షిణ భాగంలో కేరళ దేశమంతటా ఉండును.

## ఔషధము దాని గుణములు

కాయలపై నుండి తుడిచి వేయబడిన ఎఱ్ఱని నూగు పదార్థమే ఔషధము.

కామెల బద్దె పురుగులను హరించుట కుపయోగపడును. దీని చూర్ణమును పాలతో గాని పెరుగుతో గాని త్రాగుదురు. ఒక మోతాదుతో పురుగులు బయట పడనిచో రెండు మూడు మోతాదులు వాడుదురు. కొన్ని సందర్భము లలో ఆముదము ఒక మోతాదు తీసికొనినచో చచ్చిన పురుగులు బయటికి పోవును. కామెలలో విరేచనకారిత్వమున్నది. దీనిని పై పూతగ వాడినచో తామర గజ్జి మొదలైనవి నివారించును. కాయల మీద నూగును జంతువుల మీద గర్భ నిరోధక మందుగా పరీక్షించుచున్నారు. ఆడ ఎలుకలకును, గినీ పిగ్స్‌కును, గర్భ ధారణ శక్తిని తగ్గించును.

## ఇతర వినియోగములు

బట్టలకు వేయు కామెల అను రంగును ఈ చెట్టు నుండి తీయుదురు. గింజల నూనె కఱ్ఱ సామానులపై పూతగ నుపయోగపడును. సులువుగా

ఆరిపోవు గుణముండుట చేత ఈ నూనె బొమ్మలకు రంగుగా నుపయోగింతురు.

దీని కర్రను గృహోపకరణములలో చిన్నచిన్న వస్తువులు చేయుటకును వంట చెరుకుగాను అగ్గి పెట్టెలు తయారుచేయుటకు నుపయోగింతురు. దీని ఆకులను పశువులు మేయును. తెలకపిండి ఎరువుగా పర్తించును. బెరడు యందు బంక ఉండుటచేత ఇది చర్మ పరిశుద్ధి కుపయోగపడుచున్నది. ప్రాంతీయ భాషలో కామెల చూర్ణము స్త్రీలు బొట్టున కుపయోగింతురు.

## 47. పొదీనా

MENTHA species - మింట్

కుటుంబం : లేబియేటి

భారతీయ పేర్లు: చాలవరకు భారత ప్రాంతీయ నామములు. మెంతా స్పీషిస్‌కు పొదీనా అను పేరు మీద ఆధారపడినవి. మెంతా తరగతికి చెందిన మొక్కలన్నియు పరిమళ మిచ్చును. చాల సన్నిహితపు మొక్కలు కలువు మొక్కలవలె పెరుగును. కొన్నిటిని సాగు చేయుదురు. మెంతాల్, దీని విలువ పెప్పెరమెంటు నూనెవంటి ముఖ్యమైన పదార్థములలో వున్నది.

మెంతా అర్వేన్‌సిస్ (ఆంగ్లం ఫీల్డ్ మింట్, కార్న్ మింట్ , భారతీయం - పొదీనా)

అనునది నిలువుగా 60 సెం. మీ. ఎత్తువరకు శాఖోపశాఖలుగా పెరిగెడి మృదువైన మొక్క. 5 సెం. మీ. పొడవైన ఆకులు వృంత రహితములై యుండును. అంచులకు పళ్ళుండును. గ్రీవములలో నీలము ఉదా రంగు ఛాయలు గలిగిన చిన్న పూగుత్తు లుండును. కాశ్మీరునందు 1500 - 3000 మీటర్ల యెత్తు వరకు ఈ మొక్క లభించును. దీనిని సాగుచేయుట కూడ కలదు. ఆకుల రసమును కీళ్ళ వాతపు నొప్పులకు అజీర్తులకు వాడుదురు.

జపాన్‌లో పెరిగెడి మెంతా ఆర్వెన్సిస్ రకమును (సబ్ స్పీషీస్ ఏప్లో కేలిక్స్ Variety పైపెరాసెన్స్) జమ్ము కాశ్మీరు లందు సాగు చేయ బడుచున్నది. దీనినుండి నూనె తీయుదురు. దానికి జపానిస్ మింటాయిల్ లేక జపానిస్ పెప్పర్‌మెంటు ఆయిల్ అని వర్తక నామము. దీనిని మెంతా పైపెరిటా నుండి తీసిన అసలు పెప్పర్‌మెంట్ ఆయిల్‌కు బదు లుప యోగించుచున్నారు.

మెంతా లాంగిఫోలియా(Syn మెంతా సిల్వె్స్ట్రిస్ ఆంగ్లం – హార్స్‌మింట్, హిందీ – జాంగ్లీ పొదీనా, పంజాబీ – కోషు) ఇది పంజాబులో ఉత్తరమునను, కాశ్మీరునందు ఉత్తర ప్రదేశమునందును పెరిగెడి పెద్ద పొద.

ఈ మొక్క అజీర్తి రోగములు జ్వరముల కుపయోగపడును. ఉద్రిక్తతను తగ్గించగలదు. పుండ్లవల్ల విషజ్వరములు రాకుండా నిరోధించును.

## సరియైన పెప్పర్‌మింట్స్

వీటి సముదాయములో ప్రాముఖ్యత కల్గిన మొక్క మెంత పైపేరిటా లాటిన్ (ఆంగ్లం – పెప్పర్‌మింట్, పంజాబీ – విల్లాయత్ పొదీనా.) ఈ మొక్కను మన దేశములో కాశ్మీరు, ఉత్తర ప్రదేశ్, మైసూర్, తమిళనాడు మొదలైన అనేక ప్రదేశములలో సాగు చేయుచున్నారు.

ఎండించిన ఆకులు పూకొమ్మల కొనలనుండి పెప్పర్‌మింట్ ఔషధము తయారగును. ఇది కడుపుబ్బరములకు, వాంతులకు, నీళ్ళ విరేచనము లకు, వికారములను నివారణ చేయుట కుపయోగపడును. నూరిన ఆకులు తలనొప్పికి పట్టు వేయుదురు. మెంతాల్ అను వస్తువున్న పెప్పర్‌మింట్ నూనెను తీయుటయే దీని ముఖ్యమైన వినియోగము. మెంతాల్ వలన కడుపులోని దుర్గుణములు శమించును. పై పూత వలన తలనొప్పులు కీళ్ళ వాతపు నొప్పులు యితర నొప్పులు శమించును. దగ్గుల మందులు ముక్కులో వేసే బిందువులు నోటిలో పుక్కిలించు ద్రవములు దీనినుండి తయారు చేయవచ్చును. ఈ నూనె పుండ్ల వలన విషజ్వరములు రాకుండా నివా రించును.

పెప్పర్‌మింట్ నూనె, మెంతాల్ ఇరువై లక్షల రూపాయల ఖరీదు గలవి సాలీనా మనకు దిగుమతి యగుచున్నవి. దీనియొక్క సాగు, విస్తరణలు ఉద్ఘాటింపబడినవి.



**Plate V—డిజిటేలిస్** (*Digitalis purpurea*) (62 వ పుట చూడుడు)



**Plate VI**—ఇండియన్ జెన్‌షియన్ (*Gentiana kurroo*)

(83 వ పుట చూడుడు)



**Plate VII—** కురుచి (*Holarrhena antidysenterica*)

(౮౪ వ పుట చూడుడు)



**Plate VIII**—ఇండియన్ పోడోఫిల్లమ్ (*Podophyllum hexandrum*)

(130 వ పుట చూడుడు)

## 48. జటామాంసీ

NARDOSTACHYS JATAMANSI - జటామాంసీ *(Spikenard)*

**కుటుంబము :** వేలీరియనేసి

**భారతీయ పేర్లు :** హిందీ - జటామాంసీ, భూత్ కేష్
బెంగాలీ, గుజరాతీ - జటామాన్సి
కాశ్మీరీ - భుటిజట్
సంస్కృతం, తమిళం - జటామాంసీ

దీని దుంపలు గడ్డమువలె నుండుటచేత భారత్ లో జటామాంసి యను పేరుపొంది, అదే వర్తకములో వ్యాప్తమైనది.

### వర్ణన

60 సెంటీమీటర్ల ఎత్తువరకు పెరిగెడి బహు వార్షిక పొద. దీని దుంపలు కర్రవలె గట్టిగా పొడవుగా నుండును. ఒడిలిపోయిన ఆకు వృంతములనుండి పీచు వ్రేలాడుచు కొమ్మల నావరించును. క్రింద ఆకులు 20 సెంటీమీటర్ల పొడవుండి, వృంతము వైపుకు సన్నగిలిపోవును. పై నుండు పత్రములు అరకుచుక్క ఆకారములో చిన్నవిగా యుండును. చిన్న గుత్తులలో చిన్న పువ్వులుండును. చిన్న చిన్న కాయలు రోమముల చేత నావరింపబడియుండును.

### విస్తరణ

భూటానుకు తూర్పున 3000 లగాయతు 4500 మీటర్ల ఎత్తున ఆల్పైన్ హిమాలయములయందు పెరుగును.

### ఔషధము దాని గుణములు

ఎండించిన దుంపలు, వ్రేళ్లు మందుగా పనికివచ్చును. జటామాంసి బల వర్ధనకరము, ఉద్రేకములను శమింపజేసి, ఉద్దీపనము కలిగించగలదు.

అందువలన నిది కొన్ని అపస్మారములకు, శరీరము బిగిసిపోవు వ్యాధులకు, గుండెదడకు యుపయోగపడుచున్నది. అంతేగాక మల మూత్రములను జారీ చేయును, స్త్రీల ఋతువును సరిచేయును, అజీర్తిని పోగొట్టును.

వెలిరియన్ (*Valeriana officinalis*) అను మందుకు బదులుగా నిది వినియోగపడుచున్నది.

మనకు కావలసిన మందు మొత్తం 20 క్వింటాల్సు. హిమాలయములలో నెత్తైన ప్రదేశములు దీని సాగు కనుకూలముగా యున్నవి.

## 49. తులసి

OCIMUM SANCTUM L. - (*Sacred Basil, Holy Basil*)

కుటుంబము : లేబియేటే

భారతీయ పేర్లు : హిందీ - తుల్సి
బెంగాలీ, గుజరాతీ - తులసి
కన్నడ - విష్ణుతులసి
మళయాళం - త్రితావు
మరాఠీ - తులసి
సంస్కృతం - మంజరి, కృష్ణతులసి
తమిళం - తులసి

### వర్ణన

ఇది భారతదేశంలో ప్రఖ్యాతి వహించిన పవిత్ర భూజము. అంతటా రోమములతో 75 సెంటీమీటర్ల ఎత్తు వరకు ఒత్తుగా శాఖలు పెంచు మొక్క. 5 సెంటీమీటర్ల పొడవైన ఆకులు అభిముఖముగా రెండేసి కణుపు వద్ద యుండును. అంచు సరాసరిగా గాని, పళ్లు గలదిగా గాని యుండును. సూక్ష్మమైన గ్రంథులతో ఆకులకు పైన, క్రింద రోమము లుండును. చిన్న పువ్వు, గుంపులలో సుకుమారమైన కాడవంటి యెరుపు

రంగులో యుండును. కాయలు చిన్నవి. గింజలు పసుపుగా గాని, ఎర్రగా గాని కన్పించును.

## విస్తరణ

మనదేశ మంతటా యీ మొక్కను యిండ్లలోను తోటలలోను పెంచుదురు. ముఖ్యముగా దేవాలయములలోను, బైట బయలు ప్రదేశములలోను మొలచును.

## ఔషధము దాని గుణములు

దీని ఆకులు, గింజలు మందుగా పనిచేయును. ఆకుల నూనె బాక్టీరియములను కీటకములను సంహరించును. ఆకుల కషాయము గాని రసము గాని బ్రోంకైటిస్ దగ్గుకు, శ్లేష్మ సంబంధమైన దగ్గులకు, అజీర్తి రోగముల కుపయోగపడును.

తామరకు ఇతర చర్మ వ్యాధులకు పైన పూయుదురు. ఆకుల రసము చెవులో పిండినచో చెవిపోటు శమించును. ఆకుల కషాయము హిందూ గృహములలో రొంపలకు వాడుదురు. మూత్రకుచ్ఛ్ర రోగములకు గింజ లుపయోగించవచ్చును. దీని వ్రేళ్ళ కషాయము మలేరియా జ్వరముగల వారి కిచ్చిన చెమటలు పట్టును.

## ఇతర వినియోగములు

హిందూ మతములో దేవతల పూజకు ఇది ముఖ్యమైనది.

## సన్నిహితపు మొక్కలు

ఆసిమమ్ కేనమ్ సిమ్స్. (ఆంగ్లం - హోరి బాసిల్, హిందీ - కాలీ తులసి, రామ తుల్సి, బార్భరీ) అనునది మనదేశ మంతటా ప్రజల నివాసము లందును సాగుచేయు భూములలోను బంజరు భూములలోను దొరకును. దీని గింజలు నల్లనివి. ఇవి మూత్రము జారీ చేయుటకును బలము నిచ్చుటకు నుపయోగపడును. దీని ఆకుల నూనె తులసి నూనెవలెనే వాడవచ్చును.

ఆసిమమ్ బాసిలికం. (ఆంగ్లం - స్వీట్ బాసిల్, హిందీ - బొబ్బాయి

తుల్సి, సబ్జ, సంస్కృతం - మంజరికి, తమిళం - కర్పూర తులసి) ఇది పశ్చిమోత్తర భారతదేశంలో సామాన్యంగా దొరకును. ఇతర ప్రదేశము లలో సాగు చేయుదురు. జ్వరములకు దగ్గుకు క్రిమిసంహారములకు ఉదరములోని బాధలకు గొంతు రోగమునకు దీనిని వాడవచ్చును. ఆకుల రసమును ముక్కులలో పిండుదురు. చర్మ వ్యాధులకు పైన పట్టు వేయుదురు. గింజలు లోనికి తీసికొన్నచో మలబద్ధము మూలశంక నివారించును.

ఆసిమమ్ ఖిల్‌మండ్ దారికం అనునది తూర్పు ఆఫ్రికాలోనిది. ఇటీవల కర్పూరము దీనినుండి తీయుటచేత ఇది ఎక్కువ ప్రాముఖ్యత వహించినది. దీనిని కాశ్మీర్, ఉత్తర ప్రదేశ్, పశ్చిమ బెంగాలు, మహారాష్ట్ర, మైసూరు, తమిళనాడు, కేరళ పరగణాలలో సాగు చేయుదురు. సుమారు 1000 మీటర్ల యెత్తుగల ప్రదేశములు దీని సాగుకు వీలుగా నుండును. ఉత్తర ప్రదేశ్‌లో టెరై ప్రాంతము కూడ వీలుగా నుండును. కర్పూరము అనేక మందులలో వాడుదురు. ముఖ్యముగా కంఠరముల వాపులకు నొప్పులకు పైన పూతపూయు మందులలో నిది కలుపుదురు. (సినమోమ కెంఫోరాను చూడుడు). కర్పూరమును అనేక ఇతర ఉపయోగములకు వాడుదురు. సాలీనా మనకు నాలుగు లక్షల క్వింటాల్స్ కర్పూరము కావలసి యున్నది. కొంత భాగము మన దేశములో నుత్పత్తి అవుచున్నది. మరి కొంత దిగుమతి చేసుకొనుచున్నాము.



**Plate 16**
పెర్గులేరియా
(*Pergularia daemia*)
(121 వ పుట చూడుడు)



**Plate 17**
జటామాంసి
(*Nardostachys jatamansi*)
(113 వ పుట చూడుడు)



**Plate 18**
హార్మల్
(*Peganum harmala*)
(113 వ పుట చూడుడు)



**Plate 19**
పిక్రోర్హైజా
(*Picrorhiza kurroa*)
(122 వ పుట చూడుడు)

# 50. తెల్ల తెగడ

## టర్పెత్ (*Indian Jalap*)

OPERCULINA TURPETHUM (L.) Silva Manso

**కుటుంబము :** కన్వాల్వు లేసి

**భారతీయ పేర్లు :**

| | |
|---|---|
| హిందీ | – నిసోత్, పితోరి |
| బెంగాలీ | – దుడియా కాల్మి |
| గుజరాతీ | – నషోత్తర్ |
| కన్నడ | – బిళియతిగడ్డి గడ్డి |
| మరాఠీ | – నిషోత్తర |
| పంజాబీ | – నిసోట్ |
| సంస్కృతం | – కాలపర్ని, త్రివుటి |
| తమిళం | – శివదై |

శాస్త్రీయ నామము వర్తక నామమైనది.

### వర్ణన

తెల్లని పాలుతో నుండెడి పెద్ద తిరుగుడు తీగె. వేళ్ళు పొడవై, శాఖోప శాఖలుగా నుండి కండతో నుండును. కొమ్మలకు రెక్కలుండును. ఆకులు 4 – 10 సెం. మీ. పొడవు $1\frac{1}{2}$ – 7 సెం. మీ. వెడల్పు. అరకుచుక్కగా గాని, హృదయాకారముగా గాని నుండును. 4–5 సెం. మీ. పొడవైన గొట్టము ఆకారము కలిగిన చిన్న గుత్తులలో నుండును. ఆకర్షణ పత్రములు రెండు సెం. మీ. పొడవు. కాయలలో నున్నపుడు అవి బాగా విస్తరించి పెళుసుగా కాయల నావరించును.

### విస్తరణ

1000 మీ॥ ఎత్తు వరకూ మనదేశ మంతటా పెరుగును. అందమైన పూవుల కోసం దీనిని తోటలలో పెంచుదురు.




టర్పెత్ (*Operculina turpethum*)

## ఔషధము దాని గుణములు

ఎండించిన (వేళ్లు ఔషధముగా పనిచేయును. ఈ (వేళ్ళను తెల్ల తరగతి మొక్కనుంచే తీయవలసినది. అలా తీయునపుడు వాటి బెరడును పోగొట్టకూడదు. ఈ మందులో టర్పెంటిన్ ఉన్నది. ఈ టర్పంత్‌లోని గుణములు నిజమైన యక్స్‌గోనియంపగ్రా నుండి తీయబడిన జలాపు గుణములకు సమానము. దాని స్థానే దీనిని వాడవచ్చును. (వేళ్ళ చూర్ణము విరేచనకారి. కొమ్మలు, చిరుకొమ్మలు, (వేళ్ళు కలిసిన మొత్తముగా టర్పెత్ సామాన్యంగా బజారులలో లభిస్తుంది.

# 51. సీమగోరింట

PEGANUM HARMALA L. - హర్మల్

**కుటుంబము :** రూటేసి

**భారతీయ పేర్లు :**

| | |
|---|---|
| హిందీ | - గంధ్య, హర్మల్ |
| బెంగాలీ | - ఇస్‌బంద్ |
| గుజరాతీ | - హర్‌మర్ |
| పంజాబీ : మళయాళం | - హార్మల్ |
| తమిళం | - సిమైయరవాండి |
| ఆంగ్లం | - వైల్డ్ రూ |

భారతీయ (ప్రాంతీయ నామముల మీదనే వర్తక నామ మాధారపడినది.

## వర్ణన

30 - 90 సెం. మీ. ఎత్తువరకు పెరిగెడి పొద. 5 - 8 సెం. మీ. పొడవైన ఆకులు సన్నని అనేక చీలికలు కలిగియుండును. 2 - 3 సెం. మీ. వ్యాసము గల తెల్లని పూలు (గీవములలో ఒక్కొక్కటిగా నుండును. కాయలు విచ్చెడివి. గుండ్రముగా 5.8 మి. మీ. వ్యాసము గలవి. లోతుగా

గుబ్బలు కలిగియుండును. 2½ – 4 మి. మీ. పొడవైన గింజలు గోధుమ రంగులో నుండును. వలవంటి కవచములో గింజలు అనేక రకములలో నుండును.

## విస్తరణ

దక్షిణమున ఉష్ణ ప్రదేశములలోను పశ్చిమ తూర్పు ప్రదేశములలోను మన దేశమంతటా వ్యాప్తిలోనున్నది.

## ఔషధము దాని గుణములు

హర్మల్ మందు ఎండించిన విత్తనములే. విత్తనములలో చాల రకముల అల్కలోయిడ్స్ వున్నాయి. ఉబ్బసమునకు, హిస్టీరియా, కీళ్ళ వాతములకు, గాల్‌స్టోన్స్‌కు, నులి నొప్పులకు, జ్వరములకు, కామెర్లకు, కడుపు నొప్పులకు ఇవి ఉపయోగపడును. మత్తు మందుగాను, పురుగులను హరించు మందుగాను, వాంతులను పుట్టించుటకు వాడుదురు.

హర్మలైయాజీన్, హార్మైన్ అను అల్కలాయిడ్స్ ఈ మందునుండి తీయవచ్చును. ఇవన్నియు మనస్సు మీద, మేధ మీద పనిచేయును. తేలిక రకము ఉన్మాదములను నివారించును. కదిలెడు మెదడు నరములకు కేంద్ర నరముల సంస్థకు ఉద్దీపనము కలిగించును. హెచ్చు మోతాదులలో నరముల సంస్థను బలహీన పరచును.

ప్రయోగముల ద్వారా ఈ మందు బాక్టీరియములను నిది హరింపగలదని స్థిరపడినది. ఆసుపత్రులయందు మలేరియా జ్వరము కంత ఉపయోగకారిగా లేనట్లు పరీక్షలవలన తెలియుచున్నది.

## ఇతర వినియోగములు

గింజల నుండి ఎఱ్ఱని రంగు తీయుదురు. ఆవనూనెలో దీని వ్రేళ్ళ చూర్ణము కలిపి తలకు పూసినచో పేలు హరించును. ఈ మొక్క నొక గదిలో పెట్టినచో అచ్చటకు దోమలు రావు.

# 52. దుష్టపటీజి

**PERGULARIA DAEMIA** (Forsk) Chiov – పెర్గులేరియా
syn. *P. extensa* N. E. Br., *Daemia extensa* R Br.

కుటుంబము : యెస్క్లిపియడేసి

| భారతీయ పేర్లు : | | |
|---|---|---|
| | హిందీ | – ఉతరన్, ఉటర్నే, సదోవనీ |
| | బెంగాలీ | – చాగుల్ బడి |
| | గుజరాతీ | – చామర్ డుడి, నాగలాడుడ్కి |
| | మరాఠీ | – ఉట్రాన్ |
| | పంజాబీ | – కరియాల్ |
| | సంస్కృతం | – యుగఫల |
| | తమిళం | – ఉత్తమని |
| | (మధ్యప్రదేశ్ | – గోల్ లకడి, కడ్వాడోడ్) |

## వర్ణన

తెల్లపాలతో కూడిన రోమములు కలిగి, కొమ్మలతో పెరిగెడి తిరుగుడు తీగె. ఆరకు చుక్కగాగాని గుండ్రముగా గాని రోమ సహితములై 4 - 6 సెం. మీ. పొడవున ఆకులుండును. ఆకు క్రింద భాగమున హృదయాకార ముగ ఒంగును. పువ్వులు తెల్లగా గాని, బూడిదరంగుగా గాని చిన్నవిగా యుండి పొట్టి గుత్తులలో వ్రేలాడుచుండును. కాయలు రెండేసి అభిముఖ ముగా యుండి 5 - 8 సెం. మీ. పొడవు 1. 3 సెం. మీ. వెడల్పు గలవిగా నుండును. సన్నని ముళ్ళు వాటిపైన నావరించియుండును.

## విస్తరణ

వెయ్యి మీటర్ల యెత్తువరకు మనదేశమంతటా ఇది పెరుగును.

## ఔషధము దాని గుణములు

మొక్క సమూలముగా మందులకు పనికివచ్చును. చంటి పిల్లలకు వచ్చు

నీళ్ళ విరేచనములకు రొంపలకు దీని యాకుల రసము నిచ్చెదరు. కీళ్ళ వాతపు నొప్పులకు, స్త్రీలలో ఋతుక్రమము జరగని రోగములకు విరేచనముల మందులో దీనిని కలిపి వాడుదురు. లోపలకు తాగినచో శ్లేష్మము నావలకు నెట్టుటయే గాక వాంతులను కూడ కలుగజేయును. ప్రయోగమువలన బిడ్డ సంచికి బలము చేకూర్చ గలదనుట స్థిరపడినది. ఇది ప్రసవించినపుడు అమిత స్రావమును అరికట్టగలదు. పెర్గులేరియాలో నున్న ముఖ్యపదార్థము పిట్యూట్రిన్ అనువాని గుణములతో పోలియున్నది.

## 53. కటుకురోని

PICRORHIZA KURROA Royle ex Benth. - పిక్రొరైజా

కుటుంబము : స్క్రోఫ్యులేరియేసి

| భారతీయ పేర్లు : | | |
|---|---|---|
| | హిందీ | – కట్కి, కురు |
| | బెంగాలీ | – కటకి |
| | గుజరాతీ | – కడు |
| | కాశ్మీరీ | – కరు |
| | మళయాళం | – కటుక్రుబాని |
| | మరాఠీ | – కటుకి |
| | పంజాబీ | – కలికుట్కి |
| | సంస్కృతం | – కటుక |
| | తమిళం | – కటుకురోగని |

వర్తక నామము శాస్త్రీయ నామముపై నాధారపడినది.

### వర్ణన

5–10 సెం. మీ. పొడవుగల చంచా ఆకారపు ఆకులు గల చిన్న మొక్క. దుంపలు 15–25 సెం. మీ. పొడవున కర్రవలె గట్టిగానుండును. గుండ్రని కాడలమీద చిన్న చిన్న పూలు మొలచును. నిలువుగా

పెరిగెడి కొమ్మలకు ఆకులు లేని చోట ఈ పూకాడలుండును. పువ్వులు రెండు రకములు. ఒక రకమునకు 8 మి. మీ పొడవైన కింజల్క కాడ లుండును. రెండవ రకముకు కింజల్క కాడల పొడుగు 2 సెం. మీ. మాత్రమే. కాయలు 1.3 సెం. మీ. పొడవు.

## విస్తరణ

3,000-4,000 మీటర్ల ఎత్తున మాత్రమే హిమాలయములలో కాశ్మీరు నుండి సిక్కిం వరకుండును.

## ఔషధము దాని గుణములు

ఎండించిన దుంపలు మందుగా పనిచేయును. ఇది చేదుగావుండి బల వర్ధనకరమైనది. సమానకాలములలో వచ్చు వ్యాధులను నిరోధించుటే గాక పైత్యరస స్రావమును పెంపొందించును. జన్షియన్ కున్న గుణములు దీనికి గలవని నమ్ముచున్నారు. దానికున్న గుణములేవనగా ఆకలిని పుట్టించుట, జీర్ణరసస్రావములను పెంపొందించుట. దీనిని ఉబ్బు కాయి లాలకు కూడ వాడవచ్చును. దీని క్రిమి సంహారకత్వమును పరీక్షలవల్ల నిర్ధారణ కాబడినది. సాలీనా మనకు 40 క్వింటాల్స్ మందు అవసరమగు చున్నది. 3,000-4,000 మీ॥ యెత్తున హిమాలయ ప్రదేశములు దీని సాగుకు వీలుగా యున్నవి. దీని ప్రాముఖ్యము జన్షియన్ మందు (జన్షి యానా లూటియానా) స్థానే ఉపయోగపడుటయే.

## 54. దేవదారు

PINUS ROXBURGHII Sargent syn. *P. longifolia* Roxb - పైన్ *(Chil)*

కుటుంబము : కోనిఫెరే

భారతీయ పేర్లు : హిందీ – చీడ్
అస్సామీ – డెల్గియా
బెంగాలీ – సరలగాచ్
పంజాబీ – చిల్
తమిళం – సీమై దేవదారి

'భారతీయ వృక్షశాస్త్ర పిత' అని బిరుదు వహించిన ప్రఖ్యాత వృక్ష శాస్త్రవేత్త "రాక్స్‌బర్గ్" పేరును గౌరవించుటకు దీని స్పెసిఫిక్ నామము 'రాక్స్‌బర్ఘి' అని పెట్టినారు.

### వర్ణన

సూదులవంటి యాకులు గల మహావృక్షము. 25–30 సెంటీమీటర్ల పొడవైనవి. సూదేసి ఆకులొక గుంపుగా నుండును. త్రిభుజాకారమున నుండు మగ పుష్ప సమితి గెలలు చిన్నవి. కాయలనిచ్చు ఆడ పుష్ప సమితులు 10-20 సెంటీమీటర్ల పొడవున, త్రిభుజములుగా నుండును.

### విస్తరణ

హిమవత్పర్వతములలో క్రిందిభాగమునను, ఉదకమండల నీలగిరుల యందును విరివిగా పెరుగును. అందమునకు పెంచెడి వృక్షము.

### ఔషధము దాని గుణములు

పైనస్ రాక్స్‌బర్ఘి నుండియు, యితర సన్నిహితపు చెట్ల నుండియు, 'టర్పెంటైన్' అను తైలము తీయబడును. 'ఓలియోరెసిన్' అను పదార్థ మీ తైలమందున్నది.

ఈ తైలము పైన పూసినచో, అక్కడ చురుకు, చురుకు సూది గుచ్చినట్లు



**Plate 20**—ఇషాబ్‌గుల్ (***Plantago ovata***) (128 వ పుట చూడుము)



**Plate 21**

ర్హుబార్బ్

(*Rheum emodi*)

(137 వ పుట చూడుడు)



**Plate 22**

సౌసూరియా

(*Saussurea lappa*)

(144 వ పుట చూడుడు)

పోటు వచ్చును. ఈ గుణము ననుసరించియే దీనిని అనేక యౌషధములకు వినియోగించుచున్నారు. దీర్ఘరోగముగా నున్న 'బ్రోంకైటిస్' కుపయోగ పడుటయే గాక, లోపల కిచ్చినచో శ్లేష్మమును, కళ్లి ద్వారా బయటకు నెట్టి వేయును. కడుపుబ్బరపు నులి నొప్పులు నివారించును. పంటి చిగురుల నుండియు, ముక్కు నుండియు రక్తము పడుట కట్టించుటే గాక, సన్నిపాత జ్వరముకు కొద్దిగా యుపయోగపడును. అసనము ద్వారా లోనికి పంపినచో మలబద్ధమును నిర్మూలించును. కీళ్ల వాతపు నొప్పులకు యీ నూనెలో గుడ్డలు తడిపి పైన కట్టుదురు. దీని నుండి వచ్చు ఆవిరి పీల్చినచో 'బ్రోంకైటిస్' దగ్గు గల రోగులకు మంచి గుణమిచ్చును.

## ఇతర వినియోగములు

దీని కర్ర అనేక యుపయోగములకు వాడుదురు. ఇంటి దూలములు మొదలైన వాటికి, కుర్చీలు, బెంచీలు చేయుటకు, టీ నింపు పెట్టెలు తయారుకు, అగ్గి పుల్లలు తయారుకు ఆట వస్తువులు, క్రికెట్ బేట్సు, టెన్నిస్ బేట్సు తయారీకి సంగీతపు పరికరములు తయారీకి యింకా అనేక వస్తువులు తయారుచేయుట కుపయోగపడుచున్నది.

ఇందుండు 'రెజిన్' బిరోజా అనునది గాజులు చేయుట కుపయోగపడు చున్నది. చెట్టు బెరడులో జిగురు కలదు. అందొక విధమైన రంగు గూడ యున్నది.

# 55. పిప్పళ్లు

PIPER LONGUM. L.- లాంగ్ పెప్పర్

కుటుంబము : పైపెరేసి

| | | |
|---|---|---|
| భారతీయ పేర్లు : | హిందీ | – పిప్లిమల్ |
| | అస్సామ్ | – పిప్లు |
| | బెంగాలీ | – జాత్యా, పిపుల్ |
| | గుజరాతీ | – పిప్లి |
| | సంస్కృతం | – పిప్పలి, మాగధి |
| | తమిళం | – పిప్పిలి |

(జల్ పై గురి – రిషాప్ప)

సామాన్యమైన ఆంగ్లంలోని పెప్పర్ నామమే వర్తక నామము. దీనిని లాంగ్ పెప్పర్ అనుటకు కారణము దీని పూకాడలు పొడుగుగా నుండుటయే. ఈ కారణముగా గుండ్రని కాయలు గల పెప్పర్ నైగ్రమ్‌ను వేరుగా గుర్తించవచ్చును. ప్రాచీన గ్రంథములలో మగధ దేశము నుండి వచ్చినది కావున పొడుగు పెప్పరును మాగధి అని వాడుక చేసెడివారు.

## వర్ణన

నేలమీద ప్రాకుతూ అప్పుడపుడూ పైకి ఎగబ్రాకే పరిమళమైన చిన్న మొక్క. క్రింది ఆకులు 6 – 10 సెం. మీ. పొడుగున అరకుచుక్కా కారములో క్రింది భాగమున పెద్ద భాగములు కలిగి హృదయాకారము కలిగిన ఆకులుండును. పై పత్రములు సరాసరిగా పొడుగుగాను హృదయాకారముగా నుండును. పై భాగము నల్లని ఆకుపచ్చరంగులో నిగ నిగలాడును. క్రింది భాగము బూడిద రంగు గలది. పత్ర పుచ్ఛములు 1.3 సెం. మీ. పొడవుండి త్వరగా రాలిపోయెడి గుణము కలవి. పువ్వుల కాడలు ఒక్కొక్కటిగా నుండును. మగ పువ్వుల కాడల పుచ్ఛములు సన్నగాను స్త్రీ పుష్పములకు గుండ్రముగ నుండును. కాయలు కోలగా చిన్నవి. ఇవి పువ్వుల కాడలతో కప్పబడియుండును. అట్టి కండ గల

పువ్వుల కాడలు 2 ½ -4 సెం. మీ. పొడవై కోలగా గాని, ముదురు ఆకుపచ్చ రంగులో నిగ నిగలాడును.

## విస్తరణ

మనదేశంలో ఉష్ణమండలముల యందు పెరుగుటేగాక సాగు చేయబడు చున్నది.

## ఔషధము దాని గుణములు

ఎండించిన కాయలను లాంగ్ పెప్పర్ అని అందురు. (పిప్పళ్ళు) ఇది బలవర్ధనకారి. ఘూటైన నశ్యములు చేయుట కుపయోగింతురు. పక్ష వాతములలోను కీళ్ళవాతపు నొప్పులకు దీని చూర్ణముతో కట్టుకట్టుదురు. దీర్ఘవ్యాధిగా నున్న బ్రోంకైటిస్ దగ్గుకు పచ్చికాయలను ఎండించి కషాయముగా నుపయోగించును. పండిన కాయలు పరిమళముగలవై కడుపు నొప్పులను విరేచన బద్ధమును నివారింపగలవు.

ప్రయోగముల వలన దీని ఆకులు కాయలు క్రిమిసంహారములని తెలియు చున్నది.

## ఇతర సన్నిహితపు మొక్కలు

చాల ముఖ్యమైన ఈ జీనస్‌కు చెందిన స్పీషీసు పైపర్ నైగ్రమ్ లేక నల్లపెప్పర్ (మిరియాలు) (బెంగాలీ, హింది - గోల్ మిర్చి, కాలీమిర్చి, దాక్షిణీ మిర్చి; సంస్కృతం - కాఫవిరోధి, తమిళనాడు - కల్లువల్లి.) చాలవరకు ప్రాంతీయ భాషలలోని పేర్లు గోల్ - గుండ్రము, రంగు - బ్లేక్ (నల్లని) దీని కాయల ఆకారమును వర్ణించును. సంస్కృతములోని పేరు దీని ఉపయోగమును సూచించును.

విస్తరించిన అరకుచుక్కవలె గాని గుండ్రముగా గాని యున్న ఆకులతో బలంగా పెరిగి అల్లుకొనే తీగయే పైపర్ నైగ్రమ్. పువ్వులు పొడుగాటి కాడల కన్నివైపుల నుండును. చిన్న చిన్న గుండ్రని కాయలు 7 మి. మీ. వ్యాసము గలవి ముందు పసుపుగా నుండి ముదిరిన తరువాత ఎఱ్ఱగా నుండును.

ముదరకుండ కోసి యెండించిన నల్ల పెప్పర్ కాయలు (మిరియాలు) మందుగా పనిచేయును. ఇది ఉద్దీపన కలిగించును. విరేచనకారి. ఉదర

రోగములను మాన్పును. ఎక్కువ మోతాదులలో తీసికొనినచో ఉష్ణమును కలుగజేసి చెమటలు పుట్టించును. మూత్రము జారీ చేయించగలిగినప్పటికి దీనివలన మూత్రపు గొట్టము ఉద్రిక్తతను చెందును. విత్తనములను పరీక్షించగా క్రిమి సంహారకత్వమున్నట్లు తెలియుచున్నది.

మిరియాలను కూరలు పచ్చళ్లు మొదలైన అనేక తినుబండారములలో రుచికి పరిమళమునకు వేయుచుందురు. వాటిలో విరేచన కారిత్వమున్నది.

పైపర్ క్యుమిబా (క్యూబెబ్, షిటాల్చనీ, సుగంధమారిచ, కబాబ్ చిని) ఇది ఆగ్నేయేషియాలో దొరుకును. దీని కాయలనుండి వచ్చు నూనె మూత్రకుచ్ఛ రోగముల కుపయోగించును. సాలీనా మనకు ఈ వస్తువు 200 క్వింటాల్స్ కావలసియున్నది. మన దేశ తూర్పు దక్షిణ ప్రాంతాలలో దీనిని సాగు చేయుటకు వీలుగానున్నది.

## 56. చిత్రమూలం

PLANTAGO OVATA Forsk - ఇషాబ్‌గుల్

**కుటుంబము :** ప్లేంటేజినేసి

**భారతీయ పేర్లు:** ఇషాప్‌గోల లేక ఇషాప్‌గోల్ అను సంస్కృత నామమునకు వివిధ ప్రదేశములలో వారి భాషలలో కొలదిగా మార్పు జెందిన రూపాంతరములు.

ఆ మాటయే వర్తకమునందు వాడుకయైనది.

### వర్ణన

మెత్తని రోమములతో నావరింపబడు కాండరహితమైన చిన్న మొక్క. సన్నని ఆకులు 8–25 సెంటీమీటర్ల పొడవు గలవి. 1.5– 4 సెంటీ మీటర్ల పొడవైన గుండ్రముగా గాని, కోలగాగాని యున్న కాడలకంటి సూక్ష్మమైన పువ్వులుండును. కాయలు 8 మిల్లీమీటర్ల పొడవు. వాటి పై భాగం డిప్పవలె యూడిపోవును. గింజలు నావ ఆకారము గలవి.

## విస్తరణ

భారత దేశంలో వాయువ్య ప్రదేశములలో సామాన్యంగా పెఱుగును. ఇతర చోట్ల సాగు చేయుదురు.

## ఔషధము దాని గుణములు

ఇతర సన్నిహితపు మొక్కల గింజలవలె దీని గింజలు గూడ మందుగా పనిచేయును.

గింజలలోని జిగురు పదార్థము, మొక్కకై కూడపెట్టిన పదార్థముల వలన ఇవి యుపయుక్తములుగా నున్నవి.

సూక్ష్మ జీవులు, బేక్టిరియములు కారణమైన దీర్ఘ రోగములుగా నున్న జిగట, నీళ్ల విరోచనముల కుపయోగపడును. ముక్కులలోని పొరలను మెఱుగుపరచి హాయి నిచ్చుటయే గాక, మలబద్ధకము మీద గూడ పని చేయును. గింజలను ఉపయోగమునకు ముందు నానబెట్టినచో నవి త్వరగా ప్రేగులలో జీర్ణమగును. లేనిచో నవి పేగులలో అడ్డుగా నిలుచును. జిగురు పదార్థము మలమును ముద్ద కట్టునట్లు చేసి, అది బయటకు పోవుటకు సహకరించును. దీని చర్య సహజమైనదే గాని, విశేషమైనది గాదు.

ఇషాబ్‌గుల్ హస్క్ (హిందీ - ఇషాబ్‌గుల్ - కి - భుసి) అనునది ప్లాంటాగో ఓవేటా గింజల పొట్టు. ఇది గింజలను విసరి చెరుగుట వలన లభించును.

ఈ పొట్టునకు గూడ గింజల గుణములున్నవి. దీనిని లోనికి తీసు కొన్నచో ప్రేగులలో అడ్డుపడుట మొదలైన బాధ యుండదు. గింజలు తీసుకొనుటకంటె యీ పొట్టును నానబెట్టవలసిన పని లేకుండగ సులువుగా సేవించవచ్చును.

## 57. షడ్ కేసరి

ఇండియన్ పోడోఫిల్లమ్

PODOPHYLLUM HEXANDRUM Royle syn. *P. emodi.* Wallich

**కుటుంబము :** బెర్బెరిడేసి

**భారతీయ పేర్లు :** హిందీ - బన్ బేంగన్, పాపరీ
గుజరాతీ - వెనివెల్
కాశ్మీరీ - బాన్ వాగన్
మరాఠీ - పాడ్ వాల్
పంజాబీ - బంకాక్రీ, గుల్ కాక్రీ

శాస్త్రీయ నామము వర్తకములో వాడుకజెందినది.

### వర్ణన

ప్రాకెడి వేరు సంస్థతో నిలువున కండగల కొమ్మలతో పెరిగెడి మొక్క. పువ్వుల కొమ్మలు నిలువున పెరిగి చివర ఆకులు వేయును. 15–25 సెంటీ మీటర్ల వ్యాసముగల 3 నుండి 5 వరకు లోతు చీలికలు పొందిన, రెండాకు లుండును. అంచులందు పళ్లుగలిగి లేత ఎరుపు మచ్చలతో నిండి యుండును. ఒక్కటొక్కటిగా తెల్లని లేక, లేత ఊదారంగున 2.5 – 5 సెంటీమీటర్ల పొడవైన గిన్నెలవంటి పువ్వులుండును. ఎర్రని కాయలు కోలగా 2.5 – 5 సెంటీమీటర్ల పొడవు.

### విస్తరణ

3000 – 4000 మీటర్ల ఎత్తున హిమాలయములందు లోపలి పర్వత పంక్తులలో విరివిగా దొరకును. కాశ్మీరులో 1800 మీటర్ల క్రింద వరకు పెరుగును.

### ఔషధము దాని గుణములు

ఎండించిన దుంపలు ఔషధముగా వినియోగపడును. వాటియందు

'పోడోఫిల్లి' అను రెజిన్ పదార్థమున్నది. ఇది విరోచనము లగుటకు మందు. దీని గుణములు మెల్లగా ప్రారంభమై, దారుణముగా పరిణమించును. ఎక్కువ మోతాదులలో ప్రేగులలో నుద్రేకమును పుట్టించి, వాటిని మెలివేసి నొప్పిని పుట్టించును. సాధారణముగా దీనిని బెల్లడోనా లేక కలబందల మొదలైనవాటితో కలిపి రోగులకిత్తురు.

పోడోఫిల్లమ్ వలన కణుతులు, చర్మవ్యాధులు కుదురునని తెలియు చున్నది. పుట్టకురుపు వ్యాధి నివారణ చేయుటలో దీని యుపయోగమును గూర్చి ప్రయోగములు సాగుచున్నవి.

సాలీనా మనకు 40 క్వింటాలు ఈ మందు కావలసియున్నది.

పోడోఫిల్లమ్ పెల్టేటమ్ అను అమెరికాలోనుండు మొక్క కొంతప్పుడు సాగు చేయుచున్నారు.

1500 నుండి 3000 మీటర్ల ఎత్తున హిమాలయములలో కాశ్మీరు, హిమాచలప్రదేశము, పంజాబు, ఉత్తర ప్రదేశము, సిక్కిమ్ పరగణాలు దీని సాగుకు అనుకూలములు.

## 58. కాలా గిజ

PSORALFA CORYLIFOLIA L.- సొరేలియా *(Babchi)*

**కుటుంబము :** పెపిలియొనేసి

| **భారతీయ పేర్లు :** | | |
|---|---|---|
| | హిందీ | - బాబ్చి |
| | బెంగాలీ | - లతకస్తూరి |
| | గుజరాతీ | - బవాచీ |
| | మరాఠీ, పంజాబీ | - బాబ్చి |
| | సంస్కృతం | - సుగంధకంటక |
| | తమిళం | - కారుప్పుకరిషి |
| | ఉర్దూ | - బాకుచి |

సొరేలియా, బాబ్చి అను వర్తకపు పేర్లు, శాస్త్రీయ ప్రాంతీయ నామములు.

## వర్ణన

ఒత్తుగా నుండు గ్రంధులతో నిండిన కొమ్మలతో నిలువుగా సాగెడు మొక్క. పత్రములు గుండ్రముగా నుండి పైనా క్రింద నల్లని గ్రంధు లుండును. నీలి, ఊదారంగులతో 10 నుండి 30 వరకు చిన్న పువ్వులు గుత్తులుగా నుండి, గ్రీవములతో మొలచును. గుంటలతో నిండి, గుండ్ర ముగా లేక కోలగా నల్లని కాయలుండును. గింజ నున్నగా ఒకటియే.

## విస్తరణ

కొన్నిచోట్ల సాగుచేయబడి, దేశమంతటా కలుపుమొక్క వలె ఖాళీ ప్రదేశములలోను, బంజరు భూములందును పెరుగును.

## ఔషధము దాని గుణములు

దీని గింజలు మందుగా పనిచేయును. చర్మవ్యాధులను కలుగజేయు బేక్టీరియములను ఈ గింజల నూనె సంహరించును. అందువల్ల బొల్లి, కుష్ఠు రోగములకు పైన యీ నూనె పూసినను, లోనికి త్రాగించినను, నివారణ కలుగజేయును. గింజలు మూత్రమును జారీచేయించుటే గాక, పొట్టలోని క్రిములను సంహరించి విరోచనము ద్వారా బయటకు నెట్టును. పై రెండు గుణములు పరీక్షల వలన ఋజువైనవి. గింజలనుండి తీసిన ఒలియోరెజినస్ సారములు, సవాయిగాక, యితర కారణముల వలన వచ్చిన బొల్లి మచ్చల కుపయోగించును.

కుష్ఠు రోగమునకు యుపయోగింతురు గనుక దీనికి ఆయుర్వేద వైద్య ములో 'కుష్ఠునాశని' అను పేరు వచ్చినది.

దీని వ్రేళ్లు పంటి రోగములకును, ఆకులు నీళ్ల విరోచనములకును వాడుదురు.



**Plate IX**—రావోల్ఫియా (*Rauvolfia serpentina*)

(135 వ పుట చూడుడు)



**Plate X**—బెల్లిరిక్ మైరోబొలాన్ (*Terminalia bellirica*)

(163 వ పుట చూడుడు)

# 59. వేగేశిన

PTEROCARPUS MARSUPIUM Roxb. - ఇండియన్ కినో ట్రీ *(Bija Sal)*

**కుటుంబము :** పెపిలియోనేసి

**భారతీయ పేర్లు :** హిందీ – బిజాసల్
గుజరాతీ – బిబ్లా
కన్నడ – హొన్ని
మళయాళం – కినో
మరాఠీ – హోని
సంస్కృతం – మహాకుటజ

చెట్టు నుండి వచ్చు 'కినో' అను జిగురువలన వర్తక నామము వచ్చినది.

## వర్ణన

అందమైన పెద్ద వృక్షము. పత్రములు సంయుక్తములు 5–7 చిరియాకు లుండును. 6 – 13 సెంటీమీటర్ల పొడవున చిరియాకులు, రెండు వైపులా అనగా మొదట, చివర సూదిగా కొనదేరు ఆకారము గాని, అరటియాకు ఆకారమున గాని యుండును. 1.5 సెంటీ మీటర్ల పొడవుగల పసుపు రంగులో పుష్పాలు పెద్ద గుత్తులలో గుబురుగా అమర్చబడి యుండును. 2.5 సెంటీమీటర్ల పొడవున గుండ్రని కాయలు, ఒకే గింజతో రెక్కలు గల్గియుండును.

## విస్తరణ

ముఖ్యముగా ఆకు రాల్చు అడవులలో భారతదేశ మధ్య మందును, ద్వీపకల్పపు అడుగు భాగములోను విస్తరించి యుండును. గుజరాతు, మధ్య ప్రదేశములలో 1100 మీటర్ల ఎత్తువరకు ఆక్రమించి యున్నది. హిమాలయముల క్రింది భాగములలో గూడ కానవగును. పూచిన చెట్టు చూడ మనోహరముగా నుండును.

## ఔషధము దాని గుణములు

ఆకులు, పువ్వులు, జిగురు మందుకు పనిచేయును. చెట్టునకు కత్తి గాటులు వేసినచో కినో అను జిగురు బయటకు కారి గట్టిపడును. నీళ్ల విరోచనములు కట్టించును. దీని గుణము కలిరి (Catechu) గుణము కంటె మందముగా నుండును. పంటి పోటులకు గూడ వాడవచ్చును. జ్వరములకు అతిమూత్రములకు ఉపయోగకారి. ఆకులు నూరి సెగ గడ్డలకు, పుండ్లకు, యితర చర్మ వ్యాధులకు పైన పట్టు వేసినచో బాధలు శమించును.

మధు మేహములకిది పని చేయునను అభిప్రాయము బహువ్యాప్తమైనది. మూత్రమందు చక్కెర గల రోగులకు, దీని కఱ్ఱ ముక్కలను ఒక రాత్రి నీటిలో నాననిచ్చి ఆ నీరును త్రాగించినచో గుణ మిచ్చును. ఈ అభిప్రాయమునకు బలమైన ఆధారములు లేవు.

వైద్యులు పరీక్షలు జరుపగా 7 శాతం రోగులకు మాత్రమే మధు మేహమునకు గుణ మిచ్చినది.

## ఇతర వినియోగములు

ఈ చెట్టు కఱ్ఱ కట్టడములు, మేలు రకం కుర్చీలు,బల్లలు చేయుట కుపయోగపడును.

## సన్నిహితపు మొక్కలు

ఈ జీవన్స్‌కు చెందిన మరొక స్పీషీస్ టిరోకార్పస్ సేంటాలైనస్ (ఆంగ్లం - రెడ్ సాండర్స వుడ్, హిందీ - లాల్ చందన్, సంస్కృతం - రక్త చందనం) కూడ మందుగా పనిచేయును. ఈ చెట్టు చావ కఱ్ఱ గంధము తీసి తల నొప్పులకు, వాపులకు పైన పట్టు వేసినచో బాధలు శమించును.

దీని కఱ్ఱ చాల విలువైనది. దక్షిణ భారతదేశము నందిది కొండల మీద విరివిగా పెరుగును.

# 60. పాటలగంధి

రావోల్ఫియా (*Sarpagandha*)

RAUVOLFIA SERPENTINA. Bentham ex Kurz

**కుటుంబము :** ఎపోసైనేసి

**భారతీయ పేర్లు :**

| | |
|---|---|
| హిందీ | – చోటాచండ్ |
| బెంగాలీ | – చంద్ర |
| మళయాళం | – చువనాయిల్‌పురి |
| మరాఠీ | – హార్కియ |
| సంస్కృతం | – సర్పగంధ, చంద్రిక |
| తమిళం | – చావంద, ఆవల్‌పోరి |
| ఉర్దూ | – ఛాన్‌బరొ |

(Saharanpur (U. P.) మూస.)

రావోల్ఫియా అను శాస్త్రనామము వర్తకములో పరిపాటియైనది. 16 వ శతాబ్దిలోని జర్మను వృక్ష శాస్త్రవేత్త, వైద్యుడు లియోనార్డ రావోల్ఫ్ నామమును సూచిస్తూ రావోల్ఫియా అను పేరు వచ్చినది.

## వర్ణన

30 – 75 సెంటీమీటర్ల ఎత్తున నిలువుగా పెరిగి నిగ నిగలాడెడు పొద. కణుపులందు 3 ఆకులు వర్తులముగా నమర్చబడి యుండును. ఆకులు 8–20 సెంటీమీటర్ల పొడవుండి క్రమముగా పొట్టి వృంతము వైపుకు సన్నగిలును. 1.5 సెంటీమీటర్ల పొడవు గల, తెలుపు లేక లేత ఊదారంగు గల పువ్వులు చిన్న గుత్తులలో నుండును. కాయలు చిన్నగా, గుండ్రముగా యుండి, పండినపుడు నల్లగా యుండును.

## విస్తరణ

1000 మీటర్ల ఎత్తు వరకు యీ మొక్క మన దేశమంతటా వ్యాప్తిలో నున్నది. హిమాలయముల యందు చిన్న కొండలలోను, తూర్పు, పశ్చిమ

కనుమల కొండల యందును పెరుగును. చదును భూములలో గూడ బెంగాలీ, బీహారు, ఉత్తర ప్రదేశము, మహారాష్ట్రములయందు దొరుకును. ఇప్పుడు చాలచోట్ల సాగు చేయబడుచున్నది.

## ఔషధము దాని గుణములు

3, 4 సంవత్సరములు ఎదిగిన మొక్క బెరడుతో సహా వ్రేళ్లు వసంత ఋతువులో తీసి యెండించినచో అవి మందుగా పనిచేయును. సుమారు 4000 సంవత్సరముల నుండి యీ మొక్కను మన ఆయుర్వేద వైద్యము నందు వాడుచున్నట్లు తెలియుచున్నది. దీనిని గురించి చరక సంహిత యందు పేర్కొనబడినది. చాలా రకముల ఆల్కలాయిడ్స్ దీని వ్రేళ్లలో యున్నవి. దీని ముఖ్యమైన గుణము రక్తపుపోటును తగ్గించుట, నిద్దర పట్టించుట, మానసిక ప్రశాంతత నిచ్చుట. ఈ ఔషధము ఇప్పుడు ఉన్మాదములకు, రక్తపు పోటునకు విస్తారముగా నుపయోగపడుచున్నది. నిద్రనిచ్చు గుణము ఆలస్యముగా పనిచేయును. అందువలన వ్యాధి ముదిరి నప్పుడు పని చేయలేదు. అంత తీవ్రం గాని మనోవేదనలకు, మానసిక రోగములకు, దీర్ఘవ్యాధిగా పరిణమించిన రోగులకు, అనుకూలములైన గుణములిచ్చును. మనో ప్రశాంతము నిచ్చు విశేషము దీనికి గలదు. బ్రోంకైటిస్ దగ్గున్న వారికి ఉబ్బసపు రోగులకు, పొట్టలోపల రేగిన పుండ్లు గలవారికి దీనిని వాడకూడదు.

దీని వ్రేళ్లు, జ్వరములకు, ప్రేగులలోని రోగములకు వాడవచ్చును.

సన్నిహితపు మొక్క రా. కేనిస్సెన్సు గూడ మందుగా నుపయోగ మైనది.

ఈ వర్గపు మొక్కలమీద చాల పరిశోధనలు జరిగినవి, యింకా జరుగు చున్నవి. ఇది భారతదేశమునకు గర్వకారణము. ఇప్పుడు కొన్ని దేశములలో రావోల్ఫియా గుణములు గల మందులను, సమకూర్పులచేత తయారుచేయుచున్నారు.

సాలీనా మనకు 12000 క్వింటాల్సు ఈ మందు కావలసియున్నది. గావున, దీని సాగును మిక్కిలిగా విస్తరించవలసిన అవసరమున్నది. దీనిని చదునైన నేలలలో నెచ్చటనైనను, హిమాలయముల క్రింది భాగములలోను సాగు చేయవచ్చును.

ఈ మొక్కను, విత్తనముల వల్లను, కొమ్మ ముక్కలు, వ్రేళ్ళ ముక్కలు

పాతుట వలన సాగు చేయవచ్చును. 6 – 7 క్వింటాల్సు మందు ఒక ఎకరంలోని మొక్కల వలన లభించును. డెహరాడూన్ నందున అటవీ పరిశోధన సంస్థ వారి వలన రెండు సంవత్సరములు పెరిగిన సాగు భూముల నుండి పైన చెప్పిన దానికంటె ఎక్కువ మందు తీయ వచ్చు నని తెలియుచున్నది.

## 61. నాటు రేవల్చినీ

RHEUM EMODI Wallich - ర్హుబార్బ్

కుటుంబము : పోలీగొనేసి

భారతీయ పేర్లు : హిందీ – రేవంద్ చీనీ
బెంగాలీ – కోకిమ, రేవాండ్ చిన్ని
గుజరాతీ – గామ్ని రేవాంచై
సంస్కృతం – రేవాట్, చిన్ని
తమిళం – నాటురేవల్చిన్ని

### వర్ణన

లావుపాటి కొమ్మలు, వ్రేళ్లు గల పొడుగైన మొక్క. 30 – 45 సెంటీ మీటర్ల పొడవు గల లావుపాటి వృంతములకు 60 సెంటీమీటర్ల వ్యాసము గల గుండ్రని ఆకులుండును. అవి చాలా పెద్దవి. నల్ల ఊదా రంగున పెద్ద పెద్ద గుత్తులలో సూక్ష్మమైన పువ్వులుండును. 1.3 సెంటీమీటర్ల పొడవున కాయలు ఊదా రంగులో యుండును.

### విస్తరణ

హిమాలయ పంక్తులలో 3000 – 4000 మీటర్ల ఎత్తున కాశ్మీరు, హిమాచల ప్రదేశము, పంజాబు, ఉత్తర ప్రదేశము, నేపాల దేశములందు పెరుగును.

## ఔషధము దాని గుణములు

'ర్హియమ్ యిమోడీ' అనబడి ఎండించిన దుంపలు మందుగా పని చేయును. వీటి స్థానే, ర్హివెబ్బియానమ్ (అర్చు) దుంపలను గూడ వాడవచ్చును. 6-7 సంవత్సరములు పెరిగిన మొక్కల దుంపలు పూయుటకు ముందు తీయవలెను. దుంపల పై బెరడు పోగూడదు.

ర్హుబార్బ్ విరోచనములకు మందు. ఇందు జిగురు అను పదార్థము లుండుట చేత మొదట విరోచనకారిగా పనిచేసినను తరువాత మలబద్ధ మును కలుగజేయును. తాత్కాలిక మలబద్ధములకు మాత్రమే పని చేసినను దీర్ఘ రోగములుగా మలబద్ధమున్న వారికిది యుపయోగించదు. బిగబట్టు చర్య కలది గావున దీనిని కొన్ని రకాల నీళ్ల విరోచనములకు వాడుదురు. ముఖ్యముగా బాధ కలిగించు పదార్థములు ప్రేగులలో జేరి వచ్చిన విరోచనములను కట్టించును.

ప్రతి సాలునా మనకు 40 క్వింటాల్సు మందు కావలసియున్నది. హిమాలయములలో నెత్తైన ప్రదేశములు దీని సాగుకు వీలుగా నుండును.

## సన్నిహితపు మొక్కలు

బ్రిటిష్ ఫార్మకోపియాస్ ర్హుయిమ్‌పామేటమ్ మొక్కనుండి తీసిన మందును గుర్తించుచున్నారు. భారతదేశపు మొక్కలు దానికి పూర్తిగా సమములై తృప్తి నిచ్చుచున్నాయి.

# 62. ఆముదము

RICINUS COMMUNIS L. - కేస్టర్-ఆయిల్ సీడ్

**కుటుంబము :** హిందీ - అరండి

| | |
|---|---|
| హిందీ | - అరండి |
| అస్సాము, బెంగాలీ | - ఖెరెండా |
| బెంగాలీ | - ఇరి |
| గుజరాతీ | - దివిలి |
| మళయాళం | - అవనాక్కా |
| మరాఠీ | - అరండీ |
| ఒరియా | - జడ |
| సంస్కృతం | - ఇరాండా |
| తమిళం | - అమనక్కమ్ |
| తెలుగు | - ఇరెండము |

(కృష్ణాజిల్లా ఆంధ్ర) **ఆముదము, పెద్దాముదము**

ఒక్కొక్కప్పుడు వివిధ రకములైన మొక్కలకు ప్రాంతీయ నామములు మారుచుండును. ఉదాహరణకు తెల్లగింజలు గలదానిని ఖట్ రెండి అనియు, బూడిదరంగు విత్తనములు గల మొక్కను జోగియారెండి అని వాడుక చేయుచున్నారు.

ప్రాచీన గ్రంథములలో దీనిని చిత్రవిజ, పంచాంగుల, వటారి అను పేరులతో వర్ణించియున్నారు. ఈ పేర్లు మొక్కకున్న ఆకారము, గుణములు, అంగములను వర్ణించును. విత్తనముల మీది అందమైన మచ్చలు పైన బొడిప మొదలైన వాటిని తెలుపునది చిత్రవిజ అను పేరు. అరచేయి ఆకారమునను్న ఆకు 5 తొడిమలు గలదగుటచేత పంచాంగుల అను పేరు వచ్చినది. కీళ్లవాతపు నొప్పులను శమింపజేయగలదు గావున వటారి అను పేరు గలిగినది. (వట అనగా కీళ్లవాతము).

ఆంగ్లములో పరిపాటిగా నున్న పేరు వర్తకములో పరిపాటైనది.

## వర్ణన

బాగా పెరిగినప్పుడు చెట్టుగా కూడ కన్పించే ఎత్తైన పొద. ఆకులు

పెద్దవి గుండ్రముగా నుండి 7 గాని 9 గాని చివర పాయలుగా విభాగ మగును. అంచునకు పళ్లుండును. పువ్వుల గుత్తులు పెద్దవిగా కొనలయం దుండును. ముళ్లుగల కాయలు 6 భాగము లేర్పడి యుండును. ఎర్రని పెద్ద గింజలు గల ఒక రకం చెట్టు లావైన కొమ్మలతో నుండు బహువర్షజీవి. దీని నూనె దీపములు యిండ్లలో వెలిగించుకొనుటకును, మరలకు, వాహనము లకు సందులలో పోసి, అవి సులువుగా పనిచేయునట్లు చేయుటకును వినియోగింతురు. రెండవది, మచ్చలతో నున్న గింజలు గలది సాగు చేయ బడి, మందుగా పనిచేయు ఆముదము నూనె నిచ్చును. నీలిఛాయ రంగు గల ఆకులతో నున్న మూడవ రకం మొక్క అందమునకై పెంచుదురు.

## విస్తరణ

సాగు భూములకు అంచుల యందును, తోటలలోని పల్లెలలోని నివాస స్థలములందును, ఖాళీ ప్రదేశములలోను దీనిని పెంచుదురు.

## ఔషధము దాని గుణములు

విత్తనములు మందునకు పనికివచ్చును. గింజలు విషముగలవి. 2 లేక 3టి వలన మాత్రము మరణము సంభవించవచ్చు. వాటి నుండి తీసిన నూనె ఆముదము విరోచనములకు మందు. పాలతో గాని, పండ్లరసముతో గాని దీనిని వాడుట మంచిది. నొప్పులు, పోట్లు నివారించుటకు పైపూతగా వాడ వచ్చును. కంటిలో వేయుమందులకిది మూల వస్తువు. దీనివలన పురుడు సులువుగా వచ్చునను విషయము సంశయాస్పదమైనది. దీనిని గర్భిణీ స్త్రీలకు, బహిష్టి అయినవారలకు అరుదుగా వాడుదురు.

దీనితో గర్భ నిరోధకముగా వర్తించు, మీగడవంటి పదార్థములను, మెత్తని గుంజులాంటి పదార్థములను తయారుచేయుదురు.

(బస్తర్ జిల్లాలోని అటవికులు దీని ఆకులను కీళ్ల పైన వేసి రుద్దుదురు. లేత ఆకులు నూరి విరోచనముల మందుగా వాడుదురు.)



**Plate XI**—టినోస్పొరా (*Tinospora cordifolia*)

(167 వ పుట చూడుడు)



**Plate XII**—ఇండియన్ స్క్విల్ (*Urginea indica*)

(173 వ పుట చూడుడు)

# 63. చందనము

SANTALUM ALBUM L. - సాండల్‌వుడ్

**కుటుంబము :** సెంటలేసి

| **భారతీయ పేర్లు :** | | |
|---|---|---|
| | హిందీ | - చందన్, సేండల్ |
| | బెంగాలీ, గుజరాతీ | - సుఖాడ్ |
| | కన్నడ | - అగరు గంధ |
| | మరాఠీ, సంస్కృతం | - చందన్ |
| | సంస్కృతం | - మలయజ, భోగివల్లభ |
| | తమిళం | - చందనం, సాండల్ |

వర్తక నామము భారతీయ నామముల మీదనే ఆధారపడినది.

## వర్ణన

నిత్యము పచ్చగా వుండే మధ్యరకము ఎత్తు కలిగిన చెట్టు. ఎల్లపుడూ కొమ్మలు వ్రేలాడును. నిలువుపాటి పగుళ్లు కలిగి బెరడు నల్లగా యుండును. 4 - 7 సెం. మీ. పొడవైన ఆకులు రెండేసి అభిముఖముగా పై భాగమున నిగ నిగలాడుచుండును. చిన్న చిన్న ఊదా రంగులోని పువ్వులు అనాకర్షణీయములుగా నుండి చిన్న గుత్తులలో వ్రేలాడును.

6 మి. మీ. వ్యాసముగల ఊదా నలుపులో రసము గల పండ్లు గుండ్రముగా నుండును.

## విస్తరణ

దక్కను ద్వీప కల్పములో దక్షిణ ప్రదేశమున అడవి మొక్కగా పెరుగును.

## ఔషధము దాని గుణములు

దీని చేవకట్టె నుండి తీసిన తైలము ఔషధముగా పనిచేయును. ఈ

నూనెను మూత్రము నుత్పత్తి చేయుటకు, జారీ చేయుటకును, మూత్రపు తిత్తి వాచినపుడును, సెగ వ్యాధికి, దగ్గుల కుపయోగించును. గాల్ బ్లేడర్‌లో క్షయ వ్యాధి పుట్టినపుడు ఇది ఉపయోగపడును.

దీని కఱ్ఱతో సాన మీద తీసిన గంధము వాపులకు, సెగగడ్డలకు జ్వరముల యందు నుదురుకు, చర్మ వ్యాధులకు పట్టు వేయుదురు. దీని గింజల నుండి వచ్చిన నూనె చర్మ వ్యాధులను నివారించును.

### ఇతర వినియోగములు

గృహోపకరణములలో చిన్న వాటిని అలంకారము కొఱకు ఈ కఱ్ఱతో చేయుదురు. చాల కాలము దీని పరిమళమును నిలుపుకొనగలదు. ఈ కఱ్ఱ యొక్క చూర్ణమును అగరు వత్తులు చేయుటకును ధూపములు వేయుటకును పనికివచ్చును. దీనినుండి వచ్చిన నూనె సుగంధ ద్రవ్యముల లోను సబ్బులలో నుపయోగించుటయే గాక క్రిములను హరించుటకు గూడ నుపయోగింతురు.

## 64. అశోక

SARACA INDICA L.

కుటుంబము : సిసల్ పినియేసి

భారతీయ పేర్లు :

| | |
|---|---|
| హిందీ | – అశోక |
| గుజరాతీ | – అశోఫలవ |
| మళయాళం, మరాఠీ, ఒరియా | – అశోక |
| తమిళం | – అశోగం |

సీతాదేవి బందీగా నున్న పురాణాలలోని అశోక వటిక అను పేరు వలన మనదేశంలో వచ్చిన ప్రాంతీయ నామముల మీద అశోక అను వర్తక నామం పరిపాటైనది.

## వర్ణన

నిత్యము పచ్చని సంయుక్త పత్రములు గల చిన్న చెట్టు. తల భాగము చిక్కగా ఆకులతో నిండియుండును. చిరుయాకులు 7–25 సెం. మీ. పొడవై చర్మము వలె నుండును. పూవులు నిగ నిగలాడు నారింజ పండు రంగులో నుండును. వీటిలో పుష్ప పుచ్ఛములే రంగు కలిగియుండును. పూవులు చిన్న గుత్తులలో నుండును. కాయలు పలుచగానుండి అనేక విత్తనములలో 15–25 సెం. మీ. పొడవుండును.

## విస్తరణ

మధ్య, తూర్పు హిమాలయముల యందును, తూర్పు దక్షిణ భాగములలో భారతదేశమందు విరివిగా పెరుగును. అందమైన పువ్వుల కొరకు దీనిని పెంచుదురు.

## ఔషధము దాని గుణములు

ఎండించిన చెట్టు బెరడు మందుగా విలువయైనది. స్త్రీల జబ్బులలో అమిత స్రావము (ప్రదర) అను రోగమునకును పిల్లల సంచికి మాంద్యము కలిగించుటకును దీని నుపయోగింతురు. బిడ్డ సంచి లోని రక్తనాళములు పగిలినపుడు ఎర్గాటురు బదులుగా దీని నుపయోగింతురు. బెరడుకు ఆరోపింపబడిన అనేక ఇతర గుణములు బిడ్డల సంచికి వచ్చు ఇతర రోగములు కుదుర్చునను అభిప్రాయము పరీక్షవలన అసత్యమని తేలినది. కానీ ఆ మందు మనకు తెలియని కొన్ని ఇతర పదార్థముల వలన ప్రయోజనకారి అయివుండవచ్చును.

పువ్వులను నీళ్లతో నూరి లోపలికిచ్చినచో రక్త విరోచనములు కట్టును. గింజలు అతి మూత్ర వ్యాధిని కుదుర్చును.

## 65. కోష్ఠము

SAUSSUREA LAPPA Clarke. - సౌరిస్సూయ

**కుటుంబము :** కంపోజిటే

**భారతీయ పేరు :** హిందీ - కూత్
బెంగాలీ - కుర్
గుజరాతీ - కుత్
మళయాళం - సేపుడ్డి
సంస్కృతం - అగద, ఉష్ఠ
తమిళం - కోష్ఠము

హిందీ, శాస్త్రీయ నామములే వర్తకములో వాడుక చెందినది.

### వర్ణన

బహు వార్షికమై రెండు మీటర్ల యెత్తువరకూ పెరిగెడి మొక్క. ఆకులు చాల పెద్దవి. క్రింది యాకులు 1.2 మీ. పొడవైనవి. వీటి వృంతములకు రెక్కలుండును. పైనున్న ఆకులు చిన్నవి. ఒక్కొక్కపుడు ఆకులు వృంతములలో యుండును. ఆకుల క్రింది భాగమున రెండు భాగములు చెవులులా నుండి కొమ్మను కప్పివేయుచుండును.

రెండు సెం. మీ. పొడవైన పువ్వులు నీలి ఊదా రంగులలో గాని పూర్తి నలుపు రంగులలో గాని గుండ్రని గుత్తులలో అమరియుండును. కొద్ది పాటి పూల గుత్తులు గ్రీవములలో కొమ్మల చివరన నుండును. కాయల మీది రోమములు 1.7 సెం.మీ. పొడవైనవి. ఇది ఈకలవలె పైకి లేచి కాయలుగా మారుతున్న పూ గుత్తుల మీద పైకి తేలియుండును.

### విస్తరణ

2500 – 4000 మీటర్ల ఎత్తున కాశ్మీరు నందును పరిసర ప్రాంతముల లోను పెరుగును.

## ఔషధము దాని గుణములు

ఎండించిన వ్రేళ్లు మందుగా పనిచేయును. ఇది క్రిమి సంహారియే గాక, విషజ్వరములు రాకుండ కాపాడును. బ్రోంకైటిస్ అను దగ్గునకును, ఉబ్బసమునకును, కడుపుబ్బరమునకును గుండె జబ్బులకును పనిచేయును. మూత్రమును కూడ జారీ చేయగలదు. అసంకల్పిత కండరములకు విశ్రాంతి నిచ్చు దీని గుణము వలన బ్రోంకైటిస్, ఉబ్బసపు దగ్గులకు ఇతర దగ్గులకు తాత్కాలిక గుణముల నంపజేయుచున్నది.

కీళ్ల వాతములకును, చర్మ వ్యాధులకును, ఉపయోగకారి యని తెలియుచున్నది. ప్రయోగముల వలన ఈ వ్రేళ్ల నుండి క్రొవ్వు పదార్థములను తీసిన పిమ్మట ఆ వ్రేళ్ల నుపయోగించినచో బ్రోంకైటిస్ దగ్గు నివారించవచ్చునని తెలియుచున్నది.

## సన్నిహితపు మొక్కలు

హిమాలయములందు దీనికి సన్నిహితములైన మొక్కలు కొద్దిగా నున్నవి. వాటిని అరుదుగా మందునకుపయోగింతురు.

హిమాలయముల ఎత్తైన కొండలలో హిమాచల ప్రదేశము నుండి సిక్కిం వరకును సాగు చేయుటకు వీలుగా నుండును.

# 66. చిరుబెండ

**SIDA CORDIFOLIA L. - సిడా**

కుటుంబము : మాల్వేసి

| భారతీయ పేర్లు : | | |
|---|---|---|
| | హింది | - ఖరేంటి, కుంగి |
| | బెంగాలీ | - బల |
| | గుజరాతీ | - బలదన |
| | మళయాళం | - కట్టురామ్ |
| | మరాఠీ | - చికానా |
| | ఒరియా | - బడిసూనాన్లా |
| | సంస్కృతం | - జయంతి |
| | తమిళం | - అరివల్ -ముక్కైపుండు |

దీని ఆకులు గుండె ఆకారమున నుండుటచేత కార్డిఫోలియా అను పేరు వచ్చి, అదే వర్తకములో పరిపాటి అయినది.

## వర్ణన

ఒత్తుగా కొమ్మలు పెంచు చిన్న మొక్క. నక్షత్ర ఆకారముగల రోమములు మొక్క పైన అంతటా యుండును. పళ్ళెరముగా నుండి గుండ్రముగా గాని అండాకారముగా గాని ఆకులు 2. 5 సెంటీమీటర్ల పొడవుండును. ఒకటి గాని, రెండు గాని పసుపు రంగుగల పువ్వులు చిన్నవుండును ఆకు అంచులు పళ్ళుండును. పుష్పతలము చిన్నవి. 7 నుండి 10 బద్దలుగా పగిలేటి కాయలు 6-8 మిల్లీమీటర్ల పొడవుండును. కాయపైన నరములు వలవలె నుండును. కాయలకు రెండు ముళ్ళ వంటి మీసములుండును.

## విస్తరణ

బంజరుగా వదలిన భూములలో కలుపుగా మనదేశ మంతటా వ్యాప్తిలో నున్నది. చిట్టడవులలో విరివిగా పెరుగును.

## ఔషధము దాని గుణములు

మొక్క సమూలముగా మందున కుపయోగించును. బలవర్ధనకరమే గాక వీర్యవృద్ధి నిచ్చి సంభోగ శక్తిని పెంపొందించును. ముఖ్యముగా దీని విత్తనముల యందీ గుణములున్నవి. దీని వ్రేళ్లు, అల్లం కలిపి కషాయం కాచి త్రాగిన జ్వరములు నివారించును. వ్రేళ్ల బెరడు చూర్ణమును, పాలు పంచదారలతో కలిపి సేవించినచో స్త్రీల తెల్లబట్ట రోగము, నరముల దుర్బలత్వము నివారణ యగును. వ్రేళ్ల రసము గాయములను మాన్పును. ముఖమునకు వచ్చు పక్షవాతము దీని వ్రేళ్ల బెరడు చూర్ణము, నువ్వుల నూని, పాలు కలిపి వాడినచో గుణమిచ్చును. గింజల వలన సెగ రోగము, నులి నొప్పులు మానును.

## సన్నిహితపు మొక్కలు

ఈ జీనస్సులోనివి మందునకు పనిచేయు మొక్కలు.

సైడా ఎక్యూటా. (బెంగాలీ, హిందీ - బాన్ మెతి, సంస్కృతం - బల) వ్రేళ్ళను నరముల బలహీనతకు, మూత్రవచ్చు రోగములకు జ్వరములకు, కడుపులోని బాధలకు నుపయోగించనగును. ఆకులను గూడ మందునకు వినియోగింపవచ్చును.

సై. రోంబిఫోలియా (హిందీ - స్వేత్ బారిలా, సంస్కృతం - అతిబల) దీనిని ఊపిరితిత్తులకు వచ్చు క్షయ వ్యాధికి, కీళ్లవాతపు నొప్పులకు వాడ వచ్చును. ఇది బాధల యందు శాంతి కలుగజేయును.

సై. స్పైనోసా (హిందీ - గుల్ సాక్రి, సంస్కృతం - నాగబల) దీని వ్రేళ్లు, వ్రేళ్ల మీది బెరడు మూత్రపు తిత్తి బాధించి నొప్పులు పోట్లు కలిగి నప్పుడా బాధలను శమింపజేయును. జ్వరములు, సెగ రోగము తగ్గించుటే గాక దేహపుష్టికి దోహదము చేయును. దీని ఆకులకు గూడ యీ చెప్పిన గుణము లున్నవి.

# 66. చిరుబెండ

**SIDA CORDIFOLIA L.** - సిడా

**కుటుంబము :** మాల్వేసి

| **భారతీయ పేర్లు :** | హిందీ | – ఖరేంటీ, కుంగి |
| --- | --- | --- |
| | బెంగాలీ | – బల |
| | గుజరాతీ | – బలడన |
| | మళయాళం | – కట్టురామ్ |
| | మరాఠీ | – చికానా |
| | ఒరియా | – బడిచూనాన్లా |
| | సంస్కృతం | – జయంతి |
| | తమిళం | – అరివల్ - మనైపుండు |

దీని ఆకులు గుండె ఆకారమున నుండుటచేత కార్డిఫోలియా అను పేరు వచ్చి, అదే వర్తకములో పరిపాటి అయినది.

## వర్ణన

ఒత్తుగా కొమ్మలు పెంచు చిన్న పొద. నక్షత్ర ఆకారముగల రోమములు మొక్క పైన అంతటా యుండును. దళసరిగా నుండి గుండ్రముగా గాని ఆకు చుక్క ఆకారముగా గాని ఆకులు 2.5 సెంటీమీటర్ల పొడవుండును. ఒకటి గాని, రెండు గాని పసుపు రంగుగల పుష్పాలు చిన్న వుండును ఆకు అంచున పళ్ళుండును. వృంతములు చిన్నవి. 7 నుండి 10 బద్దలుగా పగిలేటి కాయలు 6–8 మిల్లీమీటర్ల పొడవుండును. కాయపైన నరములు వలవలె నుండును. కాయలకు రెండు ముళ్ల వంటి మీసము లుండును.

## విస్తరణ

బంజరుగా వదలిన భూములలో కలుపుగా మనదేశ మంతటా వ్యాప్తిలో నున్నది. చిట్టడవులలో విరివిగా పెరుగును.

## ఔషధము దాని గుణములు

మొక్క సమూలముగా మందున కుపయోగించును. బలవర్ధనకరమే గాక వీర్యవృద్ధి నిచ్చి సంభోగ శక్తిని పెంపొందించును. ముఖ్యముగా దీని విత్తనముల యందే గుణములున్నవి. దీని వ్రేళ్లు, అల్లం కలిపి కషాయం కాచి త్రాగిన జ్వరములు నివారించును. వ్రేళ్ల బెరడు చూర్ణమును, పాలు పంచదారలతో కలిపి సేవించినచో స్త్రీల తెల్లబట్ట రోగము, నరముల దుర్బలత్వము నివారణ యగును. వ్రేళ్ల రసము గాయములను మాన్పును. ముఖమునకు వచ్చు పక్షవాతము దీని వ్రేళ్ల బెరడు చూర్ణము, నువ్వుల నూని, పాలు కలిపి వాడినచో గుణమిచ్చును. గింజల వలన సెగ రోగము, నులి నొప్పులు మానును.

## సన్నిహితపు మొక్కలు

ఈ జీనస్సులోనివి మందునకు పనిచేయు మొక్కలు.

సైడా ఎక్యూటా. (బెంగాలి, హిందీ - బాన్‌మెతి, సంస్కృతం - బల) వ్రేళ్ళను నరముల బలహీనతకు, మూత్రము వచ్చు రోగములకు జ్వరములకు, కడుపులోని బాధలకు నుపయోగించవచ్చును. ఆకులను గూడ మందునకు వినియోగింపవచ్చును.

సై. ర్హాంబిఫోలియా (హిందీ - స్వేత్ బారిలా, సంస్కృతం - అతిబల) దీనిని ఊపిరితిత్తులకు వచ్చు క్షయ వ్యాధికి, కీళ్లవాతపు నొప్పులకు వాడ వచ్చును. ఇది బాధల యందు శాంతి కలుగజేయును.

సై. స్పైనోజా (హిందీ - గుల్ శాక్రి, సంస్కృతం - నాగబల) దీని వ్రేళ్లు, వ్రేళ్ల మీది బెరడు మూత్రపు తిత్తి బాధించి నొప్పులు పోట్లు కలిగి నప్పుడా బాధలను శమింపజేయును. జ్వరములు, సెగ రోగము తగ్గించుటే గాక దేహపుష్టికి దోహదము చేయును. దీని ఆకులకు గూడ యీ చెప్పిన గుణము లున్నవి.

# 67. నేల ములక

కంటకారి

SOLANUM SURATTENSE Burm. f. syn. *S. xanthocarpum* Schard. and Wendl.

కుటుంబము : సొలెనేసి

భారతీయ పేర్లు : హిందీ – కాటేరి, రింగిని
అస్సామీ – కాట్కారేయ
బెంగాలీ, కన్నడ, సంస్కృతం – కంటకారి
గుజరాతి – భోయరింగని
ఒరియా – బ్యాకూరి, బేంగనీ
పంజాబీ – కాండియారి, మోహ్రియన్
తమిళం – కాండంగత్తారి
తెలుగు – చల్లమ్ములగ, వాకుడు

కంటకారి యను భారత నామమే పత్రరములో వాడుకబడినది.

## వర్ణన

ముళ్లతో నిండి సఖముఖములకు నేలమీద ప్రాకెడు మొక్క. లేత కొమ్మల మీద సూక్ష్మమైన నక్షత్రాకారముగల రోమము లుండును. 1.5 సెంటీమీటర్ల పొడవైన పసుపు రంగులో మెరిసెడి ముళ్లుండును. ఆకులు 10 సెంటీమీటర్ల పొడవు. ఆకుల మీది, మధ్య, యితర తొడిమలకు గూడ పసుపురంగు ముళ్ళుండును. పుష్పములు ఊదారంగు కలిగి 2 సెంటీ మీ. పొడవు, కొలది సంఖ్యలలో చిన్న గుత్తులుగా ఆకులకు అభిముఖముగా నుండును. 1.5–2 సెం. మీ. పొడవైన గుండ్రని పసుపురంగు గల కాయలు ఆకుపచ్చని నాళములలో నుండును.

## విస్తరణ

మనదేశ మంతటను, బంజరు భూములందును, బయలు ప్రదేశముల




సొలేనమ్ (*Solanum indicum*)

లోను బాటల కిరువైపుల బహిరంగ చిట్టడవి ప్రదేశములలోను విరివిగా మొలచును.

## ఔషధము దాని గుణములు

ఎండించిన వేళ్లు మందుగా పనిచేయును. ఇది మామూలు దగ్గులకు, ఉబ్బసమునకు, ఛాతిమీది నొప్పికి, కొన్ని రకముల జ్వరములకు పని చేయును. మూత్రము జారీచేయును. మూత్రపు తిత్తిలో రాళ్ళున్నపుడు వాటిని కరిగించును. ఈ కాయలకు బాక్టీరియములను హరించు గుణము లున్నట్లు ప్రయోగముల వలన నిరూపింపబడినది. ఆ గుణములే కొమ్మ లకు ఆకులకు గూడ కలవు.

దీని కాయలు అనేక రోగములకు పనికి వచ్చును. అవి ఏవనగా గొంతునొప్పి, బ్రోంఖైటిస్, కండరముల నొప్పులు, జ్వరములు మొదలైనవి. కాయల యొక్క ఔషధ విలువ భారతీయ ఫార్మశిటికల్ ప్రోడక్ట్సులో గాని యునైటెడ్ స్టేట్సు యొక్క ఫార్మకోపియాలో గాని పేర్కొనబడలేదు. దీని కొమ్మలకు, ఆకులకు గర్భ నిరోధక గుణమున్నదా లేదా అని తెలిసి కొనుటకు జంతువులపై ప్రయోగములు జరిపిరి. అట్టి గుణమున్నట్లు సూచనలు లేవు. మొక్క యొక్క చాల భాగములు పాము కాటుకు పని చేయునను నమ్మకమును పరీక్షల ద్వారా ఖండింపబడినది. (బస్తర్ జిలా లోని అటవికులు పండ్లయొక్క రసమును పోటుగానున్న చెవులలో పోయుదురు.)

## ఇతర వినియోగములు

లేత ఆకులు, కాయలు కూరగా నుపయోగపడును.

## ఇతర సన్నిహితపు మొక్కలు

సొలేనమ్ నైగ్రమ్ (లాటిన్:) (బ్లాక్ నైట్ షేడ్, బెంగాలీ - గుర్కమై, కాక్‌మాచి, హిందీ - ఘూమై, మాకోయి, కన్నడం - కాచిగడ, పంజాబీ- పిలక్). ఇది ఆయుర్వేద మందులలో ముఖ్యముగా కలుపు వస్తువు. దీని కషాయము జిగట విరేచనములను, ఇతర కడుపు బాధలను, జ్వరములను

నివారించగలదు. మూత్రము జారీ చేయగలదు. మొక్కనూరిన రసము రేగిన పుండ్లకు ఇతర చర్మవ్యాధులకు పనిచేయును. దీని కాయలు ముఖ్యమైనవి. ఇవి బలవర్ధనకరము; విరేచనకారి. ఆకలి పుట్టించగలవు. ఉబ్బసము, చర్మవ్యాధులు, అతిమూత్రము, విదాహమును మొదలైన వాటిని నివారింపగలవు. ఆకుపచ్చని కాయలు రోటిలో తొక్కి తామరకు పైన పూత పూయుదురు.

ఇంకా ముఖ్యమైనటువంటి ఔషధ గుణములుగల మొక్కలు: సొ. డల్కమెరా (బిట్టర్ నైట్ షేడ్, సంస్కృతం - కాక్ మాచి.) సొ. ఫెరాక్స్ (బెంగాలీ, హిందీ - రాంబిగన్, సంస్కృతం - చంద్రపుష్ప, సొ. ఇన్కేనమ్, లాటిన్) (హిందీ - గగ్లీఘటా, అసిండ్), సొ. ఇండికం (యల్) (బెంగాలీ - టిట భేకరి సంస్కృతం - బ్రీహటిక), ఇటీవల సొ. కాసియానమ్ Clarke, సొల సోడైన్ అను పదార్థముండుటచేత మిక్కిలి ప్రఖ్యాతి వహించినది. కలకత్తాలోను ఇతరచోట్ల దీనిని గురించి ఇంకను పరిశోధనలు చేయుచున్నారు.

సాగుచేసెడి మొక్కలు: సొ. మెలంగైనా (వంగ) ను గూర్చి కూడ ఔషధ గుణములు మనము చెప్పవలసియున్నది. లేతకాయలు గుండెకు పుష్టిచేసి ఆకలిని వృద్ధిచేసి రక్తమును వృద్ధిచేయును. పండిన పండ్లు విరేచనకారులు. కాని కడుపుబ్బరము కలుగజేయును. ఆకుల నూనె సవాయిపుండ్లకు పైన పట్టువేయుదురు. దీని వేళ్ళ కషాయము గూడ ఆ రోగమునకు పనిచేయును.

బంగాళాదుంప (సొ. ట్యూబరోసమ్) కు కూడ ఔషధ గుణములు కలవు. ఈ దుంపలు ఉడికించిన నీళ్ళు చర్మము మీది మొటిమలకును, చర్మము మీది ఇతర బొబ్బలకును కాలిన పుండ్లకును పనిచేయును. చర్మము మీది పుండ్ల పై పూతగా బంగాళాదుంప పిండి ఉపయోగపడును.

## కొత్తగా ప్రవేశ పెట్టబడినవి

ఇతర దేశముల నుండి తెచ్చిన సొ. అవిక్యులేర్ అను మొక్కను కాశ్మీరు నందు పెంచుటకు ప్రయత్నించుచున్నారు. దీనినుండి సొలసోడైన్ తీసి వాడవచ్చును. ఈ సొలసోడైన్ యందు సెక్స్ హార్మోనులు మిక్కుటముగా నున్నది.

# 68. పొనాకు

STERCULIA URENS Roxb. - కరయ

కుటుంబము : స్టెర్క్యూలియేసి

| భారతీయ పేర్లు : | | |
|---|---|---|
| | హిందీ | - కులు, గులు, కారై |
| | గుజరాతీ | - కాండోల్, కరయో |
| | కన్నడ | - ఛుటాలీ |
| | మళయాళం | - టోంటీ |
| | మరాఠీ, పంజాబీ | - కులు |
| | ఒరియా | - గ్రిండోలా |
| | తమిళం | - వెల్లైపుట్టలి |
| | సాంతాల్ పరగణాలు | - (వెల్ హెచ్) |

భారతీయ ప్రాంతీయ నామమైన కరయా యనునది వర్తకములో వాడుకైనది.

## వర్ణన

మధ్యరకం ఆకులు రాల్చు చెట్టు. తెల్ల లేక లేతతెల్లని కాగితము వలె మృదువుగా మెరయుచుండు బెరడు వలన అడవిలో మిగతా చెట్ల కంటె స్ఫుటముగా కనిపించుచుండును. ఆకులు కొమ్మల చివరనే గుంపులుగా చేరును. 22–40 సెం. మీ. వ్యాసము గల ఆకులు అయిదు విభాగములై పెద్దవిగా నుండును. వాటి క్రింద భాగము ఒత్తుగా రోమములు కలిగి యుండును. పసుపు పచ్చని పూలు చాల చిన్నవి రోమసహితములైన చిక్కని పెద్ద గుత్తులలో నుండును. కాయలు నాలుగైదు పెద్దగాను దళసరిగా నుండి ఎఱ్ఱని విభాగములతో ఒత్తుగా గుచ్చుకొను రోమములతో ఆవరింపబడియుండును.

## విస్తరణ

హిమాలయము లందు ఉష్ణమండలములోను, తూర్పు, మధ్య, దక్షిణ



**Plate 23**— సేండల్ వుడ్ *(Santalum album)* (141 వ పుట చూడుడు)



**Plate 24**
రావోల్ఫియా
(*R. tetraphylla*)
(135 వ పుట చూడుడు



**Plate 25**
కేరయ
(*Sterculia urens*)
(152 వ పుట చూడుడు)



**Plate 26**
సొలేనమ్
(*Solanum khasianum*)
(150 వ పుట చూడుడు)



**Plate 27**
చిరయుట
(*Swertia chirata*)
(154 వ పుట చూడుడు)



**Plate 28**
వేలేరియన్
(*Valeriana Wallichii*)
(176 వ పుట చూడుడు)

**Plate 29**
చెబులిక్ మైరోబాలాన్
(*Terminalia chebula*)
(163 వ పుట చూడుడు)

ప్రాంతములలోను, ఉష్ణమండలములలో ఆకురాల్చు అడవులయందును, ఉండును.

## ఔషధము దాని గుణములు

దీని మొదలు నుండి కారు జిగురు ఔషధగుణములు కలిగినది. దీనిని కరయ జిగురు, కాదిర జిగురు అందురు. ఈ జిగురు విరేచనకారి. చర్మము మీద పట్టించినచో ట్రగాకాంత్ జిగురు కంటె మెత్తగా పని చేయును. ఈ కరయ జిగురును ట్రగాకాంత్ జిగురుకు బదులుగా గొంతు లోని బాధలకు పళ్ళను గట్టిపరచుటకును, బుగ్గను పెట్టియుంచుకొనే మందులకును, గంధములకును వాడవచ్చును. (బస్తర్ జిల్లాలోని అటవికులు ఈ చెట్టు మొదలు చెక్కను తీసి బాగుగా త్రొక్కి గర్భిణీ స్త్రీలకు ప్రసవించుటకు ముందు ఇచ్చెదరు. తత్కారణముగా కానుపు సులభముగా వచ్చునని వారి నమ్మకము.)

## ఇతర వినియోగములు

దీని కర్రను గృహోపకరణములలో అనేక విధములుగా తలుపులకు, నావలు తయారుచేయుటకు, అక్షరములు చెక్కెడి బల్లలకు, రవాణా పెట్టెలు మొదలైనవాటి కుపయోగపడును.

దీని బెరడునుండి గట్టిపీచు తీయుదురు. ఈ పీచునుండి తాళ్ళు, ముతక బట్టలు తయారుచేయుదురు. గింజలు తినుట కుపయోగపడును. జిగురును కూరలలో వాడుదురు.

## ఇతర సన్నిహితపు మొక్కలు

ఈ జాతికి చెందిన రెండు మొక్కలు: స్టెర్క్యూలియా విల్లోసా Roxb (హిందీ – ఉడల్, ఒరియా – కోడలో) మన దేశమంతటా పెరుగునది. స్టె. ఫోయిటిడా (జంగ్లీ బాదమ్) దక్షిణ భారతదేశములో దొరకునది కూడ ఔషధమునకు విలువైన పదార్థముల నిచ్చును.

మొదటిచెట్టు జిగురు ట్రాగాకాంత్ జిగురుకు బదులుపయోగించవచ్చును. రెండవచెట్టు గింజలనూనె విరేచనముల మందుగా వినియోగించవచ్చును.

# 69. నీలవేంబు

SWERTIA CHIRATA Buch. Ham - చిరాయతా

**కుటుంబము :** జంషియనేసి

**భారతీయ పేర్లు :** హిందీ - చిరయట
బెంగాలీ - చిరట
కన్నడ - నీలబేవు
మరాఠీ - చిరగిట
సంస్కృతం - కిరాత - తిక్త
తమిళం - నీలవేంబు

ప్రాంతీయ నామములే వర్తకములో వాడుక జెందినవి.

## వర్ణన

ఒకటిన్నర మీటర్ల ఎత్తు వరకు పెరుగు ఏక వార్షికపు మొక్క. వృంత రహితములైన ఆకుజంట లభిముఖముగా నుండును. చివరలు మొనదేలిన ఆకులు 10 సెంటీమీటర్ల పొడవు గలవి. శీలాకారంగు మచ్చలుగల లేత ఆకుపచ్చ పువ్వులు. ప్రతి ఆకర్షణ పత్రభాగమునకు రెండేసి ఆకుపచ్చని గ్రంథులుండును. కాయలు కోలగా 6 మిల్లీమీటర్ల పొడవైనవి.

## విస్తరణ

1200 నుండి 3000 మీటర్ల ఎత్తువరకు హిమాలయములందు కాశ్మీర్ లగాయతు అస్సాము వరకు దొరకును.

## ఔషధము దాని గుణములు

పూలతోనున్న మొక్కలు సమూలముగా తీసి ఎండబెట్టి చూర్ణము చేసి నదో నది మందుగా పనిచేయును. చిరయట చేదుగానుండి, జ్వరములను హరించును. కడుపులోని బాధలను శమింపజేయును. ప్రేగులలోని పురుగు

లను చంపి, బయటకు నెట్టివేయును. దీని గుణములు జన్షియన్ మందు గుణములకు సమానములు. దీనిని జ్వరములకు, నీళ్ళ విరోచనములకు, నీరసమునకు నిత్తురు. చలిజ్వరమునకు గూడ వాడనగును. దీని జ్వరములను నివారించు గుణము ఇటీవల జరిపిన ప్రయోగములవలన ఋజువు కాలేదు.

## ఇతర సన్నిహితపు మొక్కలు

7, 8 వరకు ఈ జాతికి చెందిన మొక్కలు మనదేశపు కొండలలో పెరుగును. చిరయుట వలెనే ఔషధమున కుపయోగించును.

సాలీనా మనకు 40 క్వింటాల్సు చిరయుట అవసరమగుచున్నది. దీని సాగు విస్తరణ ప్రోత్సహింపబడినది. హిమాలయములందెత్తైన ప్రదేశములు, కాశ్మీరు, హిమాచల ప్రదేశము, పంజాబ్, ఉత్తర ప్రదేశము, అస్సాము దీని సాగు కనుకూలమైన ప్రదేశములు.

# 70. లొద్దుగు

SYMPLOCOS RACEMOSA Roxb. - లోధ్

కుటుంబము : సింప్లొకేసి

| భారతీయ పేర్లు : హింది | - లోధ్ |
|---|---|
| అస్సాము | - లపోంగ్-డేంగ్, ఢింగ్‌లమాకి |
| బెంగాలీ | - లోధ్ |
| గుజరాతీ | - లోద్ర |
| మరాఠీ, సంస్కృతం | - లోధ్ర |
| (సింగ్‌భూమ్ | - లుడమ్‌దారు) |

లోధ్ర అను సంస్కృతపు పేరు. ఋతుస్రావము కట్టునని అర్థము. 6 మీ. ఎత్తున పెరుగు చిన్న చెట్టు. 8 నుండి 20 సెం. మీ. పొడవైన

ముదురు ఆకుపచ్చని చర్మమును బోలు ఆకులుండును. మామూలుగా చివరలు కొనదేరును. అంచులు సమానముగా గాని పళ్ళతో గాని యుండును. వృంతము చిన్నది. 8 – 20 మి. మీ. పొడవు. పువ్వులు చిన్నవి. 1.2 సెం. మీ. వ్యాసము. తెల్లగా గాని లేత పసుపు రంగులో గాని గ్రీవములలో చిన్న గుత్తులుగా నుండును. కాయ 1 – 1.3 సెం. మీ. పొడవై ఊదారంగు నలుపులో నుండును.

## విస్తరణ

ఈ చెట్టు మనదేశంలో మధ్య తూర్పు ప్రదేశములందు చిన్న కొండలమీద పెరుగును.

## ఔషధము దాని గుణములు

తాజాగా తీసి, నీడను ఎండించిన చెట్టు బెరడు మందుగా పనిచేయును. ఇది అజీర్తి రోగములకు కంటి జబ్బులకు రేగిన పుండ్ల కుపయోగించును. పంటి చిగుళ్ళు రక్తము కారుచున్నపుడు బెరడు కషాయము నోటిలో పుక్కిలించినచో బాధ నివారింపబడును. పుండ్లకు పడిన దెబ్బలకు, ఇది పట్టు వేసినచో అవి త్వరగా మానును. ఈ మందుకు బిగబట్టే గుణముండుటచే ప్రదర అను స్త్రీల రోగమును అనగా హెచ్చుగా ఋతు స్రావమున్నపుడు దీని నిచ్చినచో అట్టి రోగము నివారించును. ఈ బిగబట్టు గుణము కారణముగా నీళ్ళ విరోచనములు కట్టించుటకు కూడ వినియోగపడును. ఇది ఏనుగు కాలు రోగమునకును, మూత్రములో క్రొవ్వు పదార్థము లున్నపుడు కూడ వాడవచ్చును.

## ఇతర సన్నిహితపు మొక్కలు

ఈ జాతిలోని మరో మొక్క సింప్లొకాస్ పానిక్యులేటా (లోధ్ అని మాత్రమే పిలువబడు) హిమాలయ పర్వతములలో పంజాబు నుండి అస్సాము వరకు పెరుగును. దీని బెరడు కూడ లోధ్ వలెనే ఉపయోగింప నగును. ఇది బలవర్ధనకరము.

# 71. నేరేడు

SYZYGIUM CUMINI (L) Skeels syn. *Eugenia jambolana* Lam.- జంబోలన్

**కుటుంబము :** మిర్టేసి

| **భారతీయ పేర్లు :** | | |
|---|---|---|
| | హిందీ | - జామున్ |
| | అస్సామీ | - జాము |
| | బెంగాలీ | - జామ్, కాలాజామ్, బడాజామ్ |
| | గుజరాతీ | - జాంబు |
| | మళయాళం | - ఞావల్ |
| | మరాఠీ | - జాంభుల్ |
| | ఒరియా | - జాంకొళి |
| | సంస్కృతం | - జాంబల్ |
| | తమిళం | - నాగాయి, సెంబల్ |
| | (లలిత్‌పూర్, యు. పి | - కాక్ జామున్) |

మన దేశములోని సాధారణపు పేర్లు పుస్తకములో పరిపాటియైనవి.

## వర్ణన

నిత్యము పచ్చగా వుండే పెద్ద వృక్షము. చర్మము పలె నున్నగా మెరిసెడి ఆకులు 8-20 సెంటీమీటర్ల పొడవు గలవి. రెండేసి అభిముఖముగా యుండును. పెద్ద గుత్తులలో బూడిద రంగు చిన్న పువ్వులుండును. కోలగా నుండు కాయలు 1.5 నుండి 4 సెంటీమీటర్ల పొడవున, లేతగా నున్నప్పుడు ఊదా రంగులో యుండి పండిన తర్వాత నల్లగా మారును. రసము గల పండ్లకు గింజ యొకటి మాత్రమే యుండును. ఈ పండ్లను మామూలుగా అందరు తినెదరు. తిన్న తరువాత నాలుకకు పెదవులకు నీలి ఊదారంగు పట్టుకొని, చాల గంటల వరకు యుండును.

## విస్తరణ

తేమగల నేలలందు ఆకురాల్చు అడవులలో పెరుగును. కాల్వల కిరు



నేరేడు (*Syzygium cumini*)

వైపు అనేక చోట్ల పెరుగుచుండును. నీటి కొరత ప్రదేశములలో నరుదుగా కనబడును. రాజస్థాన్ ఎడారులలో గూడ రక్షణగల ప్రదేశములలో పాతిన మొక్కలు పెరుగును.

## ఔషధము దాని గుణములు

బెరడు, పండ్లు, గింజలు ఔషధమునకు వినియోగమగును. బెరడు చాల వగరుగా యుండును. అందువలన, గొంతుబాధలకు బ్రోంకైటిస్‌కు ఉబ్బసమునకు రేగిన పుండ్లకు జిగట విరేచనములకు ఉపయోగముగా నుండును. దీనిని రక్త పారిశుధ్ధ్యమున కిచ్చెదరు. కషాయము పుక్కిలించుట కుపయోగపడును. మేక పాలలో దీని చెక్కరసము కలిపి నీళ్ళ విరేచనములకు వాడవచ్చును.

గింజలు, మధుమేహమునకు బాగా పనిచేయును. పండ్లుకూడ అందుకే పనిచేసినప్పటికి గింజల చూర్ణము వలన గుణములు మెరుగుగా నుండును. ఈ ఔషధమును ఇంజెక్షన్ల ద్వారా, సూదుల ద్వారా పంపినచో ఉండెడి మంచి గుణములు నోటిద్వారా లోపలికి పంపిన యుండుటలేదు. మధుమేహ నివారణలో దీనికున్న ఉత్కృష్ట గుణములు బిజాసల్ (భారతీయ కినో చెట్టు) కు లేవు.

## ఇతర వినియోగములు

పండ్లను కోసి తినుదురు. దీని కఱ్ఱ అనేక విధములుగా నుపయోగింతురు.

## ఇతర సన్నిహితపు మొక్కలు

ఈ జాతినందు చాలా ముఖ్యమైనది ఔషధమునకు పనిచేయునది సైజైజియమ్ అరొమేటికమ్ (L.) (Syn. యుజీనియా కేరియోఫిల్లేటా, లవంగము. హిందీ – లవంగ్, లాంగ్)

లవంగములు ఎండించిన పూలమొగ్గలు, చాల పరిమళము గల్గి, ఉద్దీపన కారిత్వము, విరేచనకారిత్వము గలవి. వికారము, డోకులు, కడుపుబ్బరము, అజీర్తి పోగొట్టును.

లవంగములనుండి తీసిన నూనె, విష క్రిములను హరించుటకును, వస్తువులు చెడిపోకుండ నిలుపచేయుటకును వినియోగింతురు. లోపలికి తీసుకొనినచో సుద్రిక్తతను శమింపజేసి, కాల విరోచనమును చేయించును.

## 72. చింత

TAMARINDUS INDICA L. - టేమరిండ్

కుటుంబము : సీసల్పినియే

భారతీయ పేర్లు :

| | |
|---|---|
| హిందీ | - ఇమిలి |
| బెంగాలీ | - అంబ్లి |
| గుజరాతీ | - అంబ్లి |
| కన్నడ | - ఉంచ్ |
| మళయాళం | - అమలం |
| మరాఠీ | - అంబ్లి, చించి |
| ఒరియా | - కెంతులి |
| సంస్కృతం | - అమ్లిక |
| తమిళం | - పులి |

ఆంగ్లనామమే వర్తకములో వాడుక జెందినది.

### వర్ణన

ఒక సెంటీమీటరు పొడవుగల చిరియాకు జంటలు 10-20 వరకు యుండెడి సంయుక్త పత్రములు గల మహా వృక్షము. ఎర్ర చారలు గల పసుపు పువ్వులు చిన్న గుత్తులలో ఆకులతో కలసియుండును. 2-3 సెంటీ మీటర్ల వెడల్పు 8 - 20 సెంటీమీటర్ల పొడవు గల కాయలు, కండగలిగి ఆకుపచ్చ గోధుమ రంగుకు మధ్యరకంగా నుండి, వ్రేలాడుచుండును. నల్లని ఎరుపులో 3 లగాయతు 12 వరకు గింజలు, గుంజులో కూరుకుపోయి యుండును. ఈ గుంజు బహు వ్యాపకమైన చింతపండు (టేమరిండ్).




టేమరిండ్ (*Tamarindus indica*)

## విస్తరణ

భారతదేశమంతటను పొడుగైన బాటల కిరువైపుల వేసి పెంచుదురు. దక్షిణమున, మధ్యప్రదేశమందు విరివిగా వేసి పెంచుదురు.

## ఔషధము దాని గుణములు

పండ్లలోని గుంజు, చింతపండునకు ఔషధ గుణములు గలవు. దీనికి విరేచనకారిత్వమున్నది. నీళ్లలో కలిపి సారము త్రాగినచో చలవచేయును. జ్వరములకు మంచిది. విరోచనములు కలుగుటకిది ప్రత్యేకముగా గాని, యితర వస్తువులతో కలిపి గాని లోనికి పుచ్చుకుందురు. అలా కలిపినప్పుడితర వస్తువుల విరోచనకారిత్వమిది తగ్గించును.

## ఇతర వినియోగములు

దీని కర్ర పుచ్చిపోదు గనుక వ్యవసాయపు పనిముట్లు, గృహోపకరణములు చేయవచ్చును. ముఖ్యముగా వంటచెఱకుగా వినియోగింతురు. కర్ర కాల్చిన బొగ్గుపొడుము తుపాకులలో మందుగా నుపయోగింతురు. ఆకుల నుండి పసుపురంగు తీయవచ్చును. పండ్లనుండి వచ్చు చింతపండుతో వెండి, యిత్తడి మొదలైన సామానులు, గిన్నెలు, చెంబులు, పళ్లెములు మొదలైనవి తోముకొని శుభ్రపరుచవచ్చును. జామ్‌లాంటి గుంజులు తయారు చేయు పరిశ్రమలలో దీని గింజల నుపయోగింతురు. కొన్ని రకముల గుడ్డల పరిమాణములను నిర్ణయించుటకీ గింజల పొడి వినియోగింతురు. కర్రముక్కల సందులలో వేయుటకు గింజల చూర్ణముపయోగపడును.

# 73. తాండ్ర

TERMINALIA BELLIRICA (Gaertn) Roxb - బెల్లిరిక్ మైరోబలాన్

**కుటుంబము :** కాంబ్రిటెసి

| **భారతీయ పేర్లు :** | హిందీ | – బాహిరా |
|---|---|---|
| | అస్సామీ | – భోవియన్, హుల్లుచ్ |
| | బెంగాలీ, గుజరాతీ, మరాఠీ, పంజాబీ | – బాహిరా |
| | సంస్కృతం | – తేలఫల |
| | తమిళం | – అక్కమ్, టాని |
| | (చిట్టగాంగ్ | – బోవారా గోటా |
| | సంతాల్ | – లోపోన్) |

బాహిరా భారతీయ నామము వర్తకములో వాడుక జెందినది. బెల్లిరిక్ అను శాస్త్రీయ నామము యీ మైరోబలాన్‌ను చెబులిక్ మైరోబొలాన్ నుండి ప్రత్యేకించుచున్నది.

## వర్ణన

మొదలు నందు పలకల లాంటి పునాదివ్రేళ్లు పెంచెడి మహా వృక్షము. కొమ్మల చివర 10–25 సెంటీమీటర్ల పొడవు గల ఆకులు గుంపులుగా నుండును. చిన్న కాడలమీద చిన్న, లేత ఆకుపచ్చ పువ్వులు దుర్గంధము గలిగియుండును. కోలగా గోధుమ రంగులో 2–3 సెం. మీటర్ల పొడవు గల కాయలు రోమములతో నిండియుండును.

## విస్తరణ

పశ్చిమ భారతదేశంలో తప్ప మిగత అన్ని ప్రాంతములలోను 1000 మీటర్ల ఎత్తువరకు పెరుగును. మిశ్రమ ఆకు రాల్చు అడవులలో తరచుగా పెరుగును.

## ఔషధము దాని గుణములు

ఎండించిన పండ్లు బాహిరా యను మందుగానగును. ఉదరమునకు



అర్జున (*Terminalia arjuna*)

సంబంధించిన రోగములు, అజీర్తి, నీళ్ల విరోచనములు దీని కాయల చూర్ణము వలన తగ్గును. దీనిని కంటి బిందువులుగా వాడవచ్చును. మెదడుకు బలము చేయును. మూలశంకకు, కుష్టునకు, ఉబ్బు ఖాయిలాకు, జ్వరమునకు గూడ పనిచేయును. సగం పక్వమైన కాయలు విరోచనములు పుట్టించును, ఎండించిన కాయలు విరోచనములను కట్టించును.

ఆయుర్వేద వైద్యమందు ప్రఖ్యాతి వహించిన త్రిఫల చూర్ణములో బాహిరా ఒకటి. మిగతా రెండు అమలోకి (లేక అయోన్లా), హర్రా అనునవి. (క్రింద చూడుడు).

## ఇతర వినియోగములు

నీట నానుతూ యున్నను చెడని కారణమున యీ కర్రతో నావలు, పడవలు, వివిధ రకములైన వ్యవసాయపు పనిముట్లు చేయుదురు.

కాయలలో బంకలాటి అను పదార్థముండి చర్మము శుభ్రపర్చుట కుప యోగించును. బట్టలు, తోళ్లకు దీనితో రంగులు వేయుదురు. సిరాలు తయారుచేయుట కుపయోగించును.

## సన్నిహితపు మొక్కలు

ఔషధమునకు పనికివచ్చు మొక్కలనేకములు టెర్మినేలియా జీనస్ నందున్నవి.

టెర్మినేలియా చెబులా (Chebulic Myrobalan, హిందీ – హోర్, హరాడ్ హర్రా, హరితకి, తమిళం – హరక్కోడి) అనునది తె. బెల్లిరిక మాదిరిగానే విస్తరించియున్నది. ప్రాచీన గ్రంథములలో దీనిని 'అబయత' అని వర్ణించారు. బయత అనగా నొప్పిని పోగొట్టునది గావున అబయత అను పేరుపొందినది. ఇది మధ్య రకంగా గాని, పెద్ద వృక్షముగా గాని పెరుగును.

అరకుచుక్క ఆకారముగల ఆకులు 10–20 సెంటీమీటర్ల పొడవున చివర మొనదేలి యుండును. కొమ్మ చివరలందు గుంపుగా యుండక అభిముఖ జంటలుగా యుండును. ఆకు మొదట రెండు గ్రంథులుండును. కొమ్మల చివర కాడలకు బూడిద రంగుగల పువ్వులుండును. 2–4 సెంటీ మీటర్ల పొడవు గల కాయలు 5 ముఖములుగా నుండును.

చెబులిక్ మైరోబలాన్ లేక హర్రా అను మందుగా ఎండిన కాయలు పనికివచ్చును. దీర్ఘముగా బాధించు పుండ్లకు, కవుకు దెబ్బల వలన వచ్చిన గాయములకు, వాడలకు దీనిని వాడవచ్చును. నోరు పూసినప్పుడు, లేక నోటిలోని పొర వాచినప్పుడు ఇూ కాయల చూర్ణము నీటిలో కలిపి పుక్కిలించినచో బాధలు నివారించును. కరక్కాయలను విరోచనముల మందుగా నుపయోగించవచ్చును. రక్తపు పోటు తగ్గించుటకు గుండెకు బలము చేకూర్చుటకు గూడ వాడవచ్చును.

కాయల చూర్ణముతో పండ్లు కడుగుకొనుచున్నచో చిగుళ్లకు బలము పట్టును. ప్రసిద్ధిగాంచిన త్రిఫల చూర్ణములో ఈ కాయ ఒకటి. ఇది లేహ ములలో వేయు వస్తువు. అట్టి లేహములు యింటి మందులలో మామూలుగా యుండును. వాటిని సేవించుట వలన జీర్ణశక్తి అభివృద్ధి పొంది, కాల విరోచన మగుచుండును.

టెర్మినేలియా అర్జునా (హిందీ – అర్జున్, కాహు, కోహ్వా, సంస్కృతం – ఇంద్రద్రుమం) మన దేశమంతటా కాల్వల కిరువైపులా తేమగల నేలల లోను పెరుగును. దీని బెరడునందు కండరములను బిగబట్టు గుణము గలదు. జ్వరములకు, ఎముకలు విరిగినప్పుడు, గుండెకు పుష్టి చేయుటకు, పడిన దెబ్బలు మాన్పుటకు నుపయోగించును.

ప్రాచీన సంస్కృతపు గ్రంథములలో దీనిని నాడీసరా అని వర్ణించిరి. అనగా నదుల గట్టుల మీద పెరుగునది యని భావము.

# 74. గుడూచి

TINOSPORA CORDIFOLIA (Willd.) Miers - టినోస్పోరా *(Gilo)*

కుటుంబము : మెనిస్పెర్మేసి

| | | |
|---|---|---|
| భారతీయ పేర్లు : | హిందీ | - గిలోయ, గిలో |
| | బెంగాలీ | - గులాంచ |
| | గుజరాతీ | - గుల్‌వెల్ |
| | కన్నడ | - అనిబ్యూల్ |
| | మళయాళం | - అమిరైటు |
| | మరాఠీ | - గుల్‌వెల్ |
| | సంస్కృతం, తమిళం | - అమృతవల్లి |
| | మదరాసు | - తిప్పతీగ |

టినోస్పోరా యను శాస్త్ర నామము వర్తకములో పేరొందినది. భారత ప్రాంతీయ నామము గిలో.

## వర్ణన

కండగల మెత్తని కొమ్మలతో చెట్లమీది కెగబ్రాకెడు తీగ. రావి, మర్రి చెటలోవలె వేళ్లు పై నుండి క్రిందకు వ్రేలాడుచుండును. కొమ్మలపై నందందు తెల్లని గ్రంథులుండును. ఆకులు 5 – 10 సెంటీమీటర్ల పొడవున హృదయాకారమున గాని సంద్రముగా గాని యుండును. 7 నుండి 9 వఱకు తొడిమబుండును. వృంతములు ఆకులకంటె కొద్దిగా పొట్టివి. సూక్ష్మమైన పువ్వులు అడవి, మొగవి విడివిడిగా యుండును. పువ్వుల పుచ్ఛముల గ్రీవములలో మొగ పువ్వులు గుమిగూడి యుండును. ఆడ పువ్వులు విడిగా ఒక్కటొక్కటిగా యుండును. బటాణీ గింజంత కాయలు ఎర్రగా నుండును.

## విస్తరణ

మనదేశ మంతటా ఉష్ణ మండలములలో పెరుగును.

### ఔషధము దాని గుణములు

వేసవిలో దీని కొమ్మలను కోసి, పై తోలు పోకుండా యుంచి ఎండించి నచో నది మందుగా పనిచేయును.

ఇది బలవర్ధనకరము. తెరలు, తెరలుగా వచ్చు బాధలను శమింప జేయును. కామోద్రేకమును పుట్టించును.

వ్రేళ్లు, కొమ్మల నుండి వచ్చు పిండిపదార్థము జిగట, నీళ్ల విరోచనము లకు పనిచేయుటే గాక దేహమునకు పుష్టినిచ్చును.

## 75. గలిజేరు

TRIANTHEMA PORTULACASTRUM L. syn. *T. monogyna* L. - బిషకప్ర

**కుటుంబము :** ఫైకోయిడియే

**భారతీయ పేర్లు :**

| | |
|---|---|
| హిందీ | - లాల్ సాబుని |
| బెంగాలీ | - సాబుని |
| గుజరాతీ | - సటోడో |
| కన్నడ | - ముచ్చుజోని |
| పంజాబీ | - బిష్కప్రా |
| సంస్కృతం | - పునర్నవి |
| తమిళం | - షారునై |

### వర్ణన

విరివిగా శాఖోప శాఖలుగా నేల మీదనే విస్తరించు ఏక వార్షికము. కొమ్మలు మెత్తగా కండతో యుండును. ఆకులు చివర విస్తరించి యుండును. వృంతముల దగ్గర ఆకులతో కప్పబడి చిన్న పూవులుండును. కాయలు కూడ చిన్నవియై ఆకు కాడల చాటున యుండును. చిక్కుడు గింజా కారములో నల్లని గింజలు సూక్ష్మమైన రోమములతో యుండును.

## విస్తరణ

మన దేశ మంతటను విస్తరించి యున్నది.

## ఔషధము దాని గుణములు

దీని ఆకులు మందుగా పనిచేయును. 'పునర్నవై' అను ఆల్కలాయిడ్ ఆకులందు కలదు. ఉబ్బుకాయలావారికి వాడినచో అధిక మూత్రము కలుగును. కాలేయము మూత్ర కుచ్ఛములు వాచినపుడు వాటి యితర రోగములకు బాగుగా నుపయోగించును. రోగమునకు ప్రాథమిక దశలో ఇది వాడినచో తప్పక పని చేయగలదు. దీర్ఘ రోగములకు కూడ కొంత వరకు గుణమివ్వగలదు గాని పూర్తి నివారణ చేయలేక పోవచ్చును.

మొక్క సమూలముగా గర్భస్రావము చేయుట కుపయోగపడునని పరీక్షలు స్థిరపరచినవి. పిల్లల సంచిని ముడుచుకునేట్లు చేయు శక్తి దీని కున్నది.



విశ్వప్రా (*Trianthema portulacastrum*)

### ఇతర సన్నిహితపు మొక్కలు

ట్రయేంతిమాడికేంద్ర అనునది ఈ జాతిలో మరి యొక మొక్క మందులో పనిచేయును. దీని వేళ్లు విరోచనకారియే గాక ఋతు స్రావము తగ్గినపుడును, వృషణములు వాచినపుడుపయోగించును. ఈ మొక్క గర్భస్రావగుణమును పరీక్షింపగా పర్యవసానములింక ఒక నిర్ణయానికి రాలేదు.

## 76. పల్లేరు

TRIBULUS TERRESTRIS L. - గోక్షురు

**కుటుంబము :** జైగోఫిల్లేసి

**భారతీయ పేర్లు :**

| | |
|---|---|
| హిందీ | – గోఖ్రు |
| బెంగాలీ, గుజరాతీ, | – గోఖ్రు |
| మరాఠీ, పంజాబీ | |
| కన్నడం | – నేగలు |
| మళయాళం | – నెరింజిల్ |
| సంస్కృతం | – లఘు గోక్షుర |
| తమిళం | – నెరుంజి |

(అజ్మీర్, మెర్వారా – కాంతి)

మన ప్రాంతీయ నామములే వర్తకములో పరిపాటైనవి.

### విస్తరణ

ఒత్తుగా సూక్ష్మమైన రోమములతో నిండి నేలమీద విస్తరించు మొక్క. సంయుక్త పత్రములు 5 – 8 సెం. మీ. పొడవైన అభిముఖ జంటలుగా నుండును. చిరుయాకు జంటలు 4 – 7 వరకుండును. ఒక్కొక్క చిరుయాకు 8 – 12 మి. మీ. పొడవుండును. లేత పసుపు రంగులోని పువ్వులు 1–1½

సెం. మీ. వ్యాసము కలవి. ఆకులు కెదురుగా పువ్వులు ఒక్కొక్కటిగా నుండును లేక గ్రీవములలో నుండును.

అనేక ముళ్ళతో నుండుటచే వీటి కాయలు అందరికి సులువుగా కనపడును. ఈ కాయలు బట్టలకు, జంతువుల చర్మమునకు బండ్ల చక్రమునకంటుకొనును. సైకిలు నడుపు వారికి కాయలంటే భయం. వీటివల్ల సులువుగా సైకిలు ట్యూబులకు రంధ్రములు పడును. కాయలోని 5 భాగములలోను అనేక గింజలుండును.

## విస్తరణ

మన దేశములో 3000 మీటర్ల ఎత్తువరకు అన్ని ప్రదేశముల యందును ఇది విస్తరించును.

## ఔషధము దాని గుణములు

దీని కాయలు మందుగా పనిచేయును. మూత్ర సంబంధమైన రోగములకు మైధున దౌర్బల్యమునకును బాగుగా పనిచేయును. మేహ శాంతి




గోఖు (*Tribulus terrestris*)

నిచ్చును. కాయల రసమును గౌటు వ్యాధికి మూత్రకుచ్ఛ్ర రోగ నివారణ కుపయోగించును. మూత్రమును జారీ చేయును. కొన్ని పరీక్షల వలన పై గుణములు నిరూపింపబడినవి.

## 77. కాకపల్ల

### టైలోఫొరా, అంతమూల్

TYLOPHORA INDICA (Burm. f.) Merr. syn - *T. asthmatica* Wt. & Arn

కుటుంబము : ఎస్క్లిపియడేసి

| భారతీయ పేర్లు : | హిందీ, బెంగాలీ | – అంతమూల్ |
|---|---|---|
| | మళయాళం | – పల్లిపాల |
| | మరాఠీ | – పిటకారి |
| | ఒరియా | – మెండి |
| | తమిళం | – కాగితమ్ |

టైలోఫొరా యను శాస్త్రీయ నామము వర్తకములో పేరొందినది. అంటామల్ అను పేరు ప్రాంతీయమైనది. అస్త్మాటికా అను ప్రత్యేక నామము ఉబ్బసపు దగ్గునకు ఇది ఉపయోగమని తెలియజేయును.

### వర్ణన

చెట్టు కొమ్మల నంటుకొనే తిరుగుడి తీగ. ఆకు జంటలు అభిముఖముగా 5 – 10 సెం. మీ. పొడవున అరటుచుక్క వలె నుండి చివర మొనదేరి యుండును. పువ్వులు పసుపు రంగులో పెద్దవిగా నుండును. లోపల ఊదా రంగు కలిగియుండును. చిన్న గుత్తులతో నుండును. కాయలు 5 – 10 సెం. మీ. పొడవైన జంటలుగా సూది మొనలు దేలి వంకరలుగా నుండును.

## విస్తరణ

మనదేశంలో తూర్పు మధ్య దక్షిణ ప్రదేశములలో నుండును. మామూలుగా చదును నేలలో నుండి కొండలలో వేయి మీటర్ల ఎత్తు వరకు కనిపించును.

## ఔషధము దాని గుణములు

ఎండించిన దీని వేళ్ళు ఔషధముగా పనిచేయును. ఇపికాక్‌కు బదులుగా దీనిని వాడనగును. ఇది జిగట విరేచనములు కుదుర్చును. దీని కషాయము గాని రసము గాని ఉబ్బసమునకు బ్రోంకైటీస్‌న కిచ్చెదరు. దీనివలన వాంతులు కలిగి శ్లేష్మమును బైటికి నెట్టబడి రోగులకు ప్రశాంతి కలుగును.

# 78. నక్కవుల్లిగడ్డ

URGINEA INDICA Kunth - ఇండియన్ స్క్విల్

కుటుంబము : లిలియేసి

భారతీయ పేర్లు : హిందీ, బెంగాలీ, గుజరాతీ - జంగ్లీజ్ పియా, బాన్ పియాజ్ కోలికాండా

| | |
|---|---|
| గుజరాతీ | - జాంగ్లికాండో |
| మరాఠీ | - రాన్‌కాండా |
| సంస్కృతం | - కోలకండా |
| తమిళం | - నరివెంగాయం |

ఈ జాతికి జెందిన పాశ్చాత్య దేశములలోని మొక్కకు స్క్విల్ అను పేరున్నది. దీనికి సమమైన మొక్క మనదేశంలో పెరిగెడి దానికి ఇండియన్ స్క్విల్ అను పేరు వచ్చినది.

## వర్ణన

కోలగా, తెల్లగా గాని, బూడిద రంగులో గాని ఉల్లిపాయలాంటి దుంపలు గల చిన్నమొక్క. దాని గడ్డలు 5 - 10 సెంటీమీటర్ల పొడవు గలవి. క్రింది ఆకులు, పొడుగుగా సన్నముగా పలుచగాయుండి చివరలు మొన దేలును. నిలువునా పెరుగు పూతకాడ పొడవు 45 సెంటీమీటర్ల ఎత్తు. లేత గోధుమ రంగులోని పువ్వులు, సన్నితమై పొడుగైన గుత్తులలో నుండును. రెండు వైపుల సన్నగిలు కాయలు 1.5 నుండి 2 సెంటీమీటర్ల పొడవైనవి. గింజలు నల్లనివి.

## విస్తరణ

దక్షిణ దేశమందున, బీహారు తూర్పు ప్రాంతములోను, హిమాలయము లందు వాయువ్యంగా 2000 మీటర్ల ఎత్తు ప్రదేశముల వరకు పెరుగ గలదు.

## ఔషధము దాని గుణములు

పైనుండి ఎండిపోయిన రేకలు వొలిచివేసిన పాయలను ముక్కలుచేసి ఎండబెట్టినచో ఇండియన్‌స్క్విల్ మందగును.

డీజిటాలిస్ అను మందుకు సమానమైన గుణములు గలది. ఆలస్యంగా గుణమిచ్చును గనుక పెద్ద మోతాదులలో వాడవలసియున్నది. దీనిని డిజిటాలిస్ వాడవలసిన రోగములకు డీజిటాలిస్ రోగికి పడనప్పుడు ఇది వాడుదురు. గుండెజబ్బులకు, దగ్గుకు, బ్రోంకైటిస్‌కు వాడుదురు. ఇది మూత్రం జారీచేయును.

ఇండియన్ స్క్విల్, పాశ్చాత్య దేశముల స్క్విల్ (Urginea maritima) అంత బాగా పని చేయగలదు. ఇది దీర్ఘ వ్యాధిగానున్న బ్రోంకైటిస్, దాని శ్లేష్మము నివారించునని వైద్య పరీక్షల వలన తెలిసినది.

సాలీనా మనకు 120 క్వింటాల్సు మందు అవసరమగుచున్నది. మన దేశపు రేవడి నేలలందెచ్చట నైనను దీనిని సాగు చేయవచ్చును.

## 79. అపస్మార హరి

VALERIANA OFFICINALIS L. - వేలీరియన్

కుటుంబము : వెలీరియనేసి

భారతీయ పేర్లు : హిందీ – బిల్లిలోటన్, బద్రంగబోయ, జలకన్
మరాఠీ – కలవాల

శాస్త్ర నామమే వర్తక నామమైనది.

### వర్ణన

ఒక మీటరు ఎత్తు వరకు పెరుగు బహువార్షికము. వేరు దుంప కాండము కంటె లావు. అది పిలకలు వేయును. కాండము మెరక పల్లములు గల్గి క్రింద రోమములతోను, పైన నున్నగాను యుండును. కొమ్మల చివర చిన్న గుత్తులలో చిన్న చిన్న తెల్లని పువ్వులుండును. కాయ రోమ రహితమై నున్నగా చిన్నదిగా యుండును.

### విస్తరణ

కాశ్మీరు నందు కొన్ని ప్రదేశములలో మాత్రమే 2500 మీటర్ల ఎత్తున కొండలలో పెరుగును.

### ఔషధము దాని గుణములు

భూమిలోని దుంప, వ్రేళ్లు మందుగా పనిచేయును. వసంత కాలములో వాటిని తీసి నీడను సావకాశముగా యిగిరించవలెను. వెలీరియన్ కేంద్ర నరముల సంస్థ కుద్రేకమును తగ్గించి ప్రశాంతత నిచ్చును. హిస్టీరియా అను నరముల దౌర్బల్య రోగమున కిది వాడుదురు. కడుపుబ్బరములకు గూడ వాడుదురు. పచ్చి దుంపలు, వ్రేళ్లు త్రొక్కి తీసిన రసం, త్వరగా గుణమిచ్చును. ఎండించుట వలన ఈ గుణములు క్షీణించును. పచ్చి దుంప రసమును మత్తు మందుగాను, గుండె జబ్బులను నివారించు మందులలో కలుపుటకును ఉపయోగించుదురు.

## ఇతర సన్నిహితపు మొక్కలు

ఈ జాతికిచెందిన మరొక మొక్క వెలీరియానా జటామాన్సి. (V. wallichii ఇండియన్ వెలీరియన్, హిందీ - ముష్కబల, సంస్కృతం - తగర) అను మొక్క పుష్కలముగా కాశ్మీరు లగాయతు అస్సాము వరకు హిమాలయము లలో దొరకును. దీని గుణములు వె. అఫిసినాలిస్సుకు సమానములు. అది ఉపయోగపడు రోగములకు దీనిని గూడ వాడుదురు.

సాలీనా మనకు కావలసిన వెలీరియన్ 20 క్వింటాల్సు మాత్రమే. మన దేశంలో తూర్పు కొండల మీద దీని సాగుకు వీలుగానున్నది.

## 80. అశ్వగంధ

WITHANIA SOMNIFERA Dunal.

కుటుంబము : సొలనేసి

| భారతీయ పేర్లు : | హిందీ | - అశ్వగంధ |
|---|---|---|
| | గుజరాతీ | - అసన్, ఘోడఅసర్, సాలియానా పోపడ |
| | కన్నడ | - హిరిముద్దినిగిడ |
| | మళయాళం | - అముక్కిరామ్ |
| | మిగత భారతీయ భాషలన్నిటిలో | - అశ్వగంధ |

ప్రాంతీయ నామములే వర్తకనామములో వాడుక జెందినవి.

### వర్ణన

ఒకటిన్నర మీటర్ల ఎత్తు పెరుగు మధ్యతరగతి పొద నక్షత్రముల వంటి సూక్ష్మమైన రోమములతో మొదలు కొమ్మలు ఆవరింపబడి యుండును. రోమసహితములైన అరకు చుక్కలాంటి అకులు 10 సెంటీమీటర్ల పొడవు. పువ్వులు ఒక సెంటీమీటర్ పొడవున లేత అకుపచ్చ రంగులో చిన్నవి.

కొద్ది పువ్వులుగల గుత్తులు పొట్టిగా గ్రీవములలో నుండును. 6 మిల్లీమీటర్ల వ్యాసము గల నున్ననైన యెర్రని కాయలు, గుండ్రముగా నుండి, పెచ్చు పెరిగిన రక్షక పత్రసమితి వలన ఆవరింపబడియుండును. వాటికి పీచుండి పలుచగా నుండును.

## విస్తరణ

మనదేశ మంతటా ఉష్ణ మండలములలో దొరకును. దీనిని సాగు చేయుట గూడ కలదు.

## ఔషధము దాని గుణములు

ఎండించిన వ్రేళ్లు మందుగా పనిచేయును.

ఇది కీళ్లవాతములకు, బలహీనతకు, మైథున దౌర్బల్యమునకు, క్షయ వ్యాధులకు బాగుగా పనిచేయును. మూత్రము జారీ చేయించును. మత్తు మందుగా పనిచేయును. దేహ క్రియల అవరోధములను తొలగించును. దీని వ్రేళ్ల చూర్ణమును వాపులకు, వ్రణములకు పైన పట్టు వేయుదురు.

దీని వ్రేళ్లకు ఆకులకు సూక్ష్మ క్రిములను బేక్టీరియములను హరించు శక్తి ఉన్నదని ప్రయోగముల వలన నిరూపింపబడినది.

## సన్నిహితపు మొక్కలు

విథేనియా కొయాగులెన్స్ Dunal (హిందీ – అక్రి, పంజాబీ – ఖమ్‌జీరా) అనునది భారతదేశంలో వాయువ్య ప్రదేశములలో దొరుకును. దాని పండ్లు, కాయలు, అజీర్తికి, కాలేయ రోగములకు నుపయోగపడును.

# పరిశీలనలు


అఘార్కర్, యస్. పి. 1953. గెజెట్టీర్-బొంబాయి స్టేటు. జనరల్ - ఎ, వృక్ష శాస్త్రము. భా. 1-ఓషధీ భూజములు. బొంబాయి.

బి. పి. సి. 1963. ది బ్రిటిష్ ఫార్మసిటికల్ కోడెక్సు, లండన్.

భండారి, చంద్రరాజ్. 1951 - 1957. వనౌషధి చంద్రోదయ, వారణాశి, 10 భాగములు (హిందీలో).

భట్నగర్, యస్. యస్., హెచ్. సంతపావ్, జె. డి. హెచ్. దేశ, ఎ. సి. మణియర్, యన్. సి. ఘాడియల్లే, యమ్. జె. సాలమన్, యస్. యల్లోర్ అండ్ టి. యన్. యన్. రావు. 1961. బయోలాజికల్ ఏక్టివిటీ ఆఫ్ ఇండియన్ మెడిసినల్ ప్లాంట్సు, ఇండియన్ జె. మెడ్. రెస్. 49 (5) : 799 - 813.

భట్నగర్, యస్. యస్., హెచ్. సంతపావ్, యఫ్. ఫెర్నేండెజ్, వి. యన్. కామత్, యన్. జె. దస్తూర్ మరియు టి. యన్. యస్. రావు. 1961. ఫిజియలాజికల్ ఏక్టివిటీ ఆఫ్ ఇండియన్ మెడిసినల్ ప్లాంట్స్. జె. సై. & యిండస్ట్రి. రెస్. సప్లి, 20 ఎ 1 - 24.

బిస్వాస్, కె. 1956. కామన్ మెడిసినల్ ప్లాంట్సు ఆఫ్ డార్జిలింగ్ అండ్ ది సిక్కిమ్ హిమాలయాస్, కలకత్తా.

బిస్వాస్, కె. అండ్ ఇ. ఘోష్. 1950-1952. భారతీయ వనౌషధీ, కలకత్తా, 2 వాల్యూములు. (బెంగాలీ భాషలో)

చోప్రా, ఆర్. ఎన్. 1958. చోప్రాస్ ఇండిజినస్ డ్రగ్స్ ఆఫ్ ఇండియా. రివైజ్డు బై ఆర్. యన్. చోప్రా, ఐ. సి. చోప్రా, కె. యల్. హండా అండ్ యల్. డి. కపూర్, కలకత్తా.

చోప్రా, ఆర్. యన్. ఆర్. యల్. బాధ్వార్ అండ్ యస్. ఘోష్. 1949. పాయిజనస్సు ప్లాంట్సు ఆఫ్ ఇండియా, న్యూ ఢిల్లీ.

చోప్రా, ఆర్. యన్. అండ్ ఐ. సి. చోప్రా. 1955. ఎ రివ్యూ ఆఫ్ వర్క్ ఆన్ ఇండియన్ మెడిసినల్ ప్లాంట్సు, న్యూ ఢిల్లీ.

చోప్రా, ఆర్. యన్, యస్. యల్. నాయర్ అండ్ ఐ. సి. చోప్రా. 1956. గ్లోస్సరీ ఆఫ్ ఇండియన్ మెడిసినల్ ప్లాంట్సు, న్యూ ఢిల్లీ.

దస్తూర్, జె. యఫ్. 1951. మెడిసినల్ ప్లాంట్సు ఆఫ్ ఇండియా అండ్ పాకిస్తాన్, బొంబాయి.

దత్, యు. సి. 1877. ది మెటీరియా మెడికా ఆఫ్ ది హిందుస్, కలకత్తా.

జైన్, యస్. కె. 1963. స్టడీస్ యిన్ ఇండియన్ ఎత్నోబోటనీ - ప్లాంట్స్ యూజ్ యిన్ మెడిసిన్ బై ది ట్రైబల్సు ఆఫ్ మధ్యప్రదేశ్. బుల్. రిజియన్. రెస్. లేబ్. జమ్ము 1 (2) : 126-128.

జైన్, యస్. కె. 1965. ఆన్ ది ప్రోస్పెక్ట్సు ఆఫ్ సమ్ న్యూ ఆర్ లెస్-నోన్ మెడిసినల్ ప్లాంట్స్ రిసోర్సెస్. ఇండియన్ మెడి. జె. 59 (12) : 270 - 272.

జైన్, యస్. కె. 1965. మెడిసినల్ ప్లాంట్ లోర్ ఆఫ్ ది ట్రైబల్సు ఆఫ్ బస్తర్. యికనామిక్ బోట్. 19 (3) : 236 - 250.

జైన్, యస్. కె. 1967. వనస్పతి కోష్ - ఎ హిందీ - లేటిన్ డిక్షనరీ ఆఫ్ యికనామిక్ ప్లాంట్ ఆఫ్ ఇండియా, ఢిల్లీ.

జైన్, యస్. కె. & సి. ఆర్. తరఫ్దార్. 1963. స్టడీస్ యిన్ ఇండియన్ ఎత్నోబోటనీ– నేటివ్ ప్లాంట్ రెమిడీస్ ఫర్ స్నేక్– బైట్ ఎమంగ్ ది ఆదివాసిస్ ఆఫ్ సెంట్రల్ యిండియా. ఇండియన్, మెడి జర్నల్. 57 (12) : 307 - 309.

జైన్, యస్. కె. & సి. ఆర్. తరఫ్‌దార్. 1967. మెడిసినల్ ప్లాంట్ లోర్ ఆఫ్ ది సంథాల్స్ - ఎ రివైవల్ ఆఫ్ రివ. పి. ఒ. బోడ్డింగ్స్ వర్క్స్. యికనామిక్ బోట్. (ప్రచురణలో నున్నది.)

కీర్తికర్, కె. ఆర్. & బి. డి. బసు. 1935. ఇండియన్ మెడిసినల్ ప్లాంట్స్ (2 వ ఎడిషన్. రివైజ్డ్ బై యి. బ్లేటర్ జె. యఫ్. కేయస్ అండ్ కె. యస్. మాస్కర్, అలహాబాద్, 4 వాల్యూములు).

మహేశ్వరి, పి. అండ్ ఉమారావు సింగ్. 1965. డిక్షనరీ ఆఫ్ యికనామిక్ ప్లాంట్స్ యిన్ ఇండియా, ఢిల్లీ.

మజుమ్‌దార్, జి. పి. 1927. వనస్పతి. ప్లాంట్స్ అండ్ ప్లాంట్ లైఫ్ ఏజ్ యిన్ ఇండియన్ ట్రీటైజెస్ అండ్ ట్రెడిషన్స్, కలకత్తా.

మాస్కర్, కె. యస్. అండ్ జె. యఫ్. కేయస్. 1931 యిండియన్ ప్లాంట్ రెమిడీస్ యూజ్డ్ యిన్ స్నేక్ - బైట్. ఇండియన్ మెడి. రెస్. మెంబర్. 19.

ముఖర్జీ, బి. 1953. ది ఇండియన్ ఫార్మసిటికల్ కోడెక్స్, న్యూ ఢిల్లీ.

నాద్‌కర్ణి, ఎ. కె. 1954. డా. కె. ఎమ్. నాద్‌కర్ణీస్ ఇండియన్ మెటీరియా మెడికా, బొంబాయి. రివైజ్డ్ ఎడిషన్.

సంతపావ్, హెచ్. 1953. ది ఫ్లోరా ఆఫ్ ఖండాల ఆన్ ది వెస్టర్న్ ఘాట్స్ ఆఫ్ ఇండియా. రెస్. బోట్. సర్వే. ఇండియా 16 (1): 1-335.

సుందర్‌రాజ్, డి. అండ్ జి. బాలసుబ్రమణ్యమ్. 1959. గైడ్ టు ఇకానామిక్ ప్లాంట్స్ ఆఫ్ సౌత్ ఇండియా, మద్రాసు.

థాకర్, జయకృష్ణ ఇంద్రజీ. 1926. ప్లాంట్స్ ఆఫ్ కచ్ అండ్ దెయిర్ యుటిలిటీ, బొంబాయి (ఇన్ గుజరాతీ).

త్రివేదీ, పండిట్ కృష్ణ ప్రసాద్. 1961-67. ధన్వంతరి, వనౌషధి విశేషాంక్, అలీఘర్. పార్ట్స్ 1-4 (ఇన్ హిందీ).

యు. యస్. డి. 1955. ది యునైటెడ్ స్టేట్స్ డిస్పెన్సేటరీ. ఫిల డెల్ఫియా.

అఫ్‌హాల్స్, జె. సి. టిహెచ్. 1959. డిక్షనరీ ఆఫ్ ఇకనామిక్ ప్లాంట్స్ న్యూ యార్క్.

వాట్, జి. 1889-1893. ఎ డిక్షనరీ ఆఫ్ ఇకనామిక్ ప్రోడక్ట్స్ ఆఫ్ ఇండియా, 6 వాల్స్. కలకత్తా

రెన్, ఆర్. సి. 1950. పాటర్స్ సైక్లోపీడియా ఆఫ్ బొటానికల్ డ్రగ్స్ అండ్ ప్రిపరేషన్స్. రివైజ్డ్ బై ఆర్. డబ్ల్యూ. రెన్, లండన్.

ఎనోనిమస్ 1948-66. వెల్త్ ఆఫ్ ఇండియా, రా మెటీరియల్స్, 7 వాల్స్ న్యూ ఢిల్లీ.

అనేకమైన సంచికలు సాధారణపు శాస్త్రములు మీద, వినియోగ వృక్ష శాస్త్రము మీద, ఔషధముల మీద, ఔషధముల తయారీ మొదలైన వాటి మీద, ముఖ్యముగా ఈ క్రిందవి పరిశీలింపబడినవి.

ఇండియన్ జర్నల్ ఆఫ్ ఫార్మసీ; ఇండియన్ జర్నల్ ఆఫ్ మెడికల్ రిసెర్చ్; మరియు జర్నల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రీసెర్చ్.